# మీరూ....
# జర్నలిస్ట్ కావచ్చు.

యర్నాగుల సుధాకరరావు, B.Com., జర్నలిస్ట్,
లక్ష్మీనగర్ వీధి, ఆమదాల వలస-532 185.




Phone No. : 08644-23037.




అగ్నికులక్షత్రియులవారివీధి-II, గంగానమ్మపేట, తెనాలి-1.

# Meeroo.... 'JOURNALIST' Kaavatchu !

**By : Yarnagula Sudhakara Rao, B.Com.**


| | |
|---|---|
| ముద్రణ : జనవరి, 1995. | Edition : JANUARY, 1995. |
| అన్ని హక్కులు : జనప్రియ పబ్లికేషన్స్, తెనాలి-వారివి. | All rights reserved by : Janapriya Publications-Tenali. |
| వెల : రూ॥ [illegible]5-[illegible]. | Price : Rs. [illegible]5-[illegible]. |
| ముఖ చిత్రము : ఎల్. రమేష్‌బాబు, విజయవాడ-2. | Cover Design : L. Ramesh Babu, Vijayawada-2. |
| ముద్రణ : పవన్ ప్రింటర్స్, తెనాలి-1. | Printed at : Pavan Printers, Tenali-1. |
| ముఖచిత్ర ముద్రణ : సౌందరమ్ ప్రింటర్స్, మద్రాస్-21. | Cover Printers : Soundaram Printers, Madras-21. |

ప్రతులకు : For Copies :

***Janapriya Publications,***

Agnikula Kshatriyula vari Street-II,

Ganganamma Pet, TENALI-522 201.

# విషయసూచిక (CONTENTS)

## కృ త జ్ఞ తా సు మా లు.....!

'10-8-1974'న "ఈనాడు" ప్రాంతీయ దినపత్రికను తూర్పు కనుమలలో ప్రారంభించి; అప్పటి వరకు గ్రామీణ స్థాయిలో లేని 'గ్రామీణ విలేఖరు'ల ఏర్పాటుకు శ్రీకారము చుట్టి; తెలుగు పత్రికా రంగములో ఎవరూ ఊహించని బృహత్తరకార్యమును సాధించిన మహాశక్తి, మహోన్నత వ్యక్తి శ్రీరామోజీ రావు! "గ్రామీణ స్థాయి వార్తలు విధిగా పాఠకులకు చేర్చాల"న్న ఆయన దృఢ సంకల్పమే... నేడు వేలాదిమంది గ్రామీణ విలేఖరులు తెలుగు గడ్డ నలు దిక్కులా విస్తరించుటకు కారణమైనది. పెద్ద చదువు వులు చదవకపోయినా, చదవనూ-వ్రాయనూ వచ్చిన వారిచే వార్తలు వ్రాయించి.... జర్నలిజాన్ని- సామా న్యుడికి అందుబాటులోనికి తెచ్చిన ప్రప్రథమ వ్యక్తి శ్రీ రామోజీరావు!! ఆయన సృష్టించిన 'గ్రామీణ విలే ఖరుల వ్యవస్థ' "వార్తా ప్రపంచము" ఉన్నంత వరకు సజీవముగా భాసిస్తుందని విశ్వసిస్తున్నాను. తెలుగు నేల నాలుగు చెఱగులా ఉన్న గ్రామీణ విలేఖరులు- ఈ సత్యాన్ని గ్రహించి.... ఆయన ఎడల గౌరవము చూపుట కనీస ధర్మమని భావిస్తు న్నాను.

జర్నలిజ్మ్‌లో- వినూత్న పోకడలకు నాంది పలికిన.... మేరునగధీరుడు శ్రీ రామోజీరావుగారికి.... 'గ్రామీణ విలేఖరు'ల తరఫున.... ప్రేమాభిమానము లతో.... గౌరవాదరములతో.... మనస్ఫూర్తిగా కృత జ్ఞతా సుమాలను సమర్పించుకొంటూ........

మీ

—యర్రాగుల సుధాకరరావు

జర్నలిస్టు & రచయిత

## నా అనుభవము! నా మాట!!

వివిధ తెలుగు దినపత్రికలలో 'జర్నలిస్ట్'గా పదేళ్ళకు పైనే పనిజేసాను. 'కంట్రిబ్యూటర్'గాచెప్పుకోదగిన గుర్తింపునుపొందాను. సంచలన వార్తలు వ్రాయడములో.... కొంతమంది పైరవీకారులు ధనాశ చూపినా, హెచ్చరికలు చేసినా.... వాటికి తలవంచక- నా వృత్తి ధర్మాన్ని పాటించాను. నేను వ్రాసిన అనేక వార్తలు మండల స్థాయిని దాటి, రాష్ట్రస్థాయికి వెళ్ళి; నాకూ - నా వృత్తికీ....చక్కని 'గుర్తింపు'ను తెచ్చిపెట్టాయి! యాజమాన్యము వారు- నా వార్తలకు స్పందించి, తగు బహుమతుల నిచ్చి, ప్రోత్సహించుటయే కాక.... "మీరు కూడా అలా వ్రాయండి!" అని తోటి 'కంట్రిబ్యూటర్స్'కు సూచించారు. ఐతే ...'వ్యాపారము' పేరుతో ప్రభుత్వాన్ని మోసము చేస్తున్న కొంతమంది వ్యాపారస్థులకు.... నా వార్తలు మింగుడు పడలేదు. వీరు- యాజమాన్యము వారికి అనేకమందిచేత ... నాది "యల్లోజర్నలిజ్మ్" అని చెప్పించి.... ఉద్వాసన చెప్పించారు. ఈ విధముగా .. విలేఖరులు వృత్తి పరంగా ఎదుర్కొనే అనేకానేక చేదు నిజాలనీ, అవాంఛనీయ పరిస్థితులనీ- అనుభవ పూర్వకముగా తెలిసికొన్నాను. అటు.... ఉన్నత శిఖరాలను అధిరోహించు అవకాశాలూ; ఇటు ... అధఃపాతాళానికి త్రోసి వేసే దుర్భర పరిస్థితులూ ఎదురౌతాయని గ్రహించగలిగాను.

కొన్ని పత్రికల యజమానులు- విలేఖరులకు సంపూర్ణ సహకారాన్ని, నిరంతర ప్రోత్సాహాన్నీ అందిస్తూ ... సామాజిక సేవకూ, ప్రజా సంక్షేమానికీ.... కంకణము కట్టుకుని 'విజ్ఞాన జ్యోతు'ల్లా, 'చైతన్య వేదిక'ల్లా వర్ధిల్లుతూ ఉంటే.... మరికొన్ని పత్రికల యజమానులు నీతి-నిజాయతీలను త్రోసిపుచ్చి; అక్రమార్జనే ధ్యేయంగా, స్వార్థ-సంకుచిత ధోరణులతో కొనసాగుతూ ... పక్షపాత వైఖరి నవలంబిస్తూ.... ఆ పత్రికనే నమ్ముకుని బ్రతుకుతున్న విలేఖరులను సైతము కడగండ్లపాలు చేస్తూ... పత్రికా రంగానికే అన్యాయము చేస్తున్నారు. అందుకే.... పత్రికా రంగములో.... ముఖ్యముగా విలేఖరి వృత్తిలో మంచి-చెడులు తెలిసిన వ్యక్తిగా ఈ గ్రంథ రచనకు పూనుకొన్నాను. ఈ పుస్తకము.... 'విలేఖరి' వృత్తిలోకి క్రొత్తగా

ప్రవేశిస్తున్న వారికి-'మంచి గైడ్'గా ఉపయోగపడుతుంది. ఈ సరికే విలేఖరిగా కొనసాగుతున్నవారికి- 'టార్చ్‌లైట్'గా వినియోగిస్తుంది.

నా గతానుభవాలను, ఆశయాలను, వర్తమాన పత్రికా ప్రపంచములోని విలేఖరుల స్థితి-గతులనూ.... ఈ పుస్తకము ద్వారా మీ ముందుంచాను. ముఖ్యముగా తెలుగు 'గ్రామీణ విలేఖరు'ల విధులనూ, పరిస్థితులనూ సోదాహరణముగా వివరించాను.

అంతగా.... రక్షణలేని, పెద్దగా హక్కులులేని, నిత్య తాత్కాలిక నేపథ్యములో కొట్టుమిట్టాడుతున్న విలేఖరులు.... చిత్తశుద్ధిగా, నిజాయతీగా, బాధ్యతాయుతముగా, సంఘానికి వెన్నెముకగా, పత్రికలకు పునాదిరాళ్ళుగా, భావితరాలకు ఆశాజ్యోతులుగా, సార్థకసేవలను అందించటానికి వీలుగా ప్రభుత్వము కట్టుదిట్టమైన చట్టాలను-శాసనాలను చేయవలసిన అవసరము చాలా వున్నదని నేను భావిస్తున్నాను.

విలేఖరుల పరిస్థితి ''విందారగించిన పిదప విసిరేసే విస్తరాకు'లా, ''తాలింపు కరివేపాకు"లా కాకూడదనీ; ''ఏఱు దాటాక తగలేసే తెప్ప"గా మాఱకూడదనీ ఈ పుస్తకము ద్వారా తెలియజేసాను.

"గ్రామీణ విలేఖరి" కావాలన్న తలంపుతో "వార్త" లనే పత్రికా ప్రపంచములోనికి అడుగిడ బోతున్న- యువతీ-యువకులకు.... ఈ గ్రంథము "మణి దీపము" కాగలదని విశ్వసిస్తున్నాను.

ఇందులో.... ఏ వార్తను ఎలా సేకరించాలి? సేకరించిన వార్తను ఏ విధముగా వ్రాయాలి? వ్రాసిన వార్తను ఏమి చేయాలి? విలేఖరి లక్షణాలేమిటి? అటు- పత్రికా యాజమాన్యముతోనూ; ఇటు- గ్రామీణ ప్రజలతోనూ విలేఖరులు ఎలా వ్యవహరించాలి? ఇత్యాది అనేక విషయాలను చాలా వఱకు కూలంకషముగా వివరించాననే భావిస్తున్నాను.

ఈ పుస్తకము చివర- "జర్నలిజమ్‌లో- పారిభాషిక పదాలు" పేరిట ఇచ్చిన అధ్యాయము ''కాబోవు విలేఖరుల"కు ఎంతగానో ఉపయోగపడగలదు. ఇందు- పత్రికలవారు ఉపయోగించే పదాలకు

ఇచ్చి.... దానికి ఉచ్చారణ, డిక్షనరీ అర్థమూ, పత్రికా పరిభాషలో వివరణా ఇవ్వబడ్డాయి.

ఈ గ్రంథ రచనను- సాధ్యమైనంత అర్థవంతముగా సాగించాను! నా అనుభవమును, ఆలోచనలను రంగరించాను!! మిగిలిపోయిన మరికొన్ని అభిప్రాయాలను- వేరొక గ్రంథముగా వ్రాయాలన్న సంకల్పమూ వున్నది. పాఠక ప్రముఖులూ, పెద్దలూ- నా ఈ ప్రయత్నాన్ని సహృదయముతో సమాదరించ గలరని విశ్వసిస్తూ.... తమ తమ అమూల్యాభిప్రాయాలను అందజేయగలరని ఆశిస్తూ.... సెలవు తీసికొంటున్నాను.................... మీ ....................

—యర్రాగుల సుధాకరరావు

జర్నలిస్ట్ & రచయిత

---

# మీరూ... జర్నలిస్ట్ కావచ్చు!

## (గ్రామీణ విలేఖరులు కాగోరు వారికి ప్రత్యేకము)

## గ్రామీణ విలేఖరులకు ఇవన్నీ అవసరం

గ్రామీణ ప్రాంత విలేఖరులు కేవలము వార్తలు సేకరించి, మంచి దస్తూరితో వ్రాసి, పత్రికాఫీస్‌కు పంపగానే సరిపోదు. 'జర్న లిజమ్' గూర్చి మంచి అవగాహన, ఇంకా తెలుసుకోవాలన్న కుతూ హలము కూడా ఉండాలి. జర్నలిజమ్‌లో తెలుసుకున్న దానికంటే.... తెలుసుకోవలసినది ఎంతో ఉన్నది. ఆ విధముగా నిరంతరము తెలుసుకొనే విలేఖరులకు మంచి భవిష్యత్ ఉంటుంది. ఈ క్రింద తరుచు పత్రికాఫీస్‌లో వినిపించే కొన్ని పారిభాషిక పదాలను గూర్చిన వివరణలు తెలుసుకుందాము!

## LAY OUT (లే ఔట్)

పత్రిక పేజీలు, కాలమ్స్, బొమ్మలు, ఫోటోలు ఇవన్నీ ఒక పద్ధతిలో నిర్ణయించి తయారు చేస్తారు. పత్రికను పద్ధతి ప్రకారము అందముగా తీర్చిదిద్దినట్లైతే.... చదివే పాఠకుడు హాయిగా చదువుకో గలుగుతాడు. ఈ "లే ఔట్" అనేది పత్రికకు ప్రాణము లాంటిది. వార్తా పత్రికలు సంచలన వార్తలు ప్రచురించినపుడు ఈ లే ఔట్ మీద ఆ వార్త పూర్తిగా ఆధారపడి ఉంటుంది. లే ఔట్ ఆర్టిస్ట్ ఆ వార్తను దాని ప్రక్కనే బొమ్మ లేదా ఫోటోను వేసి రంగరిస్తే.... పాఠకులను విశేషముగా ఆకర్షిస్తుంది. ఉదా॥ : రాజీవ్‌గాంధి హత్య జరిగిన వార్తను ఒక ప్రముఖ దినపత్రిక- నేపథ్యముగా బాంబు ప్రేలుడు డ్రాయింగ్ గీయించి, దాని మీద రాజీవ్ బొమ్మను వేసి ప్రచురించినది. మరో దినపత్రిక పతాక శీర్షికలు బాంబు ప్రేలుడును నేపథ్యముగా వేసి, రివర్స్‌లో అక్షరాలు ప్రచురించినది.

ఇక గ్రామీణ విలేఖరుల వార్తలు- అప్పుడప్పుడూ లే ఔట్ ఆర్టిస్ట్ల చేతులలోకి వెళుతూ ఉంటాయి. "గంభీర వ్యాధికి కోళ్ళ ఫారమ్స్లో వేలాది కోడిపిల్లలు బలి!" ఈ వార్తను జిల్లా ఎడిషన్లో కోడిపిల్ల బొమ్మ పెద్దసైజ్లో వేసి, అందులో ఈవార్త వేస్తుండడము; లాయర్, డాక్టర్ ఎన్నికలలో దిగితే....నల్లకోటు, తెల్లకోటుబొమ్మలు వేసి; వాటి మధ్య వార్త ప్రచురించడము వంటివి మనము చూస్తుంటాము ! ఇది 'లే ఔట్' ఆర్టిస్ట్ల పని! ఈ విధానాన్ని ఉపయోగిస్తూ ... పాఠకులను విశేషముగా ఆకట్టుకొంటుంటాయి పత్రికలు!

## IMPRINT ముద్రణము

ఏ పత్రికలో ఐనా.... ఈ "ఇమ్ప్రింట్" అనేది కచ్చితముగా ఉండితీరాలి. వార్తా పత్రికలలో ఏదో ఒక పేజీలో ఆ పత్రిక సంపాదకుడు, ప్రచురణకర్త,ముద్రాపకుడు,ప్రింటింగ్ప్రెస్ చిరునామాలు ప్రచురించాలి. దీనినే 'ఇమ్ప్రింట్' అంటారు. దీనిని ఆఖరి పేజీలో క్రింద ప్రత్యేకముగా వేస్తుంటారు. పాఠకులు చాలమంది ఈ 'ఇంప్రింట్' చదివి.... ఫలానావారు ఈ పత్రిక ఎడిటర్, పబ్లిషర్ అని తెలుసుకుంటుంటారు.

## INFORMANT (తెలియజేయువాడు)

జర్నలిస్ట్ల దగ్గఱికి వార్తలు నడుచుకుంటూరావు. అలా అని ఊరు-వాడ తిరిగినారావు. కొన్ని కీలకమైన వార్తలు కొంతమంది ఇన్ఫార్మెంట్స్ (వార్త చెప్పే వ్యక్తులు) ద్వారా లభిస్తాయి. ఫలానా తోటలో ఒక యువతి దారుణంగా చంపబడినది. ఈ వార్త కేవలము "అట" కబురుగా వినిపిస్తుంది. విలేఖరికి ఎవరూ చెప్పడానికి సాహసించరు. చెప్తే ... ఫలానావారు చెప్పారని వ్రాస్తే....పోలీస్లు సాక్ష్యానికి వాడుకుంటారని భయము! మరి ఈ హత్యవార్త ఎవరు చెబుతారు? విలేఖరి పోలీస్వారిని అడిగి సేకరించవలసి ఉండగా.... ఇంకా పోలీస్వారు ఆ హత్యను గుఱించి తెలుసుకోని పరిస్థితి ఉన్నప్పుడు.... విలేఖరి తనకు తానుగా ఈ హత్య గురించి వాకబు

చేయలేడు. ఈ పరిస్థితులలో- 'గ్రామతలారి' ద్వారా తొలి సమాచారము రాబట్టుకోవచ్చు! అంటే ... ఇక్కడ ఇన్‌ఫార్‌మెంట్ గ్రామ తలారి అయ్యాడు. ఇలాగే.... అనేక కోణాలలో 'ఇన్‌ఫార్‌మెంట్స్' పాత్రలు విలేఖరులకు ఎదురౌతాయి. ఇలా ఇన్‌ఫార్‌మెంట్స్ వలన అవసరమైన వార్తల సేకరణకు వీలు కలుగుతుంది.

## PUBLIC OPINION (ప్రజాభిప్రాయము)

విలేఖరులు ఎక్కువగా ప్రజలమధ్య తిరుగుతూ, వారితో మంచి సంబంధాలు పెట్టుకొంటూ.... ఎప్పటికప్పుడు ప్రజల మనోభావాలు, వారిలో మొలకెత్తే క్రొత్త ఆలోచనలు, వ్యతిరేకతలను విలేఖరులు సున్నితముగా సేకరించగలగాలి. ముఖ్యముగా ఈ 'పబ్లిక్ ఒపీనియన్' అన్నది వివిధ కోణాలలో వార్తారూపములో ఎప్పటి కప్పుడు అందిస్తూ వుండాలి. ఉదాహరణకు "మునిసిపల్ పన్నుల పెంపుపై ప్రజాభిప్రాయము ఎలా ఉన్నది?" విలేఖరి సేకరించి వ్రాయాలి. అలాగే తఱచు జరిగే రోడ్ ప్రమాదాలు, ఫలానా రోడ్ గతుకులమయము, పైగా నిత్యము అక్కడ ప్రమాదాలు జరుగుతున్నాయి. దీనిపై అధికారుల స్పందన ఏమీ లేదు. ఈ ప్రమాదకరమైన రోడ్ గురించి ప్రజాభిప్రాయమును పెద్ద న్యూస్ ఐటమ్‌గా వ్రాయగలిగితే ... ఆ వార్తకి అక్కడి ప్రజలలో మంచి గుర్తింపు లభిస్తుంది.

ఈ 'ప్రజాభిప్రాయము'మీాద అనేక విషయాలను విలేఖరులు వ్రాసుకోడానికి వీలుంటుంది. ఎన్నికలలో, వరదలలో, తుపానులలో, డయేరియా-కలరా ఉధృతులు ఒకటేమిటి....? అనే కానేక సందర్భాలలో ప్రజాభిప్రాయము సేకరించి వార్తలు వ్రాయవచ్చు.

కొంతమంది విలేఖరులు ఈ ప్రజాభిప్రాయము మీాద వార్తలు పేలవముగా, జుగుప్సాకరముగా వ్రాస్తున్న సందర్భాలూ ఉన్నాయి. "ప్రజాభిప్రాయ వార్తలు" పేరిట కొంతమంది విలేఖరులు కొన్ని కల్లబొల్లి వార్తలు వ్రాయడము, లేనిపోని అభియోగాలు

సృష్టించి, రాజకీయ నాయకుల పైన, ప్రభుత్వోద్యోగులపైన బురద జల్లి వ్రాస్తూ ఉంటారు. ఇది తప్పు! ఇట్టి విలేఖరుల వలననే నిజమైన ప్రజాభిప్రాయ సేకరణ వార్తలను కూడ పాఠకులు నమ్మడము లేదు. ఉదాహరణకు- ఒక దిన పత్రిక- 'T.D.P. పార్టీ' పై ప్రజాభిప్రాయ సేకరణవార్తలను "ఆహా! ఓ హెూ!!" అని వ్రాసేస్తూ.... మొదటి నుండి ఇదే విధానము చూపడము వలన ... ఆ పత్రిక 'తెలుగు దేశము' పార్టీ గురించి నిజాలు వ్రాసినా పాఠకులు నమ్మేస్థితిలో లేరు. అలాగే మరో దిన పత్రిక- 'తెలుగు దేశము' పార్టీ పైన, ఆ పార్టీ నాయకునిపైన అదే పనిగా తీవ్ర విమర్శలను ప్రచురిస్తున్నది. ఈ పత్రిక అప్పుడప్పుడు నిజము వ్రాసినా....పాఠకులు నమ్మడము లేదు.

పై విషయాలనుబట్టి 'ప్రజాభిప్రాయ వార్తలు' వాస్తవమైనవి వ్రాయాలి అనేది విలేఖరులు గ్రహించాలి. ప్రజాభిప్రాయ వార్తల వలన- పాలనా యంత్రాంగము, అధికారులు, నాయకులు వారి వారి పనుల తీరును మార్చుకొనే అవకాశమున్నది.

ఇట్టి వార్తలు ప్రచురించి- ఇటు ప్రజలకీ, అటు ప్రభుత్వానికి పత్రికలు 'వారధి' లా పని చేయాలి. కల్లబొల్లివార్తలు వ్రాయడము విలేఖరులకు, ప్రచురించడము- పత్రికలకు క్షేమము కాదు.

## ప్రజాభీష్టము (PUBLIC INTEREST)

ముఖ్యముగా విలేఖరులు గమనించవలసినది పబ్లిక్ ఇంటెరెస్ట్ అంటే.... ప్రజలకు కావలసినవి మరియు ప్రజాహితమైనవి. ఈ వార్తలు స్వయముగా సందర్భమును బట్టి వ్రాయవలసి వుంటుంది. ఒక గ్రామములో ఇరుపక్షాలు కత్తులు దూసారు. పెద్ద ఎత్తున దాడులు, దారుణ హింసాకాండ, తీవ్రగాయాలు....! ఇట్టి సంఘటనలు ప్రజలలో ఉత్కంఠను రేకెత్తిస్తాయి. చుట్టు ప్రక్కల గ్రామాలలో, సమీప పట్టణ ప్రజలలో, ఆ జిల్లాలో ఈ వార్త పెద్ద సంచ

లన మౌతుంది. కాబట్టి ఆ గ్రామములో జరిగిన సంఘటనలన్నీ-పూసగ్రుచ్చినట్లు పాఠకుల ముందుంచగలిగిన నాడు ఆ విలేఖరికి-మంచి గుర్తింపు లభిస్తుంది. ఇలా 'పబ్లిక్ ఇంటెరెస్ట్'ను బట్టి వార్తలు వ్రాయాలి! సేకరించాలి!!

వేర్వేరు పార్టీలలో ఉన్న ప్రముఖ నాయకులు ఇద్దరు- ఒకరిపై ఒకరు కారాలు-మిరియాలు నూరు కుంటున్నారు. ఇది చాలా కాలముగా జరుగుతున్నది. ఊహించని విధముగా ఆ ఇద్దరు నాయకులు ఒకే పార్టీ నీడన చేరారనుకోండి! వారి వైఖరి, వారి మధ్య సయోధ్య ఎలా ఉందని ప్రజలలో ఒక ఉత్కంఠ, తెలుసుకోవాలన్న కుతూహలము ఉంటుంది. దీన్ని గమనించి.... విలేఖరి ఆ ఇద్దరు నాయకులను కలుసుకొని; వారి వారి మనో భావాలను, వారి మధ్య సయోధ్య ఎలాఉన్నది.... తెలుసుకుని మరీ వ్రాయాలి. ఆ వార్త సంచలనాత్మకమౌతుంది. ఇలా అనేక కోణాల నుండి, అనేక రకాల వార్తలు వ్రాయవచ్చు. ఈ 'పబ్లిక్ ఇంటెరెస్ట్'నే "Plebiscite (జనవాక్యము లేక ప్రజాసమ్మతి)" అని కూడాపిలుస్తారు.

## MAST HEAD

ఈ "మాస్ట్ హెడ్" అనేది పత్రిక పేరుకు సంబంధించినది. వార్తా పత్రిక మొదటి పేజీలో వాడబడే ఆ పత్రిక పేరును శాశ్వతముగా ఒకే టైప్‌లో నిర్దేశింపబడి, వ్రాయించి, ప్రచురిస్తుంటారు. Title (పేరు)ను ఎప్పుడూ పత్రిక మార్చదు. ఒకటి అరా పత్రికలు టైటిల్‌ను వివిధ రకాలలో వ్రాయించిముద్రిస్తుంటాయి.ఇలా ఎప్పటికప్పుడు టైటిల్ రూపాన్ని మార్చుట మంచి పద్ధతి కాదని పత్రికాయాజమాన్యము గట్టిగా నమ్ముతుంది. ఇటీవల ఒక ప్రముఖ తెలుగు దిన పత్రిక ఎడిటర్ మారినపుడు ఆ పత్రిక పేరును రకరకాలుగా వ్రాయిస్తోంది. ఈ పద్ధతి తప్పని కాదు. కానీ భారతదేశ పత్రికలు ఈ తరహా పద్ధతిని ఎప్పుడూ ఆచరించలేదు. వందేళ్ళ చరిత్ర గల ఇంగ్లీష్ దిన పత్రిక 'అమృత్ బజార్', మలయాళ పత్రిక 'మల

యాళ మనోరమ', 'బాంబే సమాచార్' ఇంకా అనేక పత్రికలు ఆ నాటి 'మాస్ట్ హెడ్స్'నే ఈ నాటికీ వాడుతున్నాయి.

## LOGO 'మాటల పద్ధతిలో అచ్చుల కూర్పు'

ఈ 'లోగో'ను రాజకీయ పార్టీలు, వ్యాపార సంస్థలు, వివిధ సంఘాలు వాడుతున్నట్లే ... పత్రికలు కూడ ఉపయోగిస్తున్నాయి. ఇంచు మించుగా ప్రతి పత్రిక ఏదోఒక 'లోగో'ను పెట్టుకొంటుంది. ఈ 'లోగో'ను కేవలము గుర్తింపుకోసము మాత్రమేవాడుతుంటారు. 'లోగో'లు లేని పత్రికలు కూడా ఉన్నాయి. 'లోగో' సాంప్రదాయాన్ని భారతీయ పత్రికలు 90 శాతము వఱకు పాటిస్తున్నాయి.

## GUIDE LINES 'మార్గదర్శక సూత్రాలు'

విలేఖరుల వార్తలు వ్రాసేటప్పడు "అదీ ఇదీ" అని ఒక సరైన కొలబద్ద లేదు. ఐతే.... మేధావులు, శాస్త్రజ్ఞులు, వారి పరిశోధనలు, వారి అన్వేషణలపై వార్త వ్రాసేటపుడు విలేఖరికి ఉన్న పరిజ్ఞానము బహు తక్కువ! అలా అని వారి విషయము వ్రాయడము కుదరదు అనుకుంటే పొరపాటే! విషయ సేకరణలో ఆయా శాస్త్రజ్ఞులు, మేధావుల మార్గదర్శకత్వమును స్వీకరించి; పుష్కల పరిజ్ఞానాన్ని సంపాదించి, ఈ పరిజ్ఞానముతో ఆ వార్తను రంగరించి, మరీ వ్రాయాలి. దీని వలన పాఠకులు హాయిగా చదువుకో గలుగుతారు. ఈ "మార్గదర్శకత్వము" అనేది విలేఖరులకు చాలా అవసరము. విజ్ఞానమనేది అంతులేని సముద్రము వంటిది. ఈ సముద్రములో ఈదాలను కుంటే ... విలేఖరులకు ఆయా శాఖల వారి మార్గదర్శకత్వము ఎంతైనా అవసరమే!

## PRESS GALLERY (విలేఖరుల వేదిక)

విలేఖరులకు ప్రత్యేకముగా ఏర్పాటుచేయబడ్డ స్థలమునే "ప్రెస్ గ్యాలరీ" అని అంటారు. ఈ గ్యాలరీలు ముఖ్యముగా చట్ట సభలలోనూ; ప్రముఖుల సమావేశాలలోనూ, మునిసిపల్ కార్పొరేషన్స్

మరియు మునిసిపాలిటీలలోనూ, మండల సమావేశాలలోనూ విధిగా ఏర్పాటు చేయబడుతుంటాయి. విలేఖరులు వార్తలు సేకరించుకోవడానికి అవకాశము కల్పించడమే ఈ గ్యాలరీల ఉద్దేశ్యము! విలేఖరులు సదరు సమావేశాలలో లీనమై వార్తాసేకరణ చేయాలి. ప్రముఖులు ప్రసంగాలు చేయునపుడు ప్రజలు ఏ విధముగా స్పందిస్తున్నారో.... కనిపెడుతూవుండాలి. విలేఖరి ఎలాంటి స్పందనకు లోనుకాకుండా, నిజాయతీగా వార్తని రాబట్టుకోవాలి.

## PRESS NOTE (వార్తా సూచిక)

ప్రభుత్వ అధికారులు;రాజకీయ నాయకులు-ఈ ప్రెస్‌నోట్‌ను విలేఖరులకు నేరుగా అందిస్తుంటారు. వీటిని పత్రికల భాషలోకి వ్రాసుకుని పత్రిక ఆఫీస్‌కు పంపించాలి విలేఖరి! ప్రెస్‌నోట్‌లో పెడ ధోరణులు, రెచ్చగొట్టే వ్రాతలుంటే....విలేఖరి వాటిని ఒకటికి రెండుసారులు చదివి, ఆ నోట్ తయారుచేసినది ఎవరు అని ఆలోచించాలి. ఉదాహరణకు ఒక M.L.A."ఫలానా హౌసింగ్ కాలనీలో అవకతవకలు జరిగితే....రక్తపాతము జరుగుతుంది. ఎన్నితలలు ఎగురుతాయో చెప్పలేము" అంటూ ఒక దుందుడుకు 'ప్రెస్‌నోట్' వ్రాసిచ్చాడనుకోండి! విలేఖరి ఈ విషయము వ్రాయడములో కొద్దిమార్పులు చేయాలి. "కాలనీలో అవకతవకలు జరిగితే .... సంబంధిత అధికారులను నిలదీస్తారనో, ప్రభుత్వము ముందుంచుతారనో"వార్త వ్రాయాలి. అలాకాకుండా"రక్తపాతాలు జరుగుతాయి, తలలు తెగుతాయి" అని వ్రాసి ప్రజలను రెచ్చగొట్ట కూడదు. ఇట్టి వార్తల వలన పత్రిక స్థాయి, ఆ M.L.A. స్థాయి తగ్గిపోతుంది.

ఒక పోలీస్ ఉన్నతాధికారి ప్రెస్‌నోట్ ఇచ్చారు! అందులో "ఫలానా గ్రామములో అలజడులు, దోపిడీలు, హింసకు పాల్పడిన వ్యక్తులు ఎంతటివారైనా సరే వదలిపెట్టము! వారిని బట్టలూడదీసి ఊరు-వాడా ఊరేగిస్తాము!! పిట్టలను కాల్చినట్లు కాల్చిపారేస్తాము!!! మర్యాదగా లొంగిపోండి!!!! మారణాయుధాలనుఅప్పగించండి!!!!!"

అని ఉన్నది. ఈ ప్రెస్‌నోట్‌ను విలేఖరి మార్చవలసిన పనిలేదు. కారణము బాధ్యతగల పోలీస్ ఉన్నతాధికారులు ఒకటికి రెండు సార్లు ఆలోచించుకుని మరీ 'ప్రెస్‌నోట్' లిస్తుంటారు. ఇలాంటి హెచ్చరికలు లేకుంటే ... నేరస్థులతో సమస్య పరిష్కారము కాదు. ఇటీవల సంఘవ్యతిరేక కార్యకలాపాలపై పోలీస్ ఉన్నతాధికారుల తీవ్రస్పందనను పత్రికలు వేస్తున్నాయి :

Press Report (పత్రికా సమాచారము) Press Release (పత్రికా ప్రకటన)లు కొద్దితేడాలతో ప్రెస్‌నోట్‌ను పోలి; ప్రెస్‌నోట్‌తో కలిసి పోయి ఉంటాయి.

## ORAL (నోటిద్వారా చెప్పేది)

గ్రామీణ విలేఖరులకు ఎక్కువగా లభించే సమాచారము Oral గా ఉంటుంది. దీనిని చాలాజాగ్రత్తగా సేకరించుకోవాలి. ఏ ఒక్కరూ వ్రాతపూర్వకముగా సమాచారము ఇవ్వరు ఇవ్వడానికి ధైర్యంగా ముందుకురారు. కొంతమందైతే....Oral గా గబగబా చెబుతుంటారు. ఇవన్నీ షార్ట్‌హ్యాండ్‌లో వ్రాసినట్లుగానే విలేఖరి వ్రాసుకోవాలి. వార్తవ్రాసేటప్పుడు చాలాజాగ్రత్తగా వ్రాయాలి. లేనిపోనివి కలిపించికొనివ్రాయకూడదు. కొంతమంది నాయకులు, ప్రభుత్వాధికారులువిలేఖరులను చూసినవెంటనే పరిసరాలనుమఱచిపోయి అదేపనిగా వాగుతుంటారు. ఆ వాగుడులో నవరసాలు గుప్పిస్తారు. తరువాత అది వార్తరూపములోవస్తే ...అలా "అనలేదే?" "ఇదంతా విలేఖరి కావాలని వ్రాసాడు!" అని ఎదురు తిరుగుతారు.

కాబట్టి నోటిద్వారా చెప్పేవి విలేఖరులు జాగ్రత్తగా వ్రాసుకోవాలి. తీవ్రస్థాయిలో ప్రేలితే.... వాటిని రిపోర్టర్స్ అందరు వ్రాస్తే ... వ్రాయడము లేదా మానుకోవడము చేయాలి. తెగించి వ్రాస్తే.... ఆ విలేఖరే దోషిగా మిగులుతాడు. విలేఖరులు కాబోయే వారికి పదేపదే చెప్పేది ఒక్కటే ...! తెలుగు దినపత్రికలలో పని

చేసే విలేఖరులు- ఏ క్షణము ఉంటారో ...? ఏ క్షణము ఊడి పోతారో....? ? తెలియదు. కాబట్టి ఈ Oral వార్తలు వ్రాసే టప్పుడు చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి. లేదంటే ...వాగుడు కాయ నాయకులు, అధికారులు.... విలేఖరినే తప్పుపడతారు.

## PRESS CONFERENCE
## విలేఖరుల సమావేశము

"ప్రెస్ కాన్ఫరెన్స్" అంటే పత్రికా విలేఖరుల సమావేశము! కొందఱు ప్రముఖులు, అధికారులు, ప్రతినిధులు ఈ పత్రికా విలేఖరుల సమావేశము ఏర్పాటు చేసి- ముఖ్యమైన వార్తలు ప్రజలకు అందిస్తూ ఉంటారు. ఈ సమావేశాలకు తఱచు గ్రామీణవిలేఖరులు హాజరౌతుంటారు. బాధ్యతగా వెళ్ళి, విషయ సేకరణతో వెనుదిర గడము వఱకే విలేఖరులు చేయాలి. అనవసరముగా, అనుచితముగా ప్రవర్తించరాదు. "ఈ వార్త రావాలి!" అంటే ... "ఇంతమొత్తము కావాలి!!" లేదా "ఫలానా పని లేక వస్తువు బహుమతి రూపములో ఇవ్వాలి!" అని కోరడము వంటివి విలేఖరులు చేయకూడదు. దీని వలన ప్రజలకు విలేఖరులపై చెడ్డ అభిప్రాయము కలుగుతుంది! "కంచే చేను మేసినట్లు"గా ఇలాంటి విలేఖరులు ఉండుట వలన.... ఈనాడు 'జర్నలిజ్మ్' స్థాయి తగ్గిపోతున్నది.

సమావేశములో చక్కగా ప్రశ్నలువేసి, విషయాన్ని రాబట్టు కొని వార్త వ్రాయాలి. ఇలాటి సమావేశాలలో- పెద్దగా కష్టపడ కుండానే వార్త లభిస్తుంది. పైగా ప్రముఖులను కలుసుకొనే అవ కాశము లభిస్తుంది. మంచి వార్తతోబాటు... క్రొత్త విషయము సేకరించుకోడానికి వీలు కలుగుతుంది. కాబట్టి ప్రెస్‌కాన్ఫరెన్స్‌కు తప్పని సరిగా ప్రతి విలేఖరి వెళ్ళి, విషయ సేకరణ చేయాలి.

## PHOTO JOURNALISM
## ఛాయాచిత్ర వార్తా వ్యాసంగము

విలేఖరులు విధిగా చిన్నదో... పెద్దదో కెమేరా ఒకటి తమ వద్ద ఉంచుకొనుట మంచిది. అందులో ఎల్లవేళల Film Reel

ఉండునట్లుగా జాగ్రత్త పడాలి. ఏ క్షణము ఏ దృశ్యాన్ని ఫోటో తీయవలసి వస్తుందో తెలియదు. జర్నలిజ్మ్‌లో ఫొటోల ద్వారా విషయాల దృశ్యాలను పాఠకుల ముందుంచి సంచలనము సృష్టించ వచ్చు. విలేఖరులతో బాటుగా.... ఫొటోలు తీయడమే ప్రధాన వృత్తిగా గలవారు కూడా వుంటారు. వీరిని "ఛాయాచిత్ర ప్రాత్రి కేయులు" అని పిలుస్తారు. ఫొటో జర్నలిజ్మ్‌లో కొన్ని ముఖ్య అంశాలు తెలుసు కొందాము!

ఇటీవల దినపత్రికలలో వార్తలతోబాటు అనేక ఫొటోలు కని పిస్తున్నాయి. అవన్నీ కేవలము ప్రారంభోత్సవములు, శంకుస్థాప నలు, ధర్నాలు, గతుకులరోడ్స్ ఇలాంటి వాటికే పరిమిత మౌతు న్నాయి. సంచలనాత్మకమైన ఫొటోలు వేస్తే...అడ్వర్‌టైజ్‌మెంట్స్ కోల్పోతామనే భయముతో పత్రికలు వేయడము లేదు.

సంచలనమైన ఫొటోలు చాలా రకాలున్నాయి. నాటి రోజు లలో అప్పటిప్రధాని కొడుకు ఏదోవిషయముపై ప్రధాని చెంపమీద కొట్టాడు. "చెయ్యెత్తినట్లు"గా Blitj అనే ఇంగ్లీష్ వారపత్రిక ఫొటో ప్రచురించింది. ఆ వార్త, ఫొటో సంచలనము రేపాయి! బ్లిట్జ్ సంపా దకుడిపై ఆ పార్టీ నాయకులు కారాలు మిరియాలు నూరడముతో... ఆ సంపాదకుడు అదే ఫొటోను మరల ప్రచురించి "ప్రధానిని అభి నందిస్తున్న తనయుడు"గా వ్రాసాడు. ఇది జాతీయస్థాయి ఐతే.... ఇక గ్రామీణ విలేఖరుల స్థాయిలో ఫొటో జర్నలిజ్మ్ గూర్చి తెలుసు కుందాము....!

ఒక జిల్లాఅధికారి ప్రతిపక్ష M. L. A. ఇంటికి విందుకువెళ్ళి ఆ M. L. A. చెవిలో గుసగుసలాడు తున్న ఫొటోను ఒక విలేఖరి తీసి, వార్తతోబాటు పత్రికకు పంపాడు. ఆ ఫొటో వార్తను పాలకపక్ష M.L.A. నేర్పుగా తన పార్టీ అధిష్ఠాన వర్గము ముందుంచి సదరు జిల్లా అధికారిని శంకరగిరి మాన్యాలు పట్టించాడు. ఈ ఫొటో తీసిన విలేఖరికూడ ఆసందర్భములో కాకతాళీయముగాఎదురైన దృశ్యాన్ని

తీసి వార్త వ్రాయలేదు. కావాలని అట్టిసందర్భము కోసము కాచుకొని ఉండి ఆ ఫొటో తీసి మరీవార్త వ్రాసాడు.

అలాగే ...ఇద్దరు M.L.A. లు ప్రతిపక్ష పార్టీ నేత ఇంట విందుకు వెళ్ళిన వైనము ఫొటోలతో సహా ఒక చిన్న తెలుగు పత్రిక ప్రచురించినది. ఫలితముగా ఆ జంట M.L.A. లను బహిష్కరించింది ఒక ప్రాంతీయ పార్టీ! ఇక నిధుల దుర్వినియోగానికి సంబంధించిన ఫొటోలు ప్రభుత్వ సొమ్ము దుబారాకు సంబంధించిన పత్రాల ఫొటోలుప్రచురిస్తే....ఆ అధికారులపై తీవ్రచర్యలకు ఆస్కారము కలుగుతుంది. ఇలాంటివన్నీ ఫొటో జర్నలిజంలోనికే వస్తాయి.

ఒక ఏకోపాధ్యాయ బడిలో నియమితుడైన ఒక టీచర్— తన బదులుగా మరొక వ్యక్తిని టీచర్‌గా అక్కడ ఏర్పాటుచేసి .... స్వగ్రామములో ఉండి, తన స్వంతపనులు చేసుకొంటూ ....ప్రభుత్వాన్ని మోసము చేస్తున్నాడు. ఈ ఉదంతము ఫొటోలతో సహా వార్తగా ప్రచురించబడినది. దానితో ఆ టీచర్ గుట్టురట్టు ఐనది. ఇలా చాలాచాలా విషయాలను ఫొటోలతోసహా ప్రచురించడానికి వీలున్నది. గ్రామీణ విలేఖరులు ఫొటోలు తీయడము తప్పక నేర్చుకొని వుండాలి. ఫొటోలతోసహా ప్రచురించబడే వార్తలకు మంచి ప్రాముఖ్యత ఏర్పడుతుంది.

## PLAYCARDS (ప్రకటన పత్రాలు)

గోడలపై అంటించే చిన్న నోటీస్‌లు, విజ్ఞాపన పత్రాలను "ప్లేకార్డ్స్" అని అంటారు. వీటి ద్వారాకూడా వార్తలను రాబట్టుకోవచ్చు. బ్యాంక్స్ బంగారు ఆభరణాలను వేలము వేస్తుంటాయి. ఇందుకు సంబంధించిన వేలమును ఫలానా తేదీనాడు బ్యాంక్ ఆవరణలో నిర్వహిస్తున్నట్లుగా తమ నోటీస్ బోర్డ్‌లో అంటిస్తుంటారు. ఈ నోటీస్‌ను కేవలము బ్యాంక్ కస్టమర్స్‌లో కొంతమంది మాత్రమే చూచి తెలుసుకొంటారు. దీనిని పత్రికలవారు అడ్వర్‌టైజ్

మెంట్స్ రూపములో ప్రచురిస్తారు. ఇటువంటి ఏడ్స్‌వలన పత్రికల వారికి డబ్బువస్తుంది. దీనిని వార్తగా వ్రాయడానికి గ్రామీణ విలేఖరులు నేరుగా బ్యాంక్ మేనేజర్‌ను కలుసుకొని ...వేలము విశేషాలు తెలుసుకొని వార్త వ్రాయవచ్చును.

అలాగే ...మండల రెవెన్యూ ఆఫీస్‌లలోని నోటీస్‌బోర్డ్‌లలో శిస్తువసూళ్ళు, వరదబాధితుల సహాయనిధి వివరాలు, వరదలో మేటవేసిన భూముల వివరాలు, అగ్నిబాధితుల సహాయ విషయము, పాముకాటుకు గురైన వారి సహాయ విషయము వంటివి "ప్లేకార్డ్" రూపములో అంటించబడి ఉంటాయి. ఇవన్నీ గ్రామీణ విలేఖరులకు వార్తలే ! ఐతే...,కేవలము అలా అంటించబడిన నోటీస్‌ల పైనే ఆధారపడకుండా సంబంధిత అధికారులనుకూడా కలుసుకొని ...వారి నుండి పూర్తివివరాలు సేకరించి వార్తలు వ్రాస్తే... ఆ వార్తలు ప్రాముఖ్యతను పొందుతాయి.

## NEWS MONGER
## 'సమాచారములు చెప్పుకొను వాడు'

లేని వార్తలను కల్పించడము, పుట్టించడమువంటివి అక్కడక్కడ జరుగుతుంటాయి. ఈ కాల్పనిక వార్తలవలన ఒక్కోసారి ప్రమాదాలుకూడా ఏర్పడుతుంటాయి. కొంతమంది పత్రికలకు ఎక్కి తామేదో గొప్పవ్యక్తులమని చాటుకునే ప్రయత్నములో అబద్ధపు వార్తలను సృష్టిస్తుంటారు.

ఒక బస్తీలో ఒక డాక్టర్ తనవద్దకు వచ్చే పేషెంట్స్‌కు వైద్యము చేస్తూ...దేశరాజకీయాలనుండి గ్రామ రాజకీయాలవఱకు ఉన్నవి-లేనివి కల్పించి చెప్పడము అనవాయతీ! పేషెంట్స్‌కి తెలుసు ...ఇవన్నీ కల్లబొల్లి కబురులని! ఐనా....వైద్యము చేయించుకొనేదాకా తప్పదని వింటుంటారు. ఒకసారి ఆ డాక్టర్ "నాలుగు లక్షలున్న....కులము B.C. నుండి O.C. లోనికి మారుతున్నది. అందుకు సంబంధించిన ప్రభుత్వ పత్రాలు నావద్దఉన్నాయి !"

అని వార్త పుట్టించాడు. క్షణాలలో ఆ వార్త పట్టణమంతా ప్రాకి పోయింది. విలేఖరులు వ్రాసారు. నిజమని నమ్మిన ....... కులము వారు బంద్‌లు నిర్వహించారు. చివరికి ఆ వార్త "Bogus (బూటకము)"అని తేలింది. ఇలాంటి కల్పిత వార్తలు ఎంత ప్రమాదాన్నైనా కొనితెస్తాయి. కాబట్టి విలేఖరులు వ్రాసేముందు వార్తస్థాయిని, ఇచ్చేవారి స్థాయిని అంచనా వేసుకోవాలి. ఎవరు ఏదిచెప్తే ....అది వ్రాయకూడదు. అలాఐతే ... 'జర్నలిజ్మ్' దిగజారిపోతుంది. బోగస్ వార్తలను కల్పించే వ్యక్తులను జర్నలిజ్మ్‌కి దూరముగా ఉంచుట ఎంతో శ్రేయస్కరము !

## NEWS-LETTERS
### (సమాచారము తెలుపు ఉత్తరాలు)

విలేఖరులు, స్పెషల్ రిపోర్టర్స్, కరస్పాండెంట్స్ నుంచి కాకుండా.... వార్తలకు సంబంధించి పాఠకులనుండి నేరుగా వచ్చే ఉత్తరాలను "న్యూస్‌లెటర్స్"అని అంటారు. అన్ని భాషా పత్రికల వారు న్యూస్ లెటర్స్ వేస్తుంటారు. "తమ వీధిలో ఒక్క వీధి దీపము వెలగడము లేదు" అని, "కాలువలలో మురికి పేరుకుపోయింది", "కుళాయిలు పగిలి పెద్ద నీటిగుంటలు ఏర్పడ్డాయి" అని పాఠకులు పత్రిక ఆఫీస్‌లకు వ్రాస్తూ వుంటారు. ఇవే కాకుండా ... జాతీయ-అంతర్జాతీయ సమస్యలపై ఉత్తరాలు వ్రాసే పాఠకులూ ఉంటారు. "ఉత్తరాల శీర్షిక"లో ఇవన్నీ ప్రచురించబడుతూ ఉంటాయి.

గ్రామీణ విలేఖరులు విధిగా ఈ "ఉత్తరాల శీర్షిక"ను ప్రచురింప బడ్డాక చదివితీరాలి. వీటిద్వారా మంచి వార్తలు వ్రాయవచ్చు. "M.R.O. ఆఫీస్‌లో డబ్బిస్తేగాని పేదవారికి పట్టా ఇవ్వరట" అని ఒక పాఠకుడు వ్రాసుకున్న లేఖ చదివిన ఒక విలేఖరి- ఆ లేఖను ఆధారము చేసుకొని M.R.O. కార్యాలయములో ఈ 'పట్టాల భాగోతము' మొత్తమును వెలికి తీయగలిగాడు. అలాగే....అనేకానేక అవినీతి కుంభకోణాలను వెలికి తీయవచ్చు.

'న్యూస్-లెటర్స్' ద్వారా గ్రామీణ విలేఖరులు ఇతరత్రా చాలా విషయాలు సేకరించుకోవడానికి వీలౌతుంది."ఫలానా గ్రామములో హరిజనులకు- క్షౌరకులు గడ్డాలు గీయరు. ఎందుకీ వివక్షత?" అని ప్రచురించబడ్డ ఒక న్యూస్‌లెటర్ ఆధారముగా ... ఒక గ్రామీణ విలేఖరి ఆ మండలములో ఈ తరహా గ్రామాలు ఎన్ని ఉన్నాయో.... ఆరాతీసి; Six Columns వార్తవ్రాసి సంచలనము సృష్టించాడు. కాబట్టి న్యూస్ లెటర్స్ ఆధారముగా మంచి వార్తలు వ్రాయడానికి వీలుకలుగుతుందని విలేఖరులు తప్పక గ్రహించాలి. కొన్ని పత్రికలు గ్రామీణ విలేఖరులు వ్రాసిన వార్తలను కూడా .... ఆకాశ రామన్న వంటి కల్పిత పేరులతో న్యూస్ లెటర్స్ వేస్తుంటాయి. కొన్ని వార్తలు నేరుగా న్యూస్ లెటర్స్‌గా దర్శనమిస్తున్నాయి.వీటిని ఆ విలేఖరి వ్రాసినందుకు ఏవిధమైన పారితోషికము ఇవ్వరు.

## FOURTH ESTATE "పత్రికా రంగము"

"దేశానికి వెన్నెముకలాంటి నాలుగు స్తంభాలలో ఒకటి పత్రికా రంగము"అనివిజ్ఞులు గుర్తించారు. ఈ గుర్తింపు కలకాలము నిలవాలంటే.... జర్నలిస్ట్‌లందరూ తమవంతు కృషి, శ్రమ, నిజాయతీలను కనబరచాలి. ఇటీవల జర్నలిజ్మ్ వెర్రితలలు వేస్తున్నదని భావిస్తున్నారు "సంచలన వార్తలు" పేరిట అడ్డదారులలో వార్తలు సేకరించి- పత్రికలలో వేయడము,బ్లాక్‌మెయిలింగ్ కూడా పెరిగిందని విమర్శలు అన్ని భాషా పత్రికలమీద వస్తున్నాయి. "జర్నలిజ్మ్" అన్నది- సమాజ శ్రేయస్సును కోరువారూ, మేధావులూ, మానవతావాదులూ చేయదగ్గది. కాబట్టే కుక్కమూతి పిందెలవంటి కొంతమంది జర్నలిస్ట్‌లున్నా.... వారిని గణనలోనికి తీసికోకుండా- ప్రజలంతా (90%) జర్నలిస్ట్‌లపై మంచి అభిప్రాయాన్నే కలిగిఉన్నారు.కాబట్టి వారి నమ్మకాలను, మంచి అభిప్రాయాలను- మంట కలుపకుండా ఎవరికి వారే నిజాయతీ ప్రదర్శించవలసి ఉన్నది. ప్రలోభాలకు

లొంగి ఏ తప్పుడు దారిలోనూ జర్నలిస్ట్ నడువకూడదు. 'జర్నలిజ్మ్' అనే కలము పోటుతో పబ్బము గడుపుకోకూడదు. 'జర్నలిజ్మ్' అనే కలాన్ని- 'కరవాలము'గా ఝళిపించి ప్రజాద్రోహులను బయట పెట్టాలి.

## KEY STONE [పరౌలిక సిద్ధాంతము]

వార్తలలో ప్రధాన సూత్రమును ఎప్పుడూ మఱువకూడదు. కీస్టోన్; Key-Projects (కీలకమైన ముఖ్యపథకాలు) Key-Note (అతి ప్రాధాన్యత) వీటిని- ప్రముఖ వార్తలు వ్రాయునపుడు విస్మరించకూడదు. ప్రముఖ వ్యక్తులు ఇచ్చే సందేశాలను, మహోన్నతుల సందేశాలను ఆధారము చేసుకొని వార్తలు వ్రాయాలి. ఆ సందేశాలలో కీలకమైన దానిని విలేఖరి ఎంపిక చేసుకొని Lead Point (దారిచూపు ముఖ్యాంశము) వ్రాయాలి. 'లీడ్‌పాయింట్' వ్రాసాక వార్తలో దాన్ని విస్మరిస్తే ... మొత్తము వార్తంతా పేలవముగా తయారై; చదివే పాఠకుల పెదవి విఱుపులకు గుఱౌతుంది. తత్వవేత్తలు, శాస్త్రజ్ఞులు, పీఠాధిపతులు, భగవద్గీతా ప్రచారకుల సందేశాలను వార్తలుగా వ్రాసేటపుడు.... ఆ వార్తలోని కీలకమైన అంశాన్ని విస్మరించకుండా సేకరించి, పత్రికల భాషలో బహు జాగ్రత్తగా వ్రాయాలి.

## INFORMED SOURCES [అభిజ్ఞ వర్గాలు]

గ్రామీణ విలేఖరుల నుండి సంపాదకుల వఱకు ఈ అభిజ్ఞ వర్గాల కథనాలను వ్రాస్తున్నారు. ఇలా వ్రాయడమనేది ఇటీవల ఒక అలవాటుగా మాఱిపోయింది. ఐన దానికీ.... కానిదానికీ.... అభిజ్ఞ వర్గాల భోగట్టా క్రిందవార్తలు వ్రాయకూడదు. నిజాయతీ, అతివాస్తవికతతో కూడినదని రూఢి చేసికొన్న తరువాతనే ఇట్టి వార్తలను వ్రాయాలి. అలాకాకుండా.... ఏదో ఊహించో, ప్రలోభాలకులొంగో ఒక కల్పితమైన వార్తకు "అభిజ్ఞ వర్గాలు" చెప్పినట్లు వ్రాయడము ఆ పత్రికకు ఎంత మాత్రము క్షేమముకాదు.

కొన్ని పత్రికలలో "NTR- శివపూజ చేశార"ని, "చీర కట్టు కొన్నార"ని వార్తలు అభిజ్ఞ వర్గాల కథనము పేరుతో వచ్చాయి. ఇందులో ఎంతవఱకు "నిజమున్నద"ని ప్రజలు ఆలోచించేలోపే.... అసలు అభిజ్ఞ వర్గాల కథనమంటూ మరికొన్ని పత్రికలు "కావాలని ఎవరో కల్పించారు" అని వ్రాసాయి. దీనితో "ఏదైనా కల్పిత వార్తకు 'అభిజ్ఞ వర్గాలు' పేరిట పత్రికలు రంగు పులుముతాయ"ని మేధావులైన పాఠకులు గుర్తించారు. అభిజ్ఞ వర్గాల పేరిట వార్తలు వ్రాసి 'సంచలనము' సృష్టించుట ఏ పత్రికైనా చేయవచ్చును. ఐతే.... ఆ వార్తలో నిజములేకపోతే మాత్రము.... ఆ పత్రిక మనుగడకు ప్రమాద మేర్పడుతుంది. తరువాత వచ్చి నిజము వ్రాసినా.... ప్రజలు"ఆఁ....!అది 'బోగస్ పేపర్'రా....!!దాన్నినమ్మకూడదు!!!" అని పెదవి విఱుస్తారు. అదే.... నిజమైన వార్తలైతే.... ఇక ఆ పత్రికకు ప్రజలు 'బ్రహ్మ రథము' పడతారు.

## LEADING ARTICLE ముఖ్యాంశ సంగతి

పత్రికలలో వెలువడే సంపాదకీయ వ్యాసాన్ని- "లీడింగ్ ఆర్టికల్" అని అంటారు. దీనిని వ్రాసేది- ఆపత్రిక Editor (సంపాదకుడు)మాత్రమే! కొన్ని దినపత్రికలలో పేరుకే ఎడిటర్ తప్ప.... వ్రాసేది ఇతర వ్యక్తులు! సంపాదకీయాలు వ్రాసే వారిలో.... కొద్ది మందే మంచి పేరు-ప్రఖ్యాతులు సంపాదించు కొన్నారు. ఇతరులచే వ్రాయించుకున్నవారు తాత్కాలిక ప్రయోజనాన్ని తప్పితే.... సాధించేది ఏమీలేదు. విలేఖరులు విధిగా పత్రికల్లో సంపాదకీయాలు చదవాలి. వీటివలన ఎంతో విజ్ఞానాన్ని మరెన్నో తెలియని విషయాలను తెలుసుకునే వీలుకలుగుతుంది. ఉదాహరణకు : "నదిలోకి జారిపడ్డ ఎఱ్ఱబస్సు" దీనిపై సంపాదకీయ వ్యాసము వెలువడింది. దీని వలన చదివే పాఠకుడు మొత్తము విషయాన్ని ఒకే చోట చదువుకుంటాడు. పైగా.... ఇటీవల నదులలో ఏయే చోట్ల ఎప్పుడెప్పుడు ఏయే నదులలోకి బస్‌లుదూసుకుపోయాయో? ఎందఱి

దుర్మరణానికి ఎట్టి బస్‌లు కారణమయ్యాయో తెలుస్తుంది. అలాగే.... ప్రపంచదేశాలలో ఏ ప్రముఖ వ్యక్తి మరణించినా; ఏ దేశ అధ్యక్షుడో, ప్రధానో మరణించినా.... వారిని గూర్చి సంపాదకీయాలలో సంక్షిప్తముగా వివరించబడుతుంది. సంపాదకీయాలు- నిరుద్యోగులకు ఉపయోగపడతాయి. సర్వీస్ కమీషన్ పరీక్షలకు పనికి వస్తాయి.

సంపాదకీయ వ్యాసాలు గ్రామీణ విలేఖరులకు రెండు విధాలుగా ఉపయోగపడతాయి. విషయ సేకరణకూ, విజ్ఞానానికీ పరిమితమైన సంపాదకీయాలను మాత్రమే గ్రామీణ విలేఖరులు ఎక్కువగా చదువుతుంటారు. మిగతావి చదవరు. అన్నికోణాలలో దేశ-విదేశ వర్తమాన సంఘటనలపై వ్యాసాలు వ్రాయబడుతుంటాయి. "దేశ ప్రధాని, ఆయన మంత్రివర్గము, మంత్రి వర్యుల ప్రవర్తనపైన అలాగే....గవర్నర్స్,ముఖ్యమంత్రులు,రాష్ట్రమంత్రులపై.... చివరికి రాష్ట్రపతి, ప్రధాన న్యాయమూర్తులపైన కూడా సంపాదకీయ వ్యాసాలు వెలువడుతుంటాయి. ఇవన్నీ ఓపికగా .... తప్పకుండా విలేఖరులు చదువుకోవాలి. అవసరమున్నా లేకపోయినా .... ఇటువంటి విజ్ఞానాన్ని కూడా సంపాదించుకోవాలి. ఇక పోతే....సంపాదకీయాలపై ఆధారపడికూడ విలేఖరులు వార్తలు వ్రాసుకునే అవకాశాలున్నాయి.

గ్రామీణ ప్రాంతాలకు నీటితీరువా, విద్యుచ్ఛక్తి సరఫరా, ఋణాలమాఫీ, సబ్సిడీ ఎరువులు ఒకటేమిటి.... ఈ తరహా సంపాదకీయాలు చదివి, అవగాహన చేసుకొని విలేఖరులు మండల పరిధిలో చక్కని వార్తలు వ్రాయడానికి పూనుకోవచ్చును. కాబట్టి ... విలేఖరులు విధిగా సంపాదకీయ వ్యాసాలు చదవాలి. ఇటీవల ఒక విలేఖరి తను పనిచేసే పత్రికలోని సంపాదకీయము చదివి As it is (మక్కికి మక్కి)గా కాపీచేసి ఒక వార్త వ్రాసాడు. ఆ వార్త చదివిన పాఠకులు కొంతమంది- సంపాదకీయము+వార్త ఈ రెండు Clip-

pings (కత్తిరించిన ముక్కలు) ఆ దిన పత్రికకు పంపారు. అపత్రిక Desk (సంపాదకవర్గము) ఆ విలేఖరిని "ఇలాంటి తప్పుడు పనులు చేస్తే ఉద్వాసన తప్పదు"అని హెచ్చరించింది. విలేఖరులు సంపాద కీయాలు చదవాలి! అందులో ఉన్న సారాంశాన్ని ఆకళింపు చేసు కుని మరో విధముగా తనదైన బాణీలో వార్త వ్రాయాలి తప్ప ... ఉన్నది ఉన్నట్లు వ్రాయడము చాలా తప్పు! ఈ భాగ్యానికి విలేఖరే అక్కఱలేదు. పామరులైనా వ్రాయగలరు. కాబట్టి సంపాదకీయాలను స్ఫూర్తిగా తీసుకోవాలని ప్రతి విలేఖరి గుర్తుంచుకోవాలి.

ఇటీవల దినపత్రికలలో సంపాదకీయాలు వ్రాసే విధానము మాఱిపోయింది. కొన్ని పత్రికలలో జర్నలిజమ్ తెలియనివారు ఎడి టర్స్‌గా చెలామణిఔతూ..పత్రికకు మూలస్తంభమైన ఎడిటర్ పదవిని భ్రష్టుపట్టిస్తున్నారు. ఇంకొన్ని పత్రికలలో పబ్లిషర్ 'ఎడిటర్'గా అవతారము ఎత్తి....వ్రాతలు మాత్రము దినసరి వ్రాతకూలీల చేత వ్రాయించేసుకుంటూ....ఎడిటర్ పోజ్ కొడుతున్నారు. తెలుగు దిన పత్రికలలోకూడా ఈ జాడ్యము ఇటీవల పెరిగింది. "జర్నలిజమ్" అంటే ఏమిటో తెలియనివారు ఈ రకముగా ఎడిటర్స్ ఔతూ .... పత్రికల స్థాయిని తగ్గిస్తున్నారు. ఐతే ...ప్రారంభమునుండి 'డక్కన్ హెరాల్డ్', 'హిందూ' ఇంకొన్ని ప్రాంతీయ దినపత్రికలకు యజ మానులే ఎడిటర్స్‌గా వ్యవహరిస్తూ....వారి వారి పరిధులలో మంచి పేరు సంపాదించుకుంటూనే ఉన్నారు.

ఈనాటి జర్నలిజమ్‌లో ఎడిటర్స్ గడ్డిపోచలుగా మాఱారు. ఏమాత్రము యజమానికి ఆగ్రహము వచ్చినా ఉన్నపళముగా ఆ ఎడిటర్‌ను- చాంబర్‌నుండి బయటకు తోసేస్తున్నారు. యజమానులు ఎడిటర్స్‌గా ఎందుకు అవతారము ఎత్తవలసి వచ్చినది?" అంటే.... పైరవీలు సాగించి, వ్యాపార ప్రయోజనముపొంది, లాభసాటి కాంట్రాక్ట్‌లు సాధించి, ఒకటేమిటి అనేకానేక విధాలుగా పాలక ప్రభుత్వం నుంచి రాబట్టుకునేందుకు ఒక ఆయుధముగా ఈ ఎడిటర్ అనే అవతారము ఎత్తుతున్నారు.

---

నేటి నిరుద్యోగులు అసక్తిగా చదివే సంపాదకీయాల వెనుక వ్రాసే వ్రాతకూలీలు వేరేవారున్నారు. ఆ పత్రికల 'ఇమ్‌ప్రింట్'లో ప్రచురించే సంపాదకుడు పేరుచూసి, ఆ మహాశయుడే వ్రాసాడనుకుంటారు. సభ్య సమాజాన్ని ఈ విధముగా ఆ నకిలీ ఎడిటర్స్ మోసము చేస్తున్నారు. కిరాయికి వ్రాసేవారు పాపము Ghost-writers (తెరవెనుక రచయితలు)గా మిగిలిపోతున్నారు. నిరుద్యోగులు నేటి దినపత్రికల సంపాదకీయాలు ఆధారముగా సర్వీస్ కమీషన్ తదితర పరీక్షలలో నెగ్గుకు వస్తున్నారంటే....ఈ ఘోస్ట్ రచయితల కలము బలము తప్ప జర్నలిజ్మ్ అంటే కొలుకుడు పడని నకిలీ ఎడిటర్స్ కారణము కాదు.

ఏదిఏమైనా సంపాదకీయాలు గ్రామీణ విలేఖరులకు వార్తలు వ్రాయడానికి బాగా ఉపయోగపడతాయి. కాబట్టి విధిగా వాటిని చదవాలి. ఉదాహరణకు "బాణసంచు ప్రేలి నలుగురు మృతి" ఈ వార్తలు"బాణసంచు ఎలాప్రేలింది? నలుగురు ఏవిధముగాబలైనది" వ్రాస్తే సరిపోతుంది. ఐతే....సంపాదకీయ వ్యాసములో గతములో బాణసంచు ప్రేలుళ్ళు....ఆ మండలమందు లేదాజిల్లా యందు ఎప్పుడెప్పుడు జరిగాయి ? ఎంతమందిని బలిగొన్నాయి ?? వివరముగా ఉంటుంది. ఇది గ్రామీణ విలేఖరులకు బాగా ఉపయోగపడతాయి. ఈ విజ్ఞానాన్ని సంపాదించిన విలేఖరులు గతాన్ని త్రవ్వి వార్తలు వాసేస్తున్నారు.

## MYTH కల్పిత కథనము

ఎంత వాస్తవికతా దృష్టితో వార్తలువ్రాసేవిలేఖరులకైనా.... ఒక్కోసారి కల్పిత కథనాలువ్రాసే అవసరమురావచ్చును. కావాలని వ్రాయకపోయినా ... పరిస్థితి అలా త్రోసుకురావచ్చును. ఉదాహరణకు ఫలానా గ్రామములో ఎనిమిదిమందికి 'చేతబడి' చేయబడినందుకు చావుబ్రతుకుల మధ్యవారు ఊగిసలాడ్తున్నారు. దీనికి కారణము ఆ గ్రామములో కొద్దిమంది క్షుద్రవిద్యలు నేర్చుకోవడమేనని

చుట్టు ప్రక్కల గ్రామాలలో ప్రచారమై ఉంటుంది. ఇందులోఉన్న నిజము ఎలాఉన్నా.... పదిమంది నోటవిన్న మాటపైన ఆధార పడి.... విలేఖరి పెద్ద వార్తా కథనాన్ని సృష్టిస్తాడు. ఇందులో అనేక కల్పితాలు చోటు చేసుకొని మరీ ప్రచురణ జరుగుతుంది.

గతములో పైవిధముగానే విని ఒకవిలేఖరి "ఫలానాగ్రామములో తాటిచెట్టంతున్న ఒక 'కొండచిలువ' గ్రామీణులకు కనిపించింది. క్షణాలలో దగ్గఱ కొండలలోకి పోయి అదృశ్యమయ్యింది. ఆగ్రామములో గల కుక్కల్ని, మేకల్ని,దూడల్ని ఆరగిస్తోంది. దీని పైన సంబంధిత అధికారులు తక్షణచర్య తీసుకోవాలిఅని అతిపెద్ద వార్త వ్రాసాడు! తీరా అటవీశాఖ అధికారులు గాలించగా.... తాటి చెట్టు మాదిరి కాకుండా కేవలము రెండు మీటర్లు పొడుగున ఉన్న 'కొండచిలువ' పిల్ల ఒకటి పట్టుబడింది. "ఇది కేవలము చిన్నచిన్న కోడిపిల్లలను, పక్షులను తప్పితే.... మేకలు, కుక్కలు తినలేదు"అని అధికారులు తేల్చి చెప్పారు. ఈ రెండు వార్తలు చదివిన పాఠకుడు ఏమనుకుంటాడు? కాబట్టి MYTH వార్తలు అల్లుట ఎంతమాత్రము మంచిదికాదు.

## MANIFESTO+PANEL
## ప్రకటన పత్రిక+మధ్యవర్తుల జాబితా

ప్రణాళిక, జాబితా అనేవి గ్రామీణ విలేఖరులు ఏనెల కానెల వేసుకోవాలి. అలా వేసుకొంటే ... నెలంతా ఒక పద్ధతిలో మంచి వార్తలు వ్రాయగలుగుతారు. మేనిఫెస్టో రాజకీయ పార్టీలకేకాదు ... విలేఖరులకూఎంతో అవసరము! వార్తలు ప్లాన్‌గా వ్రాద్దామనుకున్న విలేఖరికి- నెలంతా తీరిక లేకుండా వార్తలుంటాయి! ఉదాహరణకు ఈ క్రింద చూడండి!

### MONTHLY PLAN  నెల ప్రణాళిక

మొదటి వారము : మండల సమావేశము, మండలము లోని పంటల పరిస్థితిపై అధికారులతో చర్చలు, వృత్తి పనుల

వారిపై విషయసేకరణ, M.L.A. లేక ఇతర ప్రముఖుల మండల పర్యటన విశేషాలతో బాటు ఆ వారములో ఇతరత్రా కొన్ని వార్తల సేకరణలు!

రెండవ వారము: రైతు సదస్సు, గ్రామాలలో వైద్య పరిస్థితి, గ్రామీణ బ్యాంక్ సమావేశము, సంతలో మూగ జీవాల వధ!

మూడవ వారము : పందుల తెగులుపైన అధికారుల వివరణ, మండుటెండలో విద్యాబోధన, M.L.A. గత హామీలపైన గ్రామీణుల స్పందన!

నాలుగవ వారము : గ్రామాలలో కాలనీల పరిస్థితి, పోరంబోకుల ఆక్రమణ, చెరువులలో చేపల పెంపకము!

ఇలా ఏ నెల కానెల వార్తల జాబితా తయారు చేసుకోవాలి. వీటితోబాటు మన దేశములో ప్రతినెలలో విధిగా ఏదో ఒక పండగ లేక యాత్రలవంటి అనేకానేక విశేష సందర్భాలుంటాయి. వీటిపై వార్తలు కలుపుకుంటే ఆ విలేఖరికి ప్రతినెలా చేతినిండాపని ఏర్పడుతుంది. కనుక వార్తల జాబితాలో ముందుగాతయారు చేసుకోవడము ఎంతో మంచిది.

## MASS COMMUNICATION
## సామాన్య జనులకు సమాచారము పంపుట

ప్రజల కోసమని నిర్దేశింపబడే సమాచారాన్ని విస్తృతముగా ప్రచారము చేయడాన్ని "మాస్ కమ్యూనికేషన్" అంటారు. గ్రామీణ విలేఖరులు మునిసిపాలిటి, మండలస్థాయిలలో ఈ తరహా వార్తలు వ్రాయడానికి వీలుకలిగే అవకాశాలు కొన్ని ఉన్నాయి. ఉదాహరణకి మునిసిపాలిటి క్రొత్తగాపన్నులు పెంచి;"నెలాఖరులోగా చెల్లించాలి! లేదంటే.... మీ ఆస్తులు జప్తుచేస్తామ"ని దండోరా వేయిస్తుంది. విపరీతముగా పెరిగిన పన్నులపై ప్రజలలో తిరుగుబాటు కనిపిస్తుంది. ఆ తరువాత ప్రభుత్వము పెంచిన పన్నులను చాలా

వటకు తగ్గిస్తుంది. ఈ సమాచారము మునిసిపల్ పరిధిలోగల కొన్ని వేలమందికి తెలియాలి. ఇందుకు ప్రభుత్వము మొత్తము మునిసిపాలిటిలలో ఏ శాతము ఏ విధముగా పెంచింది, రేడియో, T.V., వార్తా పత్రికల ద్వారా ప్రసారము చేస్తుంది. సహజముగా మునిసిపాలిటీలు కొన్ని గ్రేడ్స్‌గా విభజించబడి వుంటాయి. విలేఖరులు తాముంటున్నది ఏ గ్రేడ్ మునిసిపాలిటియో.... ఏ మేరకు పన్ను పెంచబడినదో సేకరించివార్త వ్రాయచ్చు.

వరదల వలన నష్టపోయిన జిల్లాలలో రైతాంగమునకు ప్రభుత్వము ఇచ్చే ఆర్థిక సాయము; వరద తాకిడి గ్రామాలలో ప్రజలకు యుద్ధప్రాతిపదికపైన అందించే.... వైద్యము, ఆహారము, దుస్తులు వంటి నిత్యావసర వస్తువులు ఏ స్థాయిలో అందుతున్నాయన్న సమాచారాన్ని విలేఖరులు వివరముగా ఎప్పటి కప్పుడు వార్తల రూపములో అందిస్తూ రావాలి.

ఈ విధముగా ప్రజాసమాచారాన్ని వార్తల రూపములో అందించడమే "మాస్ కమ్యూనికేషన్" అంటే! ఇతరత్రా అత్యవసర వార్తలను- ఆత్రముగా ఎదురుచూసే ప్రజలకుఅందించాలి. ఈ విషయములో విలేఖరులు చురుకుగా పనిచేయాలి.

## దేవతా విగ్రహాలను ఫొటోలు తీయకూడదు.... !

దేవాలయాలలో 'మూలవిరాట్'ల ఫొటోలు తీయడానికి అర్చకులు, దేవాలయాధికారులు ససేమిరా ఒప్పుకోరు. ప్రతి దేవాలయానికి ఏదో ఒక చరిత్ర ఉంటుంది. హిందువులు "మహిమ లుంటాయ"ని ప్రగాఢముగా నమ్ముతున్నారు. "ఆ చరిత్రను ఫొటోలతో సహా పత్రికలలో వ్రాద్దామ"న్న విలేఖరుల కుతూహలానికి ఆయా ఆలయ పాలక వర్గాలు ఒప్పుకోవు. "దీనివెనుక కథ ఏమిటి?" అంటే.... వందల సంవత్సరాల నుంచి దేశ-విదేశ విద్రోహులు భారత శిల్పవైభవాన్ని తస్కరించి, అమ్ముకోడానికి అలవాటు పడడమే! మూల విరాట్‌ల ఫొటోలు తీయడమును నిషేధించినది ఈ

కారణము చేతనే! కొన్ని వందల ఏళ్ళ క్రితము అనేక దేవాలయా లలో లెక్కలేనన్ని దేవతావిగ్రహాలు దొంగిలించబడ్డాయి. నేటికీ విగ్రహాలు కొల్లగొట్టబడి.... విదేశాలలో అధిక ధరకు అమ్ముడౌ తున్నాయి. పత్రికలలో అపురూపమైన దేవతా విగ్రహాల ఫొటో ప్రచురణను, ఆ ఫొటోల అమ్మకాలను, దేవాలయాధికారులు వ్యతి రేకించడానికి ప్రధాన కారణమిదే!

మరోకారణము కూడా ఉన్నది. హిందువులు తమ దేవతలు "అత్యంత శక్తివంతమైన వార"ని నమ్ముతారు. ఉపవాసాలు, దీక్షలు, వ్రతాలు, మొక్కుబడులు తీర్చుకునే దేవతలను ఫొటోలు తీయడానికి హిందూమత బోధకులు, గురువులు, మఠాధిపతులు అంగీకరించలేక పోతున్నారు. "ఫొటోలు విలాస వంతమైనవ"ని ఆస్తికులనుకొంటున్నారు. అట్టివిలాసవంతమైనఫొటోలలో అత్యంత శక్తివంతుడైన తమ దేవతలను చూడడానికి హిందూమతము అంగీ కరించలేకపోతున్నది. పై కారణాలను దృష్టిలో ఉంచుకొని.... ఏదైనా దేవాలయచరిత్ర లేక విశేషాలు వ్రాయాలనుకొన్న గ్రామీణ విలేఖరులు- దేవాలయ ముందుభాగములో వుండే స్తంభాలపై చిత్రీ కరించిన శిల్ప సంపదను ఫొటోలు తీసుకోవచ్చు. అలనా-పాలనా లేని దేవాలయాల వివరాలు, ప్రాచీన దేవాలయాల చరిత్ర, వాటి నేటి పరిస్థితి సమీక్షించి, సేకరించి వ్రాయవచ్చు. దేవాలయాధికారు లను, అర్చక స్వాములను మభ్యపెట్టి లేదా "ఎవరూ అడగడము లేదు కదా...." అని 'మూల విరాట్'ల ఫొటోలను తీయడమనేది ఎంత మాత్రము మంచిదికాదు. అది చట్టవ్యతిరేకమౌతుంది.

"మూల విరాట్ల ఫొటోలు సరిగారావ"ని కొంతమందికి ఒక అభిప్రాయముఉన్నది. ఈ అభిప్రాయాన్ని విలేఖరులు పరిగణన లోనికి తీసికోకూడదు. మూల విరాట్లపై వీడియో, సినిమా చిత్రీ కరణలు కూడా నిషిద్ధమే! ఐతే.... కొన్ని సందర్భాలలో నియ మాలకు- నీళ్ళొదలడము, మఱికొన్ని సందర్భాలలో నియమాలను

ఇంకా బిగించడము జరుగుతుంది. దీనిపై రెండు విచిత్ర కథనాలను ఈ క్రింద చూడండి!

1) తిరుమల-తిరుపతి శ్రీవేంకటేశ్వరుని సన్నిధిలో అనేక మంది భక్తులు తమ పిల్లలకు నామకరణము, అన్నప్రాశన జరుపుట చాలాకాలముగా జరుగుతున్నది. ఇదంతా ఆ దేవాలయ ఆవరణలో జరుగుతుంది. గర్భగుడిలోకి మాత్రము అనుమతించరు. కానీ.... శ్రీ N.T. రామారావు తన మనుమరాలు నామకరణను గర్భగుడిలో జరిపారు. దీనికి దేవస్థాన పాలక వర్గము ఎలా అంగీకరించిందో....? ఇప్పటికీ తెలియదు.

2) అప్పటి ప్రధాని శ్రీమతిఇందిరాగాంధీ ఏ రాష్ట్రి వెళ్ళినా అక్కడి ప్రాచీన దేవాలయాలను సందర్శించి....? దైవదర్శనము చేసుకొనేవారు. ఆమె ఒరిస్సా వెళ్ళినపుడు పూరిదేవాలయ దర్శనము చేసుకోవాలనుకున్నారు! దీనికి పూరి దేవాలయ పీఠాధిపతులు అంగీకరించలేదు. "శ్రీమతిగాంధీ భర్త ఫిరోజ్‌గాంధీ హిందువుకారు! హిందువులు తప్పితే ఇతర కులస్తులకు పూరి ఆలయప్రవేశములేదు" అని వారు గట్టిగా నియమ-నిబంధనలమీద నిలబడ్డారు. శ్రీమతిగాంధీ నిరాశతో వెనుదిరిగారు. అప్పటి ఒరిస్సా C.M. శ్రీ జానకీ వల్లభ పట్నాయిక్ ఎన్నో ప్రయత్నాలు చేసినా....ఫలితము లేకపోయింది. చివరికి ఒక దశాబ్దము తరువాత.... 1984 లో అతి కష్టముమీద "పూరి దేవాలయాన్ని శ్రీమతిగాంధీ దర్శనం చేసుకోవచ్చ"ని పీఠాధిపతులు అంగీకరించారు. కానీ....శ్రీమతిగాంధీ పూరి దేవాలయమును దర్శించేందుకు తేదీ ఖరారుకాకుండానే....కంచే చేను మేసినట్లుగా.... సెక్యూరిటీగార్డ్‌ల చేతులలో దారుణముగా హత్య కావింపబడ్డారు. హిందువు లవేగాక.... అన్ని మతములవారి- సాంప్రదాయాలను, నమ్మకాలను విలేఖరులు గౌరవించాలి. ఇక్కడ విలేఖరుల వ్యక్తిగత నమ్మకాలకు తావులేదు. ఆస్తికులైనా-నాస్తికులైనా చట్టబద్ధముగా వుండాలి. ఎక్కడికైనా వెళ్ళినపుడు-అ మతాధికారులను, వారి

నియమాలను జాగ్రత్తగా పరిశీలించి, ఆ మేరకు మాత్రమే ప్రవర్తించాలి. ఇటీవల ఒక ప్రముఖ తెలుగు దినపత్రిక ... ముస్లిమ్ సోదరులు బాధపడేటట్లు వ్యవహరించి, ఖండనతో బయటపడిన ఉదంతము ఈ క్రింద చూడండి !

రంజాన్ పండుగ సందర్భముగా ఆ పండుగ విశేషాలు సేకరించి, అల్లా బొమ్మను ప్రచురించారు. ఈ బొమ్మను పత్రికలో వేసినందుకు ముస్లిమ్‌మతప్రవక్తలు ఆగ్రహించారు. వెంటనే ఆ పత్రిక ఎడిటర్‌ను కొన్నివందల మంది కలుసుకుని తమ నిరసన తెలుపుకున్నారు. "తమదేవుని బొమ్మలను ఏనాడు.... ఏ పత్రికా ప్రచురించలేదు. మీరు ఇప్పుడువేసి మాకు తీవ్ర మనస్తాపము కల్గించార"ని బాధను వ్యక్తముచేసారు. ఆ ఎడిటర్ వెంటనే దీనిపై ఒక ఖండన వేసి తమ తప్పును క్షమించమని పత్రికా ముఖముగా కోరుకున్నారు.

ఈ పత్రిక ప్రతిరోజూ "ధర్మపథము" అను శీర్షికను నిర్వహించేది. కొరాన్, భగవద్గీత, బైబిల్‌నుంచి- కొన్ని శ్లోకాలు, తాత్పర్యాలు దీనిలో ఇస్తుండేవారు. ఈ గొడవ తరువాత "ధర్మపథము"లో కొరాన్ శ్లోకాలు ఇవ్వడము లేదు. ప్రపంచములోని కులాలు, మతాలు, సాంప్రదాయములను గూర్చి-ప్రతివిలేఖరికి, ప్రతి ఎడిటర్‌కి తెలియాలని లేదు. ఐతే ...వాటిపై వార్తలు వ్రాసేటపుడు మాత్రము- తెలుసుకొని, జాగ్రత్తగా వ్రాయవలసి వున్నది. లేకుంటే ఆ వార్తవలన ఏకొద్దిమంది తీవ్రముగా స్పందించినా.... ఉద్రిక్తత చెలరేగినా.... దానికి కారణము ఆ పత్రిక ఔతుంది. కాబట్టి వార్త వ్రాసేటపుడు ....విలేఖరులు, ప్రచురించేటపుడు.... ఎడిటర్సు చాలా జాగ్రత్తగా పరిశీలించాలి.

## COPROPHEMIA [అశ్లీల సాహిత్యము]

"కాప్రోఫీమియా" అంటే.... "అశ్లీలమైన, జుగుప్సాకరమైన భాష" అని అర్థము! ఐతే... ఒక్కొసారి వార్తలలో కూడా అవ

గాహన లేని కొంతమంది విలేఖరులు, సబ్ఎడిటర్స్ ఈ 'కాప్రోఫీమియా'ను ఉపయోగిస్తున్నారు. నిజముగా ఈ తరహా జుగుప్సాకరమైన వార్తలు వ్రాయడము ఎంతవఱకు సమంజసమో వ్రాస్తున్నప్పుడు పాత్రికేయులు ఆలోచించాలి. డబ్బు చెల్లించి చదివే పాఠకులు కానివ్వండి, గ్రంథాలయాలలో చదివే పాఠకులు కానివ్వండి- వార్త చదివేటప్పుడు వార్తపదును, అందులో ఆసక్తి కలిగించే అంశముతో బాటు.... చక్కని భాషకు ముగ్ధులౌతారు. అంతేకాని.... ఏదో బూతు... మోతాదుమించిన అశ్లీలతతో వార్త వ్రాయబడితే... చదివే పాఠకులు అసహ్యించుకొంటారు. ఆ పత్రికమీద, ఆ వార్త వ్రాసిన విలేఖరిపైన- గౌరవభావము చూపరు. ఈ "కాప్రోఫీమియా" వార్తలను గుఱించి ఈ క్రింద చూడండి!

కేంద్రములో జనతా ప్రభుత్వము ఉన్నప్పుడు కాంగ్రెస్ రెండు ముక్కలై...ఇందిరా కాంగ్రెస్, రెడ్డికాంగ్రెస్‌గావిడిపోయింది. ఈ రెండూ ప్రతిపక్షములో ఉన్నాయి. అప్పట్లో శ్రీమతి ఇందిరా గాంధీ పైన- జనతా ప్రభుత్వము కక్ష సాధింపు చర్యలు ముమ్మరముగా చేపట్టింది. ఈ నేపథ్యములో ఆమె గతాన్ని త్రవ్వుతూ కొన్ని ఉత్తరాది పత్రికలు నీచమైన, హేయమైన వార్తలుప్రచురించాయి. శ్రీమతి గాంధీ భర్తపట్ల చులకన భావము కనపఱచేవారని, నెహ్రూ కుటుంబముతో సన్నిహితముగా ఉండే "మత్తాయ్"తో గల ఆమెకున్న పరిచయాన్ని వక్రించి మరీ వ్రాసాయి. అలాగే.... కొన్ని పత్రికలు పనిగట్టుకుని ఆమె పుత్రుడు స్వర్గీయ సంజయ్ గాంధీపై మోతాదుమించి వ్యక్తిగత విషయాలు వ్రాసాయి. ఇటీవల బ్రిటిష్ రాచ కుటుంబముపై కూడా ఇంగ్లీష్‌పత్రికలు ఘాటుగా, నీచముగా వ్యక్తిగత విషయాలపై వార్తలు వ్రాసాయి. ఆ వార్తలు కొన్ని చదివిన రాచ కుటుంబము తీవ్రమైన మనస్తాపానికి గుఱయ్యింది. అలాగే.... ఈ మధ్య కాలములో తెలుగుదేశం అధ్యక్షుడు శ్రీ నందమూరి తారకరామారావు ద్వితీయ వివాహము చేసుకున్నారు. వధువు కూడా

భర్తనుండి విడాకులు పొంది శ్రీరామారావుకు ధర్మపత్ని అయ్యారు. ఇదంతా భారత పత్రికలు ప్రముఖముగా వ్రాసాయి. అందులో తెలుగు దిన, వార, పక్ష, మాసపత్రికలు పతాక శీర్షికలతో వార్తలు వ్రాసాయి. మాజీ ముఖ్యమంత్రి, ప్రస్తుత ప్రతిపక్ష నాయకుడు శ్రీ N.T. రామారావు బహుముఖ ప్రజ్ఞావంతుడు! పైగా....ప్రజలమనిషి కనుక- ఈ వివాహ వార్త వ్రాయడములో తప్పు లేదు. విడాకులు పొందే- శ్రీమతి లక్ష్మీ పార్వతి శ్రీరామారావుకుఅర్ధాంగి అయ్యారు. ఆమె మాజీ భర్త శ్రీ సుబ్బారావుకు ఈమెపై ఎలాంటి హక్కులు లేవు. ఐతే.... ఒక పత్రిక " శ్రీ సుబ్బారావు విలాపాలు" అను శీర్షికతో సీరియల్ ప్రచురించడము ఎంత హేయమో ఆలోచించండి! విడాకులు పొందకుండా ఆమె వెళ్ళిపోయి- వేరే వివాహము చేసుకుంటే ... "మొదటి భర్త విలాపాలు" అని వ్రాసినా ఫరవా లేదు. చట్టబద్ధముగా విడాకులు పొంది, వివాహము చేసికొన్న తరువాత ఇలాటివ్రాతలు వార్తలుగా ప్రచురించడమంటే....ఆ చట్టాన్నే లెక్క చేయనట్లు! ఈ తరహా వార్తలను "కాప్రోఫీమియా" వార్తలుగా చెప్పుకోవచ్చు. ముఖ్యముగా పాఠకులకు ఏ విధముగానూ పనికి వచ్చేవి కావు ఈ వార్తా కథనాలు!

అలాగే.... కొందరు రాజకీయ నాయకులు సభలలో బండ బూతులు తిడుతుంటారు. జుగుప్సాకరముగా మాట్లాడుతుంటారు. వీరి భాషను పత్రికలు యథాతథముగా ప్రచురించకూడదు. పత్రిక చదివే పాఠకులు- వ్రాసే విలేఖరి కంటే, ప్రచురించే ఎడిటర్ కంటే తెలివైనవారు! ఫలానా నాయకుడు- ప్రతిమించి, మోతాదుమించి పత్రికలలో వ్రాయకూడని భాషలో తిట్టారు అని వ్రాస్తే.... పాఠకులు అర్థము చేసుకుంటారు. అంతకుమించి ఆ నాయకుడి బూతులను యథాతథముగా ప్రచురించడము పత్రికను దిగజార్చడమే ఔతుంది.

## ASSIGNMENT (ప్రత్యేకించుట)

పత్రికా విలేఖరులకు- "ఏదైన ఒక వార్తను ప్రధానముగా తీసుకుని, దానిపై దృష్టిని నిలిపి, అనేక కోణాలనుండి ఆ వార్తను సేకరించి, తయారు చేయమ"ని సూచిస్తుంటారు- ఎడిటర్స్! జిల్లాలో గల గవర్నమెంట్ హాస్పిటల్స్,ఫైర్ స్టేషన్స్, పోలీస్ స్టేషన్స్ పోలీస్ క్వార్టర్స్ పైన... ఈ తరహా ఎసైన్‌మెంట్స్ సీరియల్స్‌గా వస్తుం టాయి. ఇంకా అనేకానేక వార్తలపై ఈ ఎసైన్‌మెంట్స్ వస్తుంటాయి. అసలు ఎసైన్‌మెంట్ అంటే.... నిర్దేశించబడిన వార్తను సమీక్షించి, వీక్షించి వ్రాయడము! అంటే.... విలేఖరి పూర్తి స్థాయిలో ఎసైన్ మెంట్ వార్తను గురించి దర్యాప్తు చేసి వ్రాయడము! ఒక జిల్లా M.L.A. పనితీరుపై ఎసైన్‌మెంట్ వేస్తే.... ఆ వార్త ఒకేసారి సంక్షిప్తముగా వెలువడినా, సీరియల్‌గా కొన్ని రోజులు వెలువడినా పాఠకులను విశేషముగా ఆకర్షిస్తుంది. ఈ విధముగా విభిన్నమైన ఎసైన్‌మెంట్స్ వ్రాయవచ్చు!

## శీర్షిక (CAPTION)

ఎంత పెద్దవార్తకైనా.... మరెంత చిన్న వార్తకైనా.... 'శీర్షిక' ఉంటుంది. శీర్షిక విలేఖరులు వ్రాయాలి. చాలామంది వార్త వ్రాసి పంపుతుంటారు. ఏ సబ్ ఎడిటరో- ఆ వార్త చదువుకుని, రీ-రైట్ చేసి,వార్తకు సరిపడిన శీర్షికపెడుతుంటారు. ఇది మంచి పద్ధతి కాదు. జర్నలిజమ్‌లో ఏ ఒక్కరూ నిష్ణాతులు కారు. ఒకసారి తప్పు అయ్యిందే ... మరోసారి ఒప్పు ఔతుంది. ఎవరు వ్రాసిన వార్తకు వారే శీర్షిక (Heading or Title) వ్రాసుకోవడము అన్ని విధాలా మంచి పద్ధతి!

## COLUMN (వరుస లేక దొంతి)

ప్రతి విలేఖరీ కాలమ్ యొక్క సెం॥మీ॥లను గూర్చి తప్పక తెలిసికోవాలి. విలేఖరి ఆదాయము ఈ కాలమ్స్ మీద ఆధా: పడి

ఉంటుంది. పత్రికా యాజమాన్యాలు ఈ కాలమ్ సెం॥మీ॥ల ఆధారము గానే విలేఖరులకు పైకము చెల్లిస్తారు. మన తెలుగు దిన పత్రికలు కాలమ్ సెం॥మీ॥కి ఒకరు 0-40 పైసలు, ఒకరు 0-60 పైసలు, ఒకరు Rs. 1-00 ఇలా వారి వారి రేట్స్ ప్రకారము విలేఖరులకు ఇస్తూ ఉంటారు. మెయిన్ పేజ్‌నందు ఎనిమిది నిలువు గీతలలో వార్తలుంటాయి. గమనించండి! అలాగే మినీడైలీస్‌లో కేవలము ఐదు నిలువు గీతలుంటాయి. వీటినే కాలమ్స్ అంటారు. స్కేల్‌తో ఈ సెంటీమీటర్స్ కొలుచుకొని విలేఖరులకు నిర్ణయించబడిన ధర ఇస్తుంటాయి-పత్రికలు! విలేఖరులు డైరీ వ్రాసేఅలవాటు చేసుకోగలిగితే.... ఏ రోజు ఎన్ని సెంటీ మీటర్స్ వార్త వ్రాసారో.... ప్రింట్‌లో కొలిచి ప్రతిరోజూ నోట్ చేసుకోవాలి. ఏ నెలలో ఎన్ని సెం॥మీ॥ వార్తలు వ్రాసినది తెలిసిపోతుంది. దీని వలన పత్రికల నుండి వచ్చే పారితోషికము సరిచూసుకోవచ్చు! ఒక కాలమ్ సెంటీ మీటర్ 'ప్రకటన'కు Rs. 20 -నుండి, Rs. 300 -ల వరకు ఆయా పత్రికలు- సర్క్యులేషన్‌నుబట్టి రేట్స్ తీసికొంటాయి. పత్రికలకు ఇది మంచి ఆదాయమని చెప్పవచ్చును.

## EMBARGO నిరోధము

"ఎంబార్గో" అంటే ... "నిరోధము" అని అర్థము! విలేఖరులు నిత్యమూ కాకపోయినా... ఏడాది పొడుగునా, ఈ ఎంబార్గో వార్తల గురించి వ్రాస్తుంటారు. ఈ వార్తలు ఏ విధముగా ఉంటాయో చూడండి....!

ఏదైనా మునిసిపాలిటి ... ఏడాదికోసారి పాలక వర్గము పని తీరు గురించి ఘనముగా పండుగ జరుపుకుందనుకుందాము! రెండో ఏడాది .. మూడో ఏడాది కూడా ఇలాగే జరుపుకుంటుంది. సరిగ్గా ప్రతి ఏడాది ఫలానా నెలలో ఫలానా తారీఖున ఆ కార్యక్రమము జరుగుతుంది. అదే రోజున విలేఖరి మునిసిపాలిటీ ముఖచిత్రము గురించి ఒక వార్త విభిన్న రీతులలో వ్రాయవచ్చు. పాలక వర్గము

ఏడాది పొడుగునా సాగించిన పనితీరు, అభివృద్ధి ఎలా సాధించారు? అవకతవకలు, అవినీతికి పాల్పడితే... వాటిపైనా వివరాలు వ్రాయాలి. ఈ వ్రాసేది సరిగ్గా నిర్దేశింపబడిన రోజున ప్రచురణ కావాలి. ముందు-వెనుకలు కాకూడదు.

పై విధముగానే.... దేవాలయాలలో ఏడాది కొకసారి జరిగే ఉత్సవాలను గూర్చి వ్రాయవచ్చు. ఏ రోజు ఉత్సవము జరుగుతున్నదో.... ఆ రోజే ఆ ఉత్సవము గూర్చి విపులముగా వార్తా కథనము వ్రాయాలి. ముందు-వెనుక దినాలలో ప్రచురితము కాకూడదు. ఘంటసాల, మహాత్మాగాంధీ, ఇందిరాగాంధీ ఇత్యాదుల వర్ధంతులను గూర్చి ఆయా తేదీలలోనే ప్రత్యేక వ్యాసాలు పత్రికల్లో వస్తాయి. ముందు-వెనుకరోజులలోరావు. వీటినే"ఎంబార్గో" వార్తలు అంటారు. ఈ తరహా వార్తా కథనాలు;వ్యాసాలపై ప్రచురణ తేదీని కచ్చితముగా విలేఖరి వ్రాయాలి.

## BANNER (ధ్వజము)

వార్తా పత్రికల మొదటి పేజీలలో అగ్రభాగాన ప్రచురింపబడిన'వార్తా శీర్షిక'ను"బ్యానర్"అంటారు. తెలుగులో దీన్ని "పతాక శీర్షిక" అంటారు. ఈ వార్తలు- ప్రముఖమైనవి, సంచలనాత్మకమైనవి ఐతే తప్ప....అగ్రభాగాన పతాక శీర్షికగా ప్రచురింపబడవు. గ్రామీణ విలేఖరుల వార్తలకు- ఈ పతాక శీర్షికలో అవకాశము చాలా తక్కువ! ఇటీవల నక్సలైట్స్‌చే కిడ్నాప్స్, వార్ విధ్వంస కాండ వంటి వార్తల కారణముగా గ్రామీణవిలేఖరులు పతాక శీర్షికలోకి వెళ్ళే వార్తలు వ్రాయగలుగుతున్నారు. ఐతే ... ఇవే కాకుండా ఇతరత్రా కూడ అవకాశాలు వస్తున్నాయి. వర్గపోరాటాలు, కులపోరాటాలు, మత ఘర్షణలు వంటి వార్తల వలన కూడ పతాక శీర్షికలోకి ఎక్కుతున్నారు. వార్తలు పతాక శీర్షికలో వస్తే.... ఆ విలేఖరి ఎంతో చురుగ్గా పనిచేస్తాడు. చురుకుగా పనిచేసే విలేఖరి వార్తలే పతాక శీర్షికలోకి వెళతాయి. ఇదొక సర్కిల్!

## FEATURE (వర్ణన

ఫీచర్‌లేని పత్రికలంటూ ఉండవు. అసలు "ఫీచర్" అంటే ఏమిటి? దేన్ని ఫీచర్ అంటారో....? ముందుగా తెలుసు కొందాము. ప్రత్యేక వ్యాసాలు, ఏదైనా అంశాన్ని తీసుకొని విశేషముగా వ్రాసే వ్యాసాన్ని "ఫీచర్" అంటారు. ఈ ఫీచర్స్ ఎక్కువగా వ్రాసేది కాలమిస్ట్‌లు, సీనియర్ రిపోర్టర్‌లు! అనేక అంశాలపై ఈ ఫీచర్స్ వెలువడుతుంటాయి. ఐతే... ఈ ఫీచర్స్‌ను గ్రామీణ విలేఖరులు కూడా వ్రాసే అవకాశాలున్నాయి. మండలములోని అతిపెద్ద దేవాలయము గూర్చి, అసెంబ్లీ నియోజక వర్గ ముఖచిత్రము గూర్చి, అతిపెద్ద జాతర గూర్చి.... ఇలా ...చాలా ఫీచర్స్ వ్రాసుకోవచ్చును. ఇవన్నీ ఏడాదికి ఒకసారి వ్రాయడానికి మాత్రమే పనికివస్తుంటాయి.

ఒక్కోసారి చాలాకాలము పనిచేస్తున్న గ్రామీణ విలేఖరుల చేత- ఆయాడెస్క్ ఇన్‌చార్జి సబ్ ఎడిటర్స్ ఇలాటి ఫీచర్స్ వ్రాయి స్తుంటారు. ఆ విలేఖరి పరిధిలోగల వార్తా కథనాలను కొన్ని స్పెషల్ ఫీచర్స్‌గా వ్రాయించుట సర్వసాధారణముగా జరుగు తుంటుంది.

## EDIT (సవరించి ప్రచురించుట)

పత్రికలకు మూలస్తంభము ఎడిటర్! ఈఎడిటర్స్‌వార, మాస, పక్ష పత్రికలకు ఒక విధముగా పనిచేస్తే.... దినపత్రికలకు మరోలా పనిచేస్తుంటారు. దినపత్రికల ఎడిటర్స్ వార్తలపై నేరుగా పట్టుగలిగి ఉండరు. విశ్వవ్యాప్తముగా సేకరించే వార్తలతోబాటు.... గ్రామీణ వార్తలపైన సబ్ ఎడిటర్స్, సీనియర్ ఎడిటర్స్, డెస్క్ ఇన్‌చార్జ్‌ల సహకారముతో వార్తలపై ఎడిటర్స్ పట్టుసాధిస్తారు. ప్రింట్‌కు వెళ్లే ముందు ఎడిటర్‌కి తెలియకుండా ఏ వార్తా వెలువడదు. ఇక.... గ్రామీణస్థాయి విలేఖరులకు- దినపత్రికల ఎడిటర్స్‌తో నేరుగా సంబంధము ఉండదు. వీరికి డెస్క్ ఇన్‌చార్జ్‌లతో సంబంధ

ముంటుంది. ఈ ఇన్‌చార్జ్‌లే గ్రామీణవిలేఖరులకు ఎడిటర్స్‌గా వ్యవహరిస్తారు. విలేఖరులు వ్రాసిన వార్తలకు-కుదింపులు,పొడిగింపులు, తిరిగివ్రాయడాలు, ఎత్తివ్రాయడాలు, ఒక్కోసారి ... తామే వ్రాసేసి, ఏదో ఒక డేట్‌లైన్ పెట్టేసి.... వార్తవేయడాలు, ఒక్కోసారి విలేఖరి వ్రాసినవార్త రూపురేఖలు పూర్తిగా మార్చేసి వ్రాయడాలు వంటివి కూడా డెస్క్ ఇన్‌చార్జ్‌లు చేస్తుంటారు. ఇలా మార్చేసి వ్రాయడము అనేది చాలా అరుదు! ప్రతివార్త ఎంతోకొంత ఎడిట్ చేయబడుతుంది. ఒక్కోసారి As it isగా వస్తుంటాయి. ఈ As it isగా రావడములో కూడా 'ఎడిట్' ఉంటుంది.

గ్రామీణ విలేఖరులు వ్రాసిన వార్తలు 99 శాతము తిరగ వ్రాయబడుతుంటాయి. వార్తయొక్కభావము, కథనము,సంఘటనలు మారకుండా పత్రికల భాషలోకిరూపాంతరము చేసేది సబ్ ఎడిటర్స్! ఈ సాంకేతిక చర్య గురించి చదివే అనేకమంది పాఠకులకు తెలియదు. వార్తవస్తే ... "అది విలేఖరి వ్రాసినదే! ప్రతి అక్షరము, శీర్షిక పేరు అన్నీ విలేఖరే వ్రాసాడు!!"అని చాలమంది నమ్ముతారు. ఎవరి మీదన్నా వ్యతిరేక వార్తవస్తే.... వారు విలేఖరి మీద విరుచుకు పడతారు. వీలుంటే.... చేయి చేసుకుంటుంటారు. తరచు "విలేఖరులపై దాడులు"అనే వార్తలను చదువుతూ ఉంటాము.

## FACE TO FACE ముఖాముఖి

"ఫేస్ టు ఫేస్" అంటే ముఖాముఖిగా చర్చించుకోవడము! ఇంటర్వ్యూలు ఎక్కువగా ఈ పరిధిలోకే వస్తాయి. ప్రముఖులను ఇంటర్వ్యూ చేసి- వారినుంచి ప్రత్యక్షముగా జవాబులు రాబట్టుకోవచ్చును! ఫోన్‌లో సంభాషించడమనేదిఈ ముఖాముఖిలోనికిరాదు. ఫోన్‌లో కేవలము స్వరము మాత్రమే వినిపిస్తుంది. విలేఖరికి విన్నది వ్రాసుకోవడమే తప్ప ఎలాంటి ఎక్స్‌ప్రెషన్స్ కనిపించవు. పైగా.... ఫోన్‌లో అవతలి వ్యక్తి ఇదివరకు మాట్లాడి ఉంటేనే తప్ప.... "ఫలానా వారి గొంతు" అని నిర్ధారణ జరుగదు. "తానే ఫలానా"

అని వేరే వ్యక్తి ఏదైనా తప్పుడు సమాచారము ఇవ్వవచ్చు. అది వార్తగా వ్రాస్తే ... లేనిపోని సమస్యలు చుట్టుకుంటాయి. కాబట్టి ఫోన్‌లో చెప్పినవి ఎంతో నమ్మకముంటేనే వార్తలుగా రావాలి.

ముఖాముఖి చర్చలు, రచ్చబండ తీర్పులు,ఎదురు-బొదురుగా ఇరువురి నాయకుల ప్రత్యక్ష ఘర్షణల వంటివి ముఖాముఖి క్రిందకి వస్తాయి!

## DRAFT నకలు

విలేఖరులు వ్రాసిన వార్తను తిరిగవ్రాయుట సబ్ ఎడిటర్స్ యొక్క పని! వాస్తవానికి నూటికి 95 మందికి పత్రిక భాషలో వార్త వ్రాయడమురాదు. కనుకనే .. సబ్ ఎడిటర్స్ విధిగా విలేఖరి వ్రాసి పంపినవార్తను తిరిగవ్రాయుట పరిపాటి ఐనది. ఏ కొద్దిమంది విలేఖరుల వార్తలో చిన్ని చిన్ని మార్పులు, కట్‌లతో... తిరిగ వ్రాయబడకుండా ప్రచురించబడుతుంటాయి. ఇక ...డ్రాఫ్ట్ గురించి చర్చించుకొందాము!

ప్రచురించడానికి ముందుగా వార్త యొక్క వ్రాతప్రతిని పరిశీలించుకోవాలి. ఒకటికి రెండు సారులు వార్తను,చదివి శీర్షికతో సహా వ్రాసుకోవాలి. పంపేముందు వార్తను సరిగ్గా వ్రాసామని చివరిగా నిర్ణయించాక.... పత్రిక ఆఫీస్‌కు పంపించాలి. దీనినే "డ్రాఫ్ట్ కాపీ" అంటారు. చాలమందికి "పత్రికా భాషలో వార్త వ్రాద్దామ"నీ ఉండదు. "నేర్చుకొందామ"న్న తలంపూ ఉండదు. ఈ విధానము వలన- ప్రమోషన్‌రాదు సరికదా.... ఒక్కోసారి ఉద్వాసనకు గురి కావలసి రావచ్చును. సరిపోను మేటర్ లేక; ఒక్కోసారి రీ-రైట్ చేసిన వార్తలు వుండక, దిద్దేటైమ్ లేక విలేఖరి వార్తను యథాతథముగా ప్రచురణకు ఇస్తే.... తప్పులతడకగా, చదవడానికి వీలుకాని విధముగా ప్రచురితము కావచ్చు. అపుడు విలేఖరికి అపఖ్యాతి వస్తుంది. ఇది మంచిదికాదు. కనుక ప్రతి గ్రామీణ విలేఖరి

సాధ్యమైనంత వరకు వార్తను తమంతటతామే చక్కగా వ్రాయ గలగాలి! విలేఖరికి ఉండవలసిన మంచి లక్షణాలలో డ్రాఫ్టింగ్ కూడా ఒకటి!

## DIALECT (భాషా భేదము)

"డైలెక్ట్" అంటే.... "మాండలికము" లేక "భాష" అని అర్థము! గ్రామీణ విలేఖరులు దీనిని గురించి తెలుసుకొని ఆచరించ వలసినది ఎంతైనా వున్నది. పత్రికలకు, సినిమాలకు, నాటకాలకు ఒక తరహా భాష ఉన్నది. ఆ భాష అందరిలో లేదు. సహజముగా ఒక్కోచోట ఒక్కోయాసతో భాష ఉంటుంది. దీన్నే "మాండలికము" అంటారు. ఈ మాండలికాలు ఉపయోగించి వార్తలు వ్రాయకూడదు. పత్రికల భాషనే వాడాలి. మాండలికములో వార్త వ్రాస్తే.... ఆ ప్రాంతము వారికే అర్థమౌతుంది. ఇతర ప్రాంతీయులకు ఆ భాష కొరుకుడు పడదు. ఈకారణముతో- పాఠకులు ఆ పత్రికను- చిన్న చూపు చూస్తారు. మాండలికములో సందర్భాన్ని బట్టి నవలలు, కథలు, నాటకాల వరకు కొన్ని పాత్రలకు మాత్రము ఉపయోగించ వచ్చును. విలేఖరులు మాత్రము వ్రాయకూడదు. పత్రికా భాషాలో మాత్రమే వ్రాయాలి!

## BOX ITEM (సంచలన వార్త)

'బాక్స్ ఐటమ్'లో వార్త వచ్చిందీ అంటే.... అది కచ్చిత ముగా ఒక ప్రత్యేకమైన వార్తైనా కావచ్చు లేదా సంచలన వార్తైనా కావచ్చు! ఈ వార్తలు వ్రాసే విలేఖరులకు మంచి గుర్తింపు లభి స్తుంది. ఈ వార్తలు ఎలాంటివో తెలుసుకుందాము! కిడ్నాప్, సామూ హిక మానభంగము, ఘరానా దొంగతనము, ఒకే కాన్పులో నలు గురు పిల్లలు-వారిక్షేమము, హత్య-హతుని తలమాయమగుట.... ఇలాటి వార్తలే బాక్స్ ఐటమ్సగా పత్రికలలో దర్శన మిస్తాయి. ఇంకా....M.L.A., M.P. వంటివారు తమ సభ్యత్వానికి రాజీనామా చేయడము కూడా బాక్స్ ఐటమ్ క్రిందికి వచ్చే వార్తలే!

రెగ్యులర్ పాఠకుల దృష్టి ఎప్పుడూ 'బాక్స్ ఐటమ్' వార్తల పైనే తొలుత పడుతుంది. సంచలన వార్తలంటే.... చదివే పాఠకులు కళ్ళు ఇంతింత చేసికొని చదువుతారు. ఉత్కంఠ భరితమైన ఏ వార్తైనా అది బాక్స్ ఐటమ్‌లో వస్తుంది.

ఉదాహరణకి ఒక మేజర్ పంచాయతీ- మునిసిపాలిటీగా రూపు దిద్దుకున్నది. పంచాయతీ నాటి అకౌంట్స్,వాటి ఖర్చులు, ఖాతాలు అవన్నీ మునిసిపాలిటీలో జమచేయడము వంటివి జరిగాయి. ఐతే.... కొన్ని ఎకౌంట్స్ మరుగున పడిపోయాయి. కారణము క్రొత్తగా విచ్చేసిన కమీషనర్‌కు ఈ మార్పులు-చేర్పులపట్ల అంత ఉత్సాహము లేదు. పైగా.... "బదిలీ మీద వెళ్ళిపోదామ"న్న తలంపుతో అతను అతి తక్కువ కాలములో వెళ్ళిపోయాడు. ఆ తరువాత విచ్చేసిన ఒకరిద్దరు కమీషనర్స్ అదే విధముగా వెళ్ళిపోయారు. 1983 లో పంచాయతీ మిగులు ధనము ఫిక్స్‌డ్ డిపాజిట్స్‌గా స్టేట్‌లో బ్యాంక్‌లో వేసుకున్నది. 1989లో ఆ ఫిక్స్‌డ్ డిపాజిట్స్ విషయము క్రొత్తగా వెలసిన మునిసిపాలిటీకి తెలియదు. పైగా సంబంధిత పత్రాలు కూడా లేవు. మూడు లక్షల రూపాయల విలువగల ఆ గుప్తనిధి గూర్చి ఒక విలేఖరి బాక్స్ ఐటమ్‌గా వార్త వ్రాసాడు. "నాటి పంచాయతీ గుప్తనిధి" శీర్షికతో వెలువడిన ఆ వార్త ఆ మునిసిపల్ పరిధిలో సంచలనవార్త ఐనది.

## CROPPING (కత్తిరించడము)

గ్రామీణ విలేఖరి ఒక్కోసారి సెన్సార్ కత్తెరలా పనిచేయవలసి ఉంటుంది. కొన్నిఫొటోవార్తలు వ్రాయవలసివచ్చినపుడు.... ఫోటోను క్లియర్‌గా తీయడము లేదా తీయించడము చేయాలి. ఫోటోను పంపునపుడు,వార్తకు అవసరమైన మేరకు మాత్రమే ఫొటో ఉంచాలి. మిగతా ఫొటో భాగాలను కత్తిరించాలి. దీన్నే "క్రాపింగ్" అని అంటారు. గ్రామీణ విలేఖరులు ఫొటోను యథాతథముగా

పంపినపుడు... ఈ కత్తిరించడాన్ని పత్రికాఫీస్‌లో ఇన్‌చార్జ్‌లు లేదా సబ్ ఎడిటర్స్ కావలసిన మేరకు కత్తిరింపు చేస్తారు. ఫోటోలను అర్థవంతముగా కత్తిరించితే.... విలేఖరులకు మంచిపేరు వస్తుంది.

## CONCEPT "ఊహాత్మక వార్తలు"

కొన్ని వార్తలు ఊహలతోనిండి వెలువడుతుంటాయి. ఎక్కువగా రాజకీయ పార్టీలను, ఆ పార్టీ నాయకులను గూర్చి ఈ తరహా వార్తలు వెలువడుతుంటాయి. "ఫలానా పార్టీకి గెలిచే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి". "ఫలానావారి నాయకత్వముపట్ల ప్రజలకు ఎక్కువ శాతము నమ్మకము ఉన్నది" అనే ఊహలతో కూడి ఈ వార్తలు ఉంటాయి.

**ఈ ఊహాత్మకమైన వార్తలు అతిగా వ్రాయకూడదు.** ఇట్టి వార్తలు- దేశ-విదేశ-రాష్ట్ర వ్యాపితమైతే పరవాలేదు. ఏ గ్రామ-మండల పరిధిలోనో ఐతే ఒక్కోసారి ఇబ్బందులు ఎదురౌతాయి. గ్రామీణ విలేఖరి ఏ రాజకీయ నాయకుని కోసమో.... లేదా ఒక నియోజకవర్గ పరిధిలో గెలుపు-ఓటమిలను గూర్చివ్రాస్తే.... ఆ విలేఖరిని పోటీ బరిలో ఉడే నాయకులతోబాటు.... ఆ ప్రాంత ప్రజలు కూడా చులకన భావముతో చూస్తారు. ఊహాజనితమైన వార్తలు వ్రాయడము అన్ని వేళలా క్షేమముకాదు.

ఇటీవల గ్రామీణ విలేఖరులు ఎక్కువమంది- ఊహాజనితమైన వార్తలను.... "అట" కబురులతో వ్రాస్తున్నారు. వాటిని డెస్క్ ఇన్‌చార్జ్‌లు పట్టించుకోకుండా వేసేస్తున్నారు. ఈ పద్ధతి అటు పత్రికలకు, ఇటు విలేఖరుకు ఎంత మాత్రము మంచిది కాదు. "సంత బొమ్మాళి మండలములో డయేరియా : నలభైమంది మృతి" ఈ శీర్షిక గల వార్త ఒక తెలుగు డైలీ మెయిన్‌లో ప్రచురితమైనది. వార్త చూడగానే రాజధానిలో సంచలన మేర్పడింది. ఉన్నతాధికారుల బృందము పరుగులతో 860 కిలో మీటర్స్ ప్రయాణము చేసి సంతబొమ్మాళి చేరుకున్నారు. తీరా వెళ్ళాక.... అక్కడ డసే

రియూ లేడు! ఏ ఒక్కరూ చనిపోలేదు!! ఇది ఊహాజనితమైన వార్తా? లేక "... అటు" ఖబురు వార్తా ... తెలియక అధికారులు తలపట్టుకున్నారు.

మరో దిన పత్రిక ఏకముగా ప్రముఖనక్సలైట్ నాయకుడితో ఇంటర్వ్యూ వేసారు. "పలాన గ్రామము నక్సలైట్‌ల స్థావరమ"ని ఆ వార్త వెలువడింది. జిల్లా పోలీస్‌యంత్రాంగమంతా- ఆ వార్తను నమ్మి కదలింది. తీరా ఆ వార్త శుద్ధ అబద్ధమని తేలింది. ఎందుకీ వార్తలు వ్రాయడము? అధికారుల ముందు, పాఠకుల ముందు చులకన కావడము ??

## ప్రకటన (ADVERTISEMENT)

పత్రికలు పచ్చగా పదికాలాలపాటు ప్రచురించబడాలంటే.... యాడ్స్ ఉండాలి. యాడ్స్‌లేకుండా పత్రికలు నడవవు.... నడపరు కూడా! అక్కడక్కడ కొన్ని భాషాపత్రికలను యాడ్స్ లేకుండా నడపుతున్నారు. వీటి సంఖ్య వ్రేళ్ళమీద లెక్కించవచ్చు!

"యాడ్(Ad )" అంటే... "అడ్వర్‌టైజ్‌మెంట్"అనిఅర్థము! వాణిజ్యము, ప్రైవేట్; ప్రభుత్వ ప్రకటనలు ఇందులోనికి వస్తాయి.

ప్రైవేట్ వ్యవహారాలు, చావులు, ఆస్తుల తగదాలు, పరిశ్రమ స్థాపనలు.... ఇంకా.... ఇతరత్రా ప్రకటనలు అడ్వర్‌టైజ్‌మెంట్స్ రూపములో ప్రచురితమౌతు ఉంటాయి. ఇటీవల కొంత మంది విలేఖరులు ఈయాడ్‌లుగా రావలసిన ప్రకటనలను- వార్తల రూపములో ఇస్తున్నారు. ఇవి- చాలా వఱకు ఆయా విలేఖరులకు డెస్క్‌ల నుంచి తిరుగు టపాలో చేరుతాయి. కొన్ని ప్రచురింపబడుతుంటాయి. ఈ తరహా ప్రచురణ ఎంత మాత్రము పత్రికలకు మంచిది కాదు. ఆదాయము తెచ్చే ప్రకటనలు వార్తల రూపములో ప్రచురింపబడుట వలన పత్రికకు నష్టము వస్తుంది. ఇక ప్రకటనలు ఏ విధముగా వార్తలు ఔతున్నాయో చర్చించు కుందాము.

ఏ ప్రముఖ వ్యక్తో చనిపోతే ... ఫొటోతో వార్త వెలువడు తుంది. కానీ ... సామాన్యులు, భూస్వాములు చనిపోతే ... వారిని ప్రముఖులుగా చిత్రీకరించి ఫోటో వార్త వ్రాయడము విలేఖరులకు తగదు. ఒక ఉపాధ్యాయుడు చనిపోతే.... ఆయన గూర్చి వివరముగా వ్రాస్తూ "ఈయనవద్ద ప్రాథమిక విద్యనభ్యసించినఎందరో.... కలెక్టర్, పోలీస్‌సూపరింటెండెంట్, కెప్టన్, డాక్టర్, లాయర్ అయ్యార"నీ; "ఆయన జీవితము విద్యాబోధనకు అంకితమయ్యింద"నీ వ్రాసాడో విలేఖరి! ఇందులో విశేషము ఏ మున్నది? ప్రతి ఉపాధ్యాయుడు విద్యాబోధన చేసేటప్పుడు వేలాది మంది ఆయన వద్ద చదువుకుంటారు. వారిలో అనేక మంది ప్రముఖులు ఔతారు. అంత మాత్రాన.... "ఇందుకు కారకుడు ఆ ఫలానా ఉపాధ్యాయుడు" అని ఒక విలేఖరి వ్రాయడము ఎంత వఱకుసమంజసమోఆలోచించండి!?

పరిశ్రమల ప్రారంభోత్సవాలు అడ్వర్‌టైజ్‌మెంట్ రూపములో రావలసి ఉండగా.... ఒక విలేఖరి వార్తగా వ్రాసాడు. ఇలాంటి వ్రాతలు మంచివి కావు. పత్రికల మనుగడకే ముప్పు! పశువుల దాణా తయారు చేసే ఒక ప్లాంట్ గూర్చి ఒక విలేఖరి తయారీ విధానము, దాణా ఎన్ని జిల్లాలకు సరఫరా చేయగల శక్తి వున్నదీ, ఏ ప్రాంతాలకు అధీకృత డీలర్ కావలసినదీ పేర్కొన్నాడు! ఆ పత్రిక కూడా గ్రుడ్డిగా ఈ మొత్తము వార్త రూపములో వేసే సింది. తయారీ విధానము, ఎంత ఉత్పత్తి జరుగుతుందో వఱకు పరవా లేదు. ఏ ఏ ప్రాంతానికి డీలర్స్ కావలెను. అనేది కూడా వ్రాయుట అక్షరాల తప్పు! ఈ డీలర్స్ కావలెను. అనేది నూటికి నూరు పాళ్ళ ప్రకటన రూపములో వెలువడ వలసినదే!

## CLIPPING [కత్తిరించిన ముక్కలు]

విలేఖరులు విధిగా దినపత్రికలు చదువుతూ ఉండాలి. ఇలా చదువుట వలన ఒక విధముగా జిల్లాతో బాటు దేశ-విదేశ విశేషాలు తెలుస్తాయి. వీటిని అధారము చేసుకుని గ్రామీణవిలేఖరులువార్తలు

వ్రాయవచ్చు. అమెరికా ప్రెసిడెంట్ క్లింటన్, పాకిస్తాన్ ప్రధాన మంత్రి శ్రీమతి బెనజీర్‌భుట్టో వంటి వారిపై వింతలతో కూడిన విశేషాలు; సల్మాన్ రష్దీ, నస్రూన్ వంటి మేధావి రచయిత[్రు]లను గూర్చి చదివిన గ్రామీణ విలేఖరికి లోకజ్ఞానముతెలుస్తుంది. వీటిపై స్పందించి వార్తలు వ్రాయడము కుదరదు. ఐతే.... "అమెరికాలో భారతీయ డాక్టర్స్‌ను హీనముగా చూస్తున్నారు. పట్టణాలలోకాకుండా అక్కడ లోతట్టు పల్లెలలో వైద్యము చేయడానికి నియమిస్తున్నారు" అని ఒక వార్త చదివారనుకోండి! ఇలాంటి వార్తను అధారము చేసుకుని గ్రామీణ విలేఖరి తనూ ఒక వార్త వ్రాసి పాఠకుల, ముందుంచి, వారి మన్ననలు పొందవచ్చును. అది ఎలా అంటే....?

"అమెరికాలో భారతీయ డాక్టర్ల హీనస్థితి" అనే శీర్షికతో వెలువడ్డ వార్తను మొత్తము కత్తిరించి భద్రముగా ఉంచాలి. ప్రతీ గ్రామీణ విలేఖరి ఈ పని చేయనక్కరలేదు. అమెరికాలో స్థిరపడ్డ భారతీయ డాక్టర్ యొక్క స్వగ్రామము అంధ్రప్రదేశ్‌లోని ఏ పట్టణమో, పల్లెటూరో అనుకోండి! ఆ ప్రాంతములో ఉన్న విలేఖరి మాత్రమే ఈ కత్తిరింపు జరిపి భద్రపఱచాలి. ఏదో ఒకరోజు ఆ డాక్టర్ తన బంధువులను చూసేందుకు వస్తే.... ఈ భద్రపఱచిన కత్తిరింపు శీర్షిక వార్తను చూపించి; దానిపై వివరాలు అడిగితే.... ఆ డాక్టర్ కొంత సమాచారము అందిస్తాడు. దీనిపై ఒక చక్కని వార్తను విలేఖరి వ్రాయవచ్చును.

భారతదేశములోని అనేక గ్రామాలలో క్వాలిఫైడ్ డాక్టర్స్ లేకుండా.... నేటికీ నాటువైద్యులే ఉన్నారు. ఇక్కడ ఇలాంటి గ్రామాలకు మన డాక్టర్స్ వెళ్తే ఎంతో బావుండేది. కానీ.... విదేశీ మోజులోపడి వలసపోతున్నారు. తీరా వెళ్లాక.... చాలామంది విదేశాలలోని మారుమూల గ్రామాలలో వైద్య సేవలకు నియమించబడుతున్నారు. ఈ తరహావార్తరాబట్టాలంటే....విలేఖరి "క్లిప్పింగ్స్ ఫైల్" పెట్టుకుంటే తప్ప సాధించలేడు. ఏదైనవార్త, వార్తా కథ

నము, హ్యూమనస్ స్టోరీ, హ్యూమన్ స్టోరీ, ఫోటో వార్తల వంటివి కత్తిరించి భద్రపఱచుకోవాలి. ఈ కత్తిరింపులనే ... "క్లిప్పింగ్స్" అంటారు. ఎక్కువగా ఎలక్షన్స్‌లో ఈ కత్తిరింపుల ద్వారా మంచి వార్తలు రాబట్టవచ్చు!

ఉదాహరణకు ఒక M.L.A. ఎన్నికలముందు విలేఖరుల సమావేశములో "మా పార్టీ నాకు టిక్కెట్ ఇచ్చింది. మరల నేను ఎన్నికల బరిలో ఉన్నాను. నేను గత ఐదేళ్ళలో చాల సాధించాను" అని చెపుతాడు. గతములో అతడు చేసిన నియోజకవర్గ సేవలు, గత ఎన్నికలముందు అతడి వాగ్దానాల క్లిప్పింగ్స్ విలేఖరి తీసి.... సదరు M.L.A. చేసిన సేవ, నిర్వాకముపైన ఒక పొలిటికల్ స్టోరీని విలేఖరి హాయిగా వ్రాసుకోవచ్చు. అలాగే ...గత ఎన్నికలలో ఏబూత్‌లో ఏ పార్టీకి ఎన్ని ఓట్లు వచ్చాయి? మెజారిటీ ఎంత? రాజకీయ పార్టీలు, నాయకులను గూర్చి సింహావలోకనము వంటివి కేవలము "క్లిప్పింగ్స్ ఫైల్" నుంచే వ్రాసుకోవడానికి వీలౌతుంది.

వార్తలపట్ల మంచి అవగాహన ఉన్న విలేఖరి "క్లిప్పింగ్ ఫైల్"ను తప్పక నింపుకుంటాడు. ఎప్పటి కప్పుడు ఈ క్లిప్పింగ్స్ వార్తలు వ్రాయడానికి పనికి వస్తాయి. ఓ కేంద్రమంత్రి లేదా రాష్ట్ర మంత్రి ధాన్యము ధర లేదా చెఱకు మద్దతు ధర స్వల్పముగా పెంచినట్లు ప్రకటన చేశారనుకోండి! ఈ తరహా వార్త దినపత్రికలలో మెయిన్ ఎడిషన్‌లో ప్రముఖముగా లేదా పతాక శీర్షికలో ప్రచురింపబడుతుంది. ఈ వార్తను ఒకటికి రెండుసారులు చదివాక.... ఈ ధర వలన నియోజకవర్గ పరిధిలోని రైతాంగమువారి ఉత్సాహము గమనించాలి! పెద్ద రైతునుంచి, సన్నకారు రైతు వఱకు కొద్దిమంది అభిప్రాయాలు తీసుకొని పై వార్తను కొంత జోడించి వ్రాస్తే.... విలేఖరి జిల్లా స్థాయి రైతాంగమునకు మరోమారు విపులముగా చెప్పినవాడౌతాడు. ఇందులో సంబంధిత వ్యవసాయాధికారుల వివరణలుజోడిస్తే....వార్తమరింత పకడ్బందీగా ఉంటుంది.

క్లిప్పింగ్స్ వలన విలేఖరి ఎన్నో మంచి వార్తలు వ్రాయడానికి అవకాశము ఉంటుంది. వార్తను సులభముగా వ్రాయడానికి వీలుకలుగుతుంది. క్లిప్పింగ్స్ మీద ఆధారపడి వ్రాసిన వార్తలు పాఠకులలో బాగా క్లిక్ ఔతాయి.

## రిపోర్టింగ్ రంగములో మహిళలు తక్కువ!

భారతదేశ మందు జర్నలిజమ్‌లో మహిళల పాత్ర కేవలము పదిశాతమే ఉన్నది! తెలుగు పత్రికా రంగములో మహిళలను తీసుకోవడానికి యాజమాన్యాలు ముందుకు రావడము లేదు. కథలు, నవలలు, వ్యాసాలు వ్రాయడానికీ; డెస్కుల మీద పనిచేయడానికి మాత్రమే మహిళలను తీసుకుంటున్నారు తప్ప రిపోర్టింగ్‌లోకి ఎంత మాత్రము అవకాశము ఇవ్వడము లేదు. డెస్కులమీద సబ్‌ఎడిటర్స్‌గా మహిళలు వ్రాసేది.... రేడియో, T.V. కార్యక్రమాలు; ఉత్తరాలు, సాహిత్య శీర్షికలు, మార్కెట్ ధరలు, మహిళా పేజీలు, కల్చరల్ ప్రోగ్రామ్స్ గూర్చి వివరణలు మాత్రమే! జర్నలిజమ్‌లో మహిళలకు పరిపూర్ణత దక్కకుండా పత్రికా యజమానులు అనేకమంది ప్రయత్నిస్తున్నారు.

"రిపోర్టింగ్‌లో మహిళలకు అవకాశము ఇస్తే....వచ్చేనష్టము ఏమిట"ని ఎవరైనా పత్రికా సంపాదకుడిని ప్రశ్నిస్తే.... "ఉన్న మగ రిపోర్టర్స్‌పైనే దాడులు జరుగుతున్నాయి. దీనితో క్రిందా-మీద పడవలసి వస్తున్నది. ఇక ఆడ రిపోర్టర్స్‌ను పెట్టుకుంటే.... పత్రిక నడపుటకంటే.... వారిపై దాడులు-గొడవలు తీర్చేసరికే మా టైమ్ సరిపోతుంది. ఐనా... భారత పత్రికారంగము ఎంతో అభివృద్ధిచెందవలసి ఉన్నది. చిన్నవార్తను పట్టుకొని, పెద్ద రాద్ధాంతము చేసే సాంప్రదాయము నశించాలి. వెలువడిన వార్తను స్పోర్టివ్‌గా తీసికొనే స్థాయికి అన్ని వర్గాలవారు ఎదగాలి! అప్పుడే మహిళా జర్నలిస్ట్‌లకు అవకాశము కల్పించగలము. ఇదంతా ఈ శతాబ్దములో జరి

గేది కాద"ని రకీమని చెబుతున్నారు- అవగాహన, ఆలోచన ఉన్న సంపాదకులు!

శాసన వ్యవస్థ, న్యాయవ్యవస్థ, పరిపాలనా వ్యవస్థలతోబాటు నాలుగవ స్తంభమైనది పత్రికారంగము! మొదటి మూడు వ్యవస్థలలో మహిళలపాత్ర గణనీయముగా ఉన్నది. పత్రికా రంగములో చాలా దయనీయముగా ఉన్నది. ఈ స్థితి భారత జర్నలిజ్మ్‌కేకాదు- ప్రపంచములోనే ఉన్నది.

విదేశాలలో జర్నలిస్టులుగా మహిళలు 25 నుండి 30 శాతం వఱకు ఇటీవలి కాలములో చేరగలిగారు. జర్మనీ, మలేషియా, ట్యునీషియా, ఇటలీ దేశాలలో ఈ పెరుగుదల గణనీయముగా కనిపిస్తోంది.

ఇటీవల భారతదేశములో జర్నలిస్టులపై దాడులు, హత్యా ప్రయత్నాలు అధికమయ్యాయి. ప్రభుత్వము నుండి ఆశించినంతగా రక్షణ లేకపోవడముతో.... "పురుష జర్నలిస్టులకు లేని రక్షణ స్త్రీ జర్నలిస్టులకు ఎలా కల్పించగలము? మరిన్ని ఇబ్బందులు తప్పితే" అని పత్రికా సంపాదకులు గట్టి నిర్ణయానికి వచ్చేసారు. ఈ పరిస్థితులలో జర్నలిజ్మ్‌లోనికి మహిళలు రావడమన్నది ఇప్పటిలో కష్టమే!

ఒకటి రెండు పత్రికలు ధైర్యముచేసి రిపోర్టింగ్‌లోనికి మహిళలను తీసుకొంటే.... కేవలము మూడనాళ్ళ ముచ్చటగా వారి రిపోర్టింగ్ ముగిసిపోతున్నది. ప్రెస్ నోట్స్, సమావేశాలు, సభలతో వీరు సరిపెట్టుకోవలసి వస్తున్నది. ఇన్వెస్టిగేటివ్ జర్నలిజ్మ్‌లో మహిళలు రాణించుట కష్టముగా ఉన్నది.

మహిళా జర్నలిస్టులు కలము పట్టుకోకుండానే విపరీతమైన ఆంక్షలు విధించే యాజమాన్యాలు, "ఏ మాత్రము రక్షణలేని పాత్రికేయవృత్తి మంచిదికాద"ని చెప్పేసభ్యసమాజము వలన- మహిళలు జర్నలిజ్మ్‌లో నామ మాత్రులై పోయారు. నేడు మహిళలులేని చోటు, చేయలేని పని అంటూలేదు. "సాహసాలలో కూడ దిట్ట" అనిపించు

కుంటున్నారు. జర్నలిజ్మ్‌లోనికి వచ్చేసరికి ఎంత మాత్రము ఆస క్తిని, ఉత్సుకతను కనబఱచలేక పోతున్నారు.

నిర్దిష్టమైన చట్టాలతో- జర్నలిస్ట్‌లకు రక్షణ కల్పించేందుకు ప్రభుత్వము ముందుకువస్తే ... మహిళా జర్నలిస్ట్‌లు ముఖ్యముగా గ్రామీణ విలేఖరులు గణనీయముగా పెరుగుతారు. స్త్రీలకు అన్ని రంగాలలో ప్రాముఖ్యత లభించినట్లే.... జర్నలిజ్మ్‌లో కూడా మంచి **అవకాశాలు రావాలంటే.... ప్రభుత్వము పూనుకొని తగిన రక్షణ చర్యలను చేపట్టాలి.**

## విలేఖరికి- జగమంతా వార్తా మయమే...!

విలేఖరిగా మంచి గుర్తింపు పొందాలనుకున్న వారికి, విలేఖరి వృత్తికి పూర్తిగా న్యాయము చేయదలచుకొన్న వారికి- జగమంతా వార్తల మయమేనని చెప్పవచ్చును. "ఇది వార్త! ఇది కాదు!!" అన డానికి వీలు లేకుండా.... ప్రతిదీ వార్తే! వ్రాయాలన్న ధ్యేయము ఉండాలేగాని ప్రతి చిన్న విషయములోను వార్తను రాబట్టవచ్చు! ఇందుకు కొంత విజ్ఞానము, మరికొంత పరిశ్రమ అవసరము!వార్తల సేకరణలో.... నిజమైన విలేఖరికి రోజులోని 24 గంటలు చాలవు. ముందు కనిపించిన ప్రతి చిన్నా-పెద్దా పత్రికలు చదివే అలవాటు కావాలి. అలాగే తెలుగు ఇంగ్లీష్ పత్రికలతోబాటు ఇతర భాషలు వస్తే- ఆ భాషా పత్రికలు కూడ తప్పక చదవాలి. ఈ చదవడము వలన విలేఖరి చాలా తెలుసుకో గలుగుతాడు. ప్రధానముగా నూత నత్వము అలవడుతుంది. "జర్నలిజ్మ్"అనేది ఒక పెద్ద సముద్రము వంటిది. ఎంత నూతనత్వము నేర్చుకొన్నా.... అది ఇంకా ఇంకా సశేషముగా మిగులుతూనే ఉంటుంది. కనుక విలేఖరి వార్తాన్వేష ణలో అన్నికోణాల నుండి సేకరిస్తూ ముందుకు సాగాలి. "జగమంతా వార్తామయము" అనడానికి ఒక చక్కని ఉదాహరణ చూడండి!

బీహార్‌లో ఒక స్వాములు- తప్పుడు పనులు చేసి, ఒక గ్రామ

ములో చావు దెబ్బలు తిన్న వైనము ఒక హిందీదినపత్రికలో ప్రచురితమైనది. ఆ స్వాములు చిన్న చిన్న మహిమలను మేజిక్ టైప్‌లో చేసి చూపగలడు. దీని వలన ప్రజలలో ఒక స్వామిగా గుర్తింపు పొందాడు. సదరు స్వాములు ఒక నరబలికి పూనుకొని, ఒక అమాయక గిరిజనుని వినియోగించ చూసాడు. ఫలితముగా ఆ గిరిజనుడు కన్న కూతురిని చంపడానికి సిద్ధపడ్డాడు. ఈ విషయములో కన్న తల్లి అంగీకరించలేదు. పాపను ఎత్తుకొని గ్రామ రచ్చబండ దగ్గ అకు పరుగెత్తికెళ్ళి...."రక్షించమ"ని గావుకేకలు పెట్టింది. ఆ గ్రామ యువకులు స్వాములను చావ చితకతన్నారు. ఈ వైనము తమిళ్ నాడుకు చెందిన ఒక గ్రామీణ విలేఖరి అనుకోని విధముగా చదివాడు. తను అంగట్లో ఉప్పు కొన్నప్పుడు చుట్టబడ్డ దినపత్రికలో భాగమది! అంతో-ఇంతో హిందీ కొద్దిగా తెలుసు! ఉప్పు పొట్లాము విప్పాక... కాగితము చేత్తో సాపుచేసి సరదాగా తిరగవేసాడు. ఒక వైపు స్వాముల ఫొటో, మరోవైపు తల్లి-కూతురు ఫొటో ఉన్నది. ఆ వార్తను అసక్తిగా ఒకటికి పదిసార్లు చదివాడు. ఎందుకో ఆ వార్తపట్ల తమిళ గ్రామీణ విలేఖరికి మరింత ఆసక్తి పెరిగింది. తన "క్లిప్పింగ్స్ ఫైల్"లో భద్రపరిచాడు.

ఒక ఏడాది గడిచాక... సదరు స్వాములు తమిళ్‌నాడులోని నీలగిరి జిల్లాయందలి ఒక గ్రామములో విడిది చేశాడు. అతని చిన్న చిన్న మహిమలపట్ల గ్రామీణులు సంబరపడి, సాష్టాంగ పడసాగారు. ఈ మహిమలను వార్తగా వ్రాద్దామని వెళ్ళిన మన తమిళ విలేఖరికి ఏడాది క్రితము చదివిన ఉప్పుపొట్లాముగా చుట్టబడ్డ హిందీ దినపత్రిక కటింగ్ లీలగా గుర్తుకు వచ్చింది. ఫొటో; ఆ వార్తలోని స్వాములుపేరు, ఈ స్వాములు పేరు ఒక్కటే! వెంటనే ఆ తమిళ విలేఖరి ఆ హిందీ దినపత్రిక కథనముతో ప్రస్తుత స్వాములు విడిది చేసిన గ్రామములో మహిమలను జతచేసి, ఆఱు కాలమ్స్ వార్త వ్రాసాడు.

"దిన తంతి" తమిళ్ దినపత్రికలో అవార్త ఒక సంచలనము సృష్టించింది. స్వాములు ఈ వార్తా కథనాన్ని తెలుసుకొని, తమిళ్ నాడులో మాయ మయ్యాడు. కనుక ప్రతి విలేఖరీ కనిపించిన ఇతర భాషా పత్రికలు కూడా భాషా పరిజ్ఞానము ఉంటే....చదువుతుండాలి. ఈ విశ్వ ప్రపంచాన్ని గూర్చి తెలుసుకోవాలి. వీలున్నప్పుడు తను తెలుసుకున్నది.... పాఠకుల ముందుంచాలి. విలేఖరిఎప్పుడూ వార్తా యంత్రమే! వార్తా పత్రికలు ముద్రించే ప్రింటింగ్ ప్రెస్‌లకు నిర్దిష్ట మైన సమయము ఉంటుంది. కానీ.... విలేఖరికి లేదు. రోజులో ప్రతి సెకెండ్ వార్తా సేకరణకు పనికి వస్తుంది. విలేఖరి అసలు సిసలైన విరామములేని శ్రామికుడు!

## W W W W W + H

విలేఖరులకు జర్నలిజ్మ్‌లో ప్రవేశము లభించినపుడు డెస్క్ ఇన్ చార్జ్‌లు విధిగా కొన్ని విషయాలు తెలియ చేస్తారు. అవి "ఐదు డబ్ల్యూలు+ఒక హెచ్"గా వ్యవహరిస్తున్నారు. "ఏమిటీ డబ్ల్యూలు, హెచ్ అంటే...." అని వాటిని గురించి ముందుగా తెలుసుకోవాలి. "ఐదు డబ్ల్యూ"లుఅంటే... "What(ఏమిటి)?, When (ఎప్పుడు)?, Why (ఎందుకు)?, Where (ఎక్కడ)?, Who (ఎవరు)?, How (ఎలా)?" అనే ఆరింటి మీద ఆధారపడి, విలేఖరులు వార్తారచన సాగించాలి. చదివే పాఠకుడు ఈ ప్రశ్నల యొక్క సమాధానాలతో వార్తను పూర్తిగా తెలుసుకోగలుగుతాడు. ఐతే.... ప్రతి వార్తలోనూ వీటిని జొప్పించి-గుప్పించేయకూడదు. అలా చేస్తే... విసుగు పుట్టించి, అయోమయములోనికి పాఠకులను నెట్టిన వారౌతారు. సాధ్యమైనంతవరకు వార్తను చదివే పాఠకుడుకి చక్కగా అర్థ మయ్యేందుకు ఐదు డబ్ల్యూలు, ఒక హెచ్ అనునవి పనిచేస్తాయి. ఉదాహరణగా ఈ క్రింది అంశాలు పరిశీలిద్దాము!

ఒక ప్రముఖ వ్యక్తి సమావేశము ఏర్పాటు చేసాడనుకోండి! ఆ సమావేశ వివరాలు వ్రాసేటప్పుడు ఈఐదు డబ్ల్యూలు, ఒక హెచ్‌ను

ఉపయోగించాలి. లేకుంటే వార్త అస్పష్టతగా మిగులుతుంది. సమావేశము జరిపింది- ఎక్కడ (Where)?, ఎప్పుడు (When)?, ఆ ప్రముఖ వ్యక్తి ఎవరు (Who)?, ఏ విధముగా ఎలా (How)? మాట్లాడారు?, సమావేశము ఎందుకు (Why) ఏర్పాటు చేసారు?, ఆయన ఏమిటి (What) చెప్పారు?. ఇలా ఆ సమావేశము గూర్చి వ్రాస్తే.... పాఠకులకు విషయము అర్థమౌతుంది. హాయిగా చదువుకోగలుగుతారు.

**అనేక వార్తలలో ఈ ఐదు డబ్ల్యూలు, ఒక హెచ్ విధిగా కని** పిస్తుంటాయి. గ్రామీణవిలేఖరులకు ఈ సూత్రము చాలా ముఖ్యము! ఇది జర్నలిజ్మ్‌లో తొలి మెట్టు లాంటిది. దీనిని సందర్భాను సారముగా వాడుకుంటూ వెళ్తే.... విలేఖరి వ్రాసే వార్తలు ఇటు డెస్క్‌ల వద్ద ఇబ్బందిని కలిగించవు, అటు పాఠకులను తేలికగా అర్థము అయ్యేట్లు చదివింప చేస్తాయి.

## LEAD POINT (ప్రధానాంశము)

"లీడ్‌పాయింట్" అనేది- సామాన్యముగా ప్రారంభములోనే ఏ జర్నలిస్ట్‌కైనా తెలుస్తుంది. వృత్తి పరముగా ప్రవేశించినపుడు సంబంధిత సబ్ ఎడిటర్స్ ఈ లీడ్ పాయింట్ గూర్చి వివరిస్తారు. లీడ్ పాయింట్ అంటే.... ఏదైన బహిరంగ సభ జరిగినపుడు నాయకులు రకరకాలుగా మాట్లాడుతుంటారు. ఆ నాయకులలో ప్రముఖుడైన నాయకుని ఉపన్యాసమును లీడ్‌లోకి తీసుకొని, వార్తా ప్రారంభములో వ్రాయాలి. అలాగే ఏదైనా పత్రికా సమావేశము, మండల సమావేశము లేక ఇతరత్రా సమావేశాలు జరిగి నపుడు అందులో ముఖ్యమైన పాయింట్ తీసుకొని వార్త వ్రాయాలి. దీన్నే లీడ్ పాయింట్ అంటారు.

స్వాతంత్ర్యము రాక ముందు ఈ లీడ్ పాయింట్ వ్రాసే విధానము మరోలా ఉండేది.వార్తకు, శీర్షికకుసంబంధము ఉన్నా.... శీర్షికలో ఉండే లీడ్ పాయింట్ వార్తప్రారంభములో వచ్చేదికాదు.

వార్తలో మూడో పేరా లేదా నాలుగో పేరాలో కనిపించేది. అప్పటి జర్నలిజ్మ్ అలా ఉండేది. పత్రికా ప్రచురణలో అనేకానేకమార్పులు కోకొల్లలుగా వస్తున్నాయి.

లీడ్ పాయింట్ ఎంపికలో విలేఖరుల ధోరణులు రకరకాలుగా ఉంటాయి. కొంతమంది కఠినమైన పదాలను, పరుష భాషను, దూషణ-భూషణలను ఎంపిక చేసి; లీడ్ పాయింట్‌గా తీసుకొని వ్రాస్తారు. ఒక విధముగా ఈ విధానము జర్నలిజ్మ్‌లో మంచిధోరణి కాకపోవచ్చు. సమావేశములో బాధ్యత గల ఒకప్రముఖ నాయకుడి నోటి నుంచి వచ్చిన పదాలనే తాను వాడానని ఆ విలేఖరి చెప్పుకుంటాడు. ఇందులో ఆ విలేఖరిని తప్పుపట్టలేము! పైగా ఆ తరహా వార్తలను పాఠకులు ఆసక్తిగా చదువుతున్నారు. ఉదాహరణకు : ఒక మునిసిపల్ సమావేశములో.... చైర్మన్‌కు ఒకగది నిర్మించాలి. పక్కాబిల్డింగ్ నిర్మించడానికి రూల్స్ ఒప్పుకోవు! కనుక తాటాకుల పందిరి వేస్తామని కమీషనర్ చెప్పారు. అందుకు కౌన్సిల్ అంగీకరించింది. వాస్తవానికి పక్కా శ్లాబ్ రూమ్ నిర్మిస్తారు. కానీ.... రికార్డ్‌లో 'తాటాకుల షెడ్' అంటారు. ఈ వార్తను నలుగురు విలేఖరులు నోట్ చేసుకున్నారు. మరుసటి దినము మూడు పత్రికలలో ఈ వార్త చివరిలో చిన్నదిగా వచ్చింది. ఒక దిన పత్రికలో మాత్రము లీడ్ పాయింట్‌గా వచ్చింది. "మునిసిపల్ చైర్మన్‌కు తాటాకుల షెడ్" శీర్షికతో వెలువడిందా వార్త! ఆ వార్తను స్థానికులు వింతగా చెప్పుకొని చదువు కున్నారు. ఐతే ... కమీషనర్ అగ్గిబుగ్గయ్యాడు! "ఏమిటీ వ్రాతలు?" అంటూ శివాలు ఎత్తాడు! సిబ్బంది- తదితరులు ఆయనకు నచ్చజెప్పారనుకోండి!

ఒక మండల సమావేశములో మండలాధ్యక్షుడు- ఒళ్ళు మఱచి, శ్రుతిమించి- ప్రభుత్వాధికారుల పైన ధ్వజమెత్తాడు అరివీరభయంకరుడై చెలరేగాడు. "తలుపులు మూసేస్తా....! చావబాదేస్తా....!!" అన్నాడు. ఒక విలేఖరి ఈ పాయింట్‌నే లీడ్‌లో తీసికొని వ్రాసాడు.

పాఠకులు విచిత్రముగానే చదివారు. ఇలాంటి లీడ్‌లు ఎంపిక చేయ డము, వ్రాయడము ద్వారా ఆపత్రికకు మరింతగుర్తింపూ;అలాగే... ఆ విలేఖరిపై డెస్క్‌వారికి మంచి అభిప్రాయము ఏర్పడుతుంది. పాఠకులలో ముక్కుసూటిగా వ్రాసే విలేఖరికి మంచి గుర్తింపు లభి స్తుంది. ఎటొచ్చి ఈ వార్తల ద్వారా ఆ విలేఖరిఅజ్ఞాతముగా శత్రువు లను పెంచుకున్నవాడౌతాడు.ఆపద సమయము వచ్చినపుడు పత్రిక యాజమాన్యములు గానీ, పాఠకులుగానీ కాపాడే అవకాశముండక పోవచ్చు. ప్రత్యర్థులు "ఎల్లో జర్నలిజ్మ్" అని ఎద్దేవా చేస్తారు. కనుక విలేఖరి లీడ్‌పాయింట్స్ ఎంపికలో ఘాటు, కఱకుదనము విడిచి పెడితే మంచిదని సీనియర్స్ చెబుతుంటారు. ఎక్కువమంది విలేఖరులు పెద్దల కన్నెఱ్ఱకు గుఱై పత్రికల నుండి తొలగించబడు తుంటారు. ఈ వ్రాతల వలన- ఏ కొద్ది మందో.... పత్రికల యాజమాన్యాల నుండి మంచి గుర్తింపు పొంది, ఉన్నతస్థాయికి చేరతారు. లీడ్ పాయింట్ ఎంపికలో విలేఖరి భవిష్యత్ ముడి పడి ఉంటుంది.

## YELLOW-JOURNALISM
## తీవ్రమైన వాస్తవిక వార్తలు

ముక్కు సూటిగా, వేలెత్తి చూపించేటట్లువార్త వెలువడితే... ఆ వార్త వలన బాధపడిన వ్యక్తి- "ఆ విలేఖరి వ్రాసేది ఎప్పుడు 'ఎల్లోజర్నలిజ్మ్ వార్తలే! అలాంటి వారిని ఆ పత్రిక పెట్టుకోవడమే తప్పు!" అని గుఱ్ఱుమంటాడు. తీరా.... ఆ కామెంట్ చేసిన వ్యక్తిని- "ఏమండీ! 'ఎల్లోజర్నలిజ్మ్' అంటే.... ఏమిటి"? అని అడిగితే.... వారికి అదేమిటో తెలియదు. కొందరు తెలిసినట్లు ఏదో చెబుతారు. మరి కొందరు "అబద్ధపు వార్తలు వ్రాసి, బ్లాక్ మెయిల్ చేసే వారు; వారు వ్రాసిన చెత్తవ్రాతలు 'ఎల్లోజర్నలిజ్మ్' క్రిందికి వస్తాయి" అని చెబుతుంటారు. వాస్తవానికి- చెత్త వ్రాతలు, అబద్ధపు వార్తలు, బ్లాక్‌మెయిల్ వార్తలు 'ఎల్లోజర్నలిజ్మ్' క్రిందికి రావు.

పాశ్చాత్యదేశాలలోని పాఠకులకు- ఇప్పటికీ ఈ 'ఎల్లోజర్నలిజ్మ్' మీద మంచి అభిప్రాయమే ఉన్నది. దీని వెనుక ఉన్న అసలు కథ ఏమిటీ అంటే ... లండన్‌లోని ఒకానొక పత్రికా ఎడిటర్ రకరకాల పత్రికలకు ఎడిటర్‌గా పనిచేసాడు. కానీ.... ఏ ఒక్క పత్రికా విజయవంతము కాలేదు. కారణము "గాసిప్స్" ఆయన సంపాదకత్వములో లేవు! వాస్తవికత పైన ఆధారపడి పత్రికను ఆయన నడుపుట వలన పాఠకులు పెద్దగా ఆసక్తి కనబఱచలేదు. ప్రతి ఏడాది ఆయన సేవలకు ఏదో ఒక సాంస్కృతిక సంస్థ నుంచి గుర్తింపు, నగదు బహుమతి లభించేవి. చివరికి 'ఎల్లోపేజెస్" అనే పత్రికను తన స్వంత డబ్బుతో ప్రారంభించాడు. అదో పక్ష పత్రిక! ఈసారి ఒక క్రొత్త ప్రయోగము చేసాడు. తను నమ్మిన నీతి-నిజాయతీలను వదలకుండా.... మరింత లోతుగా వెళ్ళి పరిశోధనాత్మకమైన వార్తా కథనాలతో ఆ పత్రిక విడుదల చేసాడు! ఆ ఇంగ్లీష్ పత్రిక తొలి పక్షమే పన్నెండు లక్షల కాపీలు.... కేవలము నాలుగు గంటల వ్యవధిలో అమ్ముడయ్యాయి.

"ఎల్లోపేజెస్"లో- ప్రముఖుల అక్రమ సంబంధాలు, అజ్ఞాతములో ఉన్న మాఫియా ముఠాల ఉనికి, అధికారుల అక్రమార్జన, సినీతారల తెరవెనుక కథలను కళ్ళకుకట్టినట్లు ఫోటోలతో సహా ప్రచురించాడు. ఆ వాస్తవ వార్తలను ఇంగ్లీష్ వారు సంబరముతో చదువుకొనే వారు! "ఎల్లోపేజెస్"లో వార్త వచ్చింది అంటే.... ఆ వార్త నూరు శాతము నిజమైన వార్త అనేది పాఠకులలో, సంబంధిత అధికారులలో బలముగా ఉండేది. ఆ వార్తలను అందరూ "ఎల్లోపేజెస్" వార్తలనీ, "ఎల్లోజర్నలిజ్మ్"అనీ పిలుచుకొనేవారు. ఎంతో పేరు-ప్రఖ్యాతులు సంపాదించిన ఆ పత్రిక కేవలము 18 మాసాలు నడిచి మూత పడింది! కారణము ఎడిటర్ స్వల్ప అస్వస్థత చెంది మరణించడమే! నాటి నుంచి....నేటివఱకు- జర్నలిస్టులు, పాఠకులు, ప్రముఖ వ్యక్తులు- ఏదైన వాస్తవికతతో కూడిన తెర వెనుక జరిగే

సంచలన వార్తలను గురించి వ్యాఖ్యానించేటపుడు "ఎల్లో జర్నలిజ్మ్" అనుట అనవాయతీ అయ్యింది.

ఈ నాటికీ "ఎల్లోజర్నలిజ్మ్" అంటే.... చాలా మందికి తెలియదు. కానీ చెడామడా వాడేస్తుంటారు. ఏ విలేఖరి మీద ధ్వజమెత్తినా ముందుగా వాడేమాట "ఎల్లోజర్నలిస్ట్"అని! ఆపైనదుర్భాషలు, మీదపడి ఏదో చేదామన్న కసి! ఇలా.... వాస్తవ వార్తల వలన ఇబ్బంది పాలైన ప్రముఖులు- విలేఖరులను.... బాధిస్తుంటారు.

భారత దేశములో "ఎల్లోజర్నలిజ్మ్" అనేది లేదు. వాస్తవముగా వ్రాసే పత్రికలు చాలా తక్కువ! కొన్ని పత్రికలు ఏదో ఒక పార్టీ లేదా నాయకునికి అనుకూలముగా వ్రాస్తాయి. దీని వలన అవి అవాస్తవాలకు దగ్గఅయ్యాయి. మరికొన్ని పత్రికలు పూర్తిగా సంచలన వార్తల పేరిట అబద్ధాలు వ్రాసేస్తుంటాయి! ఇంకొన్ని బ్లాక్మెయిలింగ్ విధానాలతో నడుస్తుంటాయి. ఇలాఇవి ఆశయాలు లేకుండా ప్రచురింపబడుతున్నాయి. వీటిని "ఎల్లోజర్నలిజ్మ్" అని అనరు- అనకూడదు. కేవలము "భట్రాజు పత్రికలు" అంటే సరిపోతుంది.

ఇటీవల ఒక ప్రముఖ దినపత్రిక-"సినీ నటుడు శ్రీ బాలకృష్ణ హిందీ 'విశ్వామిత్ర' షూటింగ్లో.... ఆ చిత్ర మేనక పాత్ర ధారిణి అర్చనా జోగ్లేకర్తో అసభ్యముగా ప్రవర్తించిన"ట్లు.... దీనితో "ఆ మహారాష్ట్ర తార తీవ్ర ఆగ్రహము వెలిబుచ్చిన"ట్లు వ్రాసింది. అదీ 'పతాక శీర్షిక'లో వెలువడింది. ఆ మరుసటి దినము శ్రీ N.T.R. "అది అబద్ధపువార్త"అన్నారు."ఖండనవార్త ఆ పత్రికలో అదేచోట వేయాలి. లేకుంటే.... చట్టపరముగా చర్య తీసికోవలసి వస్తుంద"ని విలేఖరుల'ప్రశ్న'లకు'సమాధాన'ముగా అన్నారు. ఇది జరిగిన మరునాడు- పసుపు రంగులో ఖండన వార్త వెలువడింది. ఈ వార్త కచ్చితముగా నూటికి నూరు పాళ్ళు "అబద్ధపు వార్త" అని తెలిసిపోయింది. ఇలాంటి వార్తలు ఏమి ఆశించివ్రాయాలి ? పాఠకుల ముందు చులకన కావడానికి తప్ప! మొత్తానికి ఆ పత్రిక- అభాసుపాలైనది.

ఇలాంటి అవాస్తవ వార్తలను "ఎల్లోజర్నలిజ్మ్" అనరు. ఇట్టి 'బూటకపు వార్తలు' విలేఖరులు వ్రాయకూడదు. పత్రికలు ప్రోత్సహించకూడదు. "ఒకరినుండి మన్నన పొందడానికి- వేరొకరిని కించపఱచి వ్రాయడమన్నది జర్నలిజ్మ్‌లో "ఒక పెద్ద దుష్ట సాంప్రదాయము" అని చెప్పక తప్పదు. శ్రీ బాలకృష్ణపై లేనిపోనివి వ్రాయడము.... వ్రాసాక ఆ ప్రముఖ దినపత్రిక తోక ముడిచి....ఆ వార్తపై ఖండన వేసికోవడము.... జర్నలిజ్మ్‌నకు తీరని కళంకము! ఆ వార్త వలన పత్రిక సాధించిన సర్క్యులేషన్ కంటే....ఖండనతో కోల్పోయిన ప్రతిష్ఠే ఎక్కువ!

వాస్తవాన్ని వ్రాయడానికి శోధన ఎంతో అవసరము! ఏ విధమైన శ్రమ లేకుండా....శోధించకుండా...ఏవేవో సృష్టించివ్రాస్తే.... ఇలాంటి ఇబ్బందులు తప్పవు. జర్నలిజ్మ్‌లో "అట"కబురులు;ఊహించి, కల్పించి కథనాలు సృష్టిస్తే.... ఫలితము "జీరో"యే!అవాస్తవాలు, వ్యక్తిగత విషయాలు వ్రాస్తే ... కొంతమంది సంపాదకులు పెదవి విఱచి- "వ్యక్తిగత విషయాలు వ్రాయడము మంచిదికాదు" అంటారు. "మరి ప్రస్తుత పత్రికలలో వ్యక్తిగత విషయాలపై పుంఖాను పుంఖాలుగా వార్తలు వెలువడుతూనే ఉన్నాయం"టే.... వారు మాట్లాడుట లేదు.

ఇలాంటి వ్యక్తిగత వార్తలు వెలువడినపుడు కొన్నిచోట్ల ఉద్రిక్తత ఏర్పడుతుంటుంది. వ్రాసే విలేఖరిపై అమానుషముగా దాడులు జరుగుతుంటాయి. భారత పత్రికలలో కనిపించే సాంప్రదాయమునకు- కచ్చితముగా భిన్నమైనది వ్యక్తిగతవిషయాలపై వార్తలు వ్రాయడము! దీనిని ఇక్కడ ఎవరూ హర్షించరు. కాబట్టి విలేఖరులు వార్తలు వ్రాసేటపుడు వ్యక్తిగత విషయాల జోలికి పోకూడదు.

## నేర ప్రపంచము 'CRIME WORLD'

ఏ పత్రికకైనా, విలేఖరికైనా.... ఎక్కువమంది పాఠకులలో గుర్తింపు వచ్చిందీ అంటే.... నేర వార్తల సేకరణే అధిక కారణ

మని చెప్పాలి. సాధారణముగా హత్య, మానభంగము, ఆత్మహత్య, గూండాయిజ్మ వంటి వార్తలన్నందలి వాస్తవికతను గూర్చి- లోతుగా శోధించి వ్రాసిన వార్తలైతే.... పాఠకులకు ఆ కథనాలపట్ల విశేష మైన ఆసక్తి కలుగుతుంది. జర్నలిస్ట్లకు పేరు వచ్చేది కూడా- పరి శోధించి వ్రాయగలిగిన వార్తా కథనాల వల్లనే! ఐతే....ఈ వార్తలు వ్రాయడము అషామాషీ వ్యవహారము కాదు. కత్తిమీద సాము లాంటిది. ఏ చిన్న పొరపాటు జరిగినా.... వార్తా పరముగా పలు ఇబ్బందులు ఎదుర్కోవాల! విలేఖరి ఎప్పుడూ కూడా తన స్వంత ఆలోచనలకు నేర వార్తలలో అవకాశము కల్పించకూడదు. శోధన వలన తెలిసిన వాస్తవాలనే 'నేరవార్త'గా వ్రాయాలి. ఇక "నేర వార్తలను- విలేఖరి ఏ విధముగా సేకరించాలి?" అనేది తెలుసు కుందాము!

ఏదో ఒకచోట హత్య జరిగినదనుకోండి! పట్టపగలైతే.... విలేఖరికి కొన్ని గంటలు సమయము ఉంటుంది. రాత్రి ఏడు గం॥ల నుండి తొమ్మిది గం॥ల లోపు వార్తను పత్రికా కార్యాలయమునకు పంపించవచ్చు. కనుక "హతుడెవరు?", "హంతకుడెవరు?", "హత్యకుగల కారణమేమిటి?", "పాత కక్షలా?" లేకుంటే.... "ఉద్రేకములో జరిగినదా?", "అసలు హత్య జరగడానికి గల పరి స్థితులేమిటి?"ఇలాంటి వన్నీ విలేఖరి రాబట్టుకోవాలి! పోలీస్వారు ఈ సమాచారాన్నిస్తారు. వారు ఇచ్చేది సాధారణముగా"కట్టె ...కొట్టె.... తెచ్చె ..." అనే పద్ధతిలో వుంటుంది. ఇక్కడే విలేఖరి చాకచక్యము ప్రదర్శించాలి. నేరవార్తను వివిధ కోణాల నుండి సేకరించాలి. హత్య జరిగిన స్థలము, సాక్షుల కథనము; బంధువుల నుంచి హతుడి వివరాలు చక్కగా రాబట్టవచ్చు. అలాగే.... హంతకుడి విషయములో కూడా! అతని గత ప్రవర్తన సేకరించి, పోలీస్వారు ఇచ్చిన సమాచారముతో జోడించి విలేఖరి వార్త వ్రాయవచ్చు. ఇక్కడ చిన్న ఇబ్బంది ఒకటున్నది. హంతకుడిని గూర్చి పోలీస్

వారు- "మాకు ఫలానా అని తెలియదు! హంతకుడు ఎవరైనది దర్యాప్తు చేస్తున్నాము!!" అని చెప్పినపుడు ... కొంతమంది "మా పేర్లు చెప్పమాక! వ్రాయమాక!! ఫలానా వాడే చంపాడు!!!" అని గోడమీద పిల్లిలా.... కబురులు చెబుతుంటారు. ఈ గోడమీద పిల్లుల సాక్ష్యముతో హంతకుడు "ఫలానా" అని వార్తవ్రాస్తే.... పప్పులో కాలువేసినట్లే! కచ్చితముగా పోలీస్‌వారి సమాచారము మేరకే వ్రాయాలి. ఈలోగా "ఫలానా వాడే చంపాడు!"అని హతుడి బంధువులో.... లేకుంటే ఏ రాజకీయ నాయకులో చెప్పితే.... ఫలానా వారు చెప్పినట్లుగా వ్రాయవచ్చు!

సాధారణముగా నేరము చేసేవాడు- "చట్టానికి లొంగి పోవాలి!" అని అనుకోడు. "తప్పించుకుందామనే అనుకుంటాడు!" నేరాన్ని ఉన్నదున్నట్టుగా ఏ ఒక్కరూ అంగీకరించరు. ఎంతో కొంతదాచే ప్రయత్నములోనే ఉంటారు. ఈ పరిస్థితులలో విలేఖరి వాస్తవము వ్రాస్తే.... ఆ నేరస్థుడుకి విలేఖరిపై కక్ష, అక్కసు పెరుగుతాయి. కనుక పోలీస్‌వారు చెప్పిందే వ్రాయడము మంచిది. ఈ తరహా సాధింపులను గ్రామీణ విలేఖరులు అధికముగా ఎదుర్కో వలసి వస్తుంది. ఈ పరిస్థితి పట్టణప్రాంతములోని కంట్రిబ్యూటర్స్‌కు అరుదనే చెప్పాలి. పై విషయాలను 'దృష్టి'లో వుంచుకొని, పోలీస్‌వారి నుండి సమాచారము రాబట్టుకొని, వార్త వ్రాస్తే పోలా!" అని కొంతమంది అంటుంటారు. ఇప్పుడు పత్రికలలో పోటీలు బాగా పెరిగాయి. వార్తను "ఎవరెంత బాగా ఇచ్చారు?", "ఎవరు ఎంతలోతుగా సేకరించి వేసారు?" అనేది పాఠకులకు కావాలి. మిగతా సాంకేతిక విషయాలు వారికి అనవసరము! ఈ నేపథ్యములో- నేర వార్తలు వ్రాసే విలేఖరి సమయస్ఫూర్తితో వ్యవహరించాలి.

ఇక.... మానభంగమునకు గురైన స్త్రీ పేరు పత్రికలలో వ్రాయకూడదు. ఏ ఒక్కరు చేసినా, సామూహికముగా చేసినా ఆ

కామాంధుల పేర్లు మాత్రము ఏ ఒక్కటీ వదలకుండా వ్రాయవచ్చు. లైంగిక నేరాలను గురించి వార్తలు వ్రాసేముందు- విలేఖరి ప్రశాంతముగా ఉండి వార్తా సేకరణ యందు నిమగ్నము కావాలి. "ఒక స్త్రీకి మానభంగము జరిగింది" అంటే.... అక్కడి ప్రజలలో ఉద్రిక్త పరిస్థితి ఏర్పడుతుంది. ఒకవేళ ఆ స్త్రీ అనాథై ఉండి; లైంగికనేరము చేసినవాళ్ళు గొప్పవాళ్ళు ఐతే.... వార్త సేకరణ వఱకే విలేఖరి ప్రయత్నించాలి. ఎలాంటి ఉద్రిక్తతకు లోను కాకూడదు. తానే "ధర్మమునాలుగుపాదాల నడిచేటట్లు చూడాల"న్నట్లుగానూ;"నేరస్థులను శిక్షించే వఱకు నిద్రపోరాద"న్నట్లుగానూ వ్రాసే వార్తలో కనిపించకూడదు. "జరిగింది ఏమిటి?, ఎలా ఆ స్త్రీపై అత్యాచారము జరిగింది??, పోలీస్‌వారు ఏ విధముగా స్పందించారు???, ఆ స్త్రీ వివాహితా- అవివాహితా????" వంటివి సేకరించి వార్త వ్రాయాలి. అందులో పోలీస్‌వారి కథనము విధిగా ఉంటే మంచిది. అత్యాచారమునకు గురైన స్త్రీ చెప్పిన కథనము కూడ వ్రాయవచ్చు. ఎట్టి పరిస్థితులలో కూడా ఆ స్త్రీ పేరు వ్రాయకూడదు. పైగా ఆమె భర్త, తల్లి-తండ్రుల పేర్లు కూడా గోప్యముగా ఉంచాలి. వీరిలో ఎవరి పేరు వ్రాసినా.... ఆ స్త్రీ ఎవరైనది తెలుస్తుంది. పత్రికలలో లైంగిక అత్యాచార్యానికి గురైన స్త్రీల పేర్లు బహిష్కరించడానికి ఒక ప్రత్యేక కారణమున్నది. స్త్రీ శారీరకముగా హింసించబడ్డ తరువాత పత్రికలలో.... ఆ వార్త ప్రచురింపబడుట వలన అదనముగా మానసిక వేదనకు కూడ గురికావలసి వస్తుంది. దీనికితోడు పేరువ్రాస్తే.... ఆమెకు మరింతగా కీడు చేసినట్లు ఔతుంది. కాబట్టి పేరు వ్రాయకూడదు.

అత్యాచారము జరిగాక ... నేరస్థులను పట్టుకోవడములో పోలీస్‌వారు పెద్దగా ఆసక్తి కనబఱచకపోతే ... స్థానికముగా ఉండే రాజకీయ పార్టీలు, యువజన సంఘాలు, మహిళామండలివారు ప్రదర్శనలు, నినాదాలు, ఊరేగింపులు జరిపి.... నేరస్థులను అరెస్ట్ చేసే

వలకు ఉద్యమిస్తుంటారు. వీటిని ఎప్పటి కప్పుడు వార్తా రూపము లోనికి తీసుకురావాలి. "నేరస్థులు అజ్ఞాతముగా దాక్కున్నారా?, పరారైనారా?, పోలీస్‌వారి పరిశోధనాతీరు"వంటి కథనాలు పాఠకులను ఉత్సాహముగా చదివిస్తాయి. విలేఖరి 'వాస్తవిక దృష్టి'కి ప్రశంసలు లభిస్తాయి. లైంగిక అత్యాచారము జరిగినతీరు, వర్ణనలు, అప్పుడు జరిగిన శారీరక హింసల వంటివి కళ్ళకు కట్టినట్లుగా విలేఖరులు వ్రాయకూడదు. ఇలాంటివి వ్రాస్తే ... మరోచోట నేరము జరగడానికి ప్రేరణ కావచ్చును.

నేరవార్తల కారణముగా.... కొంతమంది నేరస్థులు- ప్రముఖ హీరోలుగా మారిపోతుంటారు. ఉదాహరణకు ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్‌లందు- గత దశాబ్దములో బందిపోట్ల అలజడి ఇంతా అంతా కాదు. పత్రికలవారు వారిని పతాక శీర్షికలలోనికి ఎక్కించి, ప్రముఖముగా వ్రాయడముతో.... వారు మరింత పెట్రేగిపోయి దోపిడీలు, హత్యలు చేయసాగారు. "వారిని గూర్చి, వారి నేపథ్య కథనాల గూర్చి వ్రాయడముతో... 'వారు చేస్తున్నపని సరైనదే .. అన్న భావన ప్రజానీకములో ఏర్పడుతున్నద"నీ, "దీనితో-ఆ నేరస్థులకు ధైర్యము పెంపొంది మరింత రాక్షసులుగా ప్రవర్తించ సాగార"ని పోలీస్ ఉన్నతాధికారులు గగ్గోలు పెడుతూ ఉండేవారు. ఇందులో కొంత వాస్తవము, మరికొంత అవాస్తవముఉన్నది. ఏ బందిపోటో... ఏ అర్ధరాత్రో, ఏదో ఒక గ్రామములో తుపాకిచూపి దోచుకుపోతుంటాడు. అడ్డుపడిన ఒకరిద్దరిని కాల్చి చంపుతాడు. దీన్ని పత్రికల-వాళ్ళు వార్తగా వ్రాయకపోతే ఎలా? అదే బందిపోటు తనకంటూ ఒక ముఠా ఏర్పాటు చేసుకొని, గ్రామాలపైపడి దోచుకొని, అడ్డు వచ్చినవారిని చంపేస్తూ, బీభత్సము సృష్టిస్తుంటే.... విలేఖరి ఎప్పటి కప్పుడు వార్తలు వ్రాస్తుంటాడు. ఇంతగా పెట్రేగిపోతున్న బందిపోటు గతచరిత్రను త్రవ్వి వ్రాయడములో తప్పులేదు. ఐతే.... ఈ వార్తా కథనాల వలన బందిపోటుపై ప్రజలు, అధికారులు ఎక్కువగా ఊహించుకుంటారు. ఇది హీరోను చేయడమే కదా!

నేర వార్తలు ప్రముఖముగా పతాక శీర్షికలలో రావడము వలనే అడవి దొంగ 'వీరప్పన్' మరింత భయంకరుడై ... అడ్డు వచ్చిన వారిని నిర్దాక్షిణ్యముగా చంపేస్తూ.... రెండు రాష్ట్రాలను గజగజలాడిస్తున్నాడు. పైగా....ఈ నరరూప రాక్షసుడిని ఇంటర్వ్యూ చేసింది ఒక తమిళ విలేఖరి! ఈతడు ప్రాణాలను అఱచేతిలో పెట్టు కొని వీరప్పన్ స్థావరానికి వెళ్ళి .. ఫోటోలు, ఇంటర్వ్యూ తీసుకు వస్తే.... ఆ తమిళ విలేఖరి సమాచారాన్ని పెద్ద మొత్తములో ఒక ఆంగ్ల పత్రిక కొనుగోలు చేసి వేసుకున్నది. అంటే.... నేరవార్తలకు పత్రికలు ఎంత ప్రాధాన్యత ఇస్తున్నదీ.... దీన్నిబట్టి అర్థము చేసి కోవచ్చు. ఈ విధముగా ఆ ఆంగ్ల పత్రిక జాతీయ-అంతర్జాతీయ హీరోను చేసేసింది- 'స్మగ్లర్‌వీరప్పన్'ని! అతనిక్రూరమనస్తత్వము, చేసిన హత్యల పరంపర, దోచుకున్న వైనము వ్రాస్తుంటే ... వీర ప్పన్ ప్రజలలో హీరోకాకపోతే ఏమౌతాడు? అతనిని పట్టుకోవాలను కున్న పోలీస్ అధికారు లెందరో మృతి చెందారు. ఇలాంటి వీరప్పన్ అకృత్యాలకు పత్రికలు సెన్సార్ పాటిస్తే ... అతనినిపట్టుకోవడానికి వెళ్ళేవారు సాధారణ దొంగను పట్టుకున్నంత తేలిక భావముతో ఉంటే.... వీరప్పన్ చేతిలో మరణించే వారి సంఖ్య చాంతాడంత ఔతుంది. ఈ విధముగా వీరప్పన్ నేర వార్తలు పోలీస్ వారికి, పాలకులకు ఎంతో మేలును కలుగ చేస్తున్నాయని చెప్పక తప్పదు.

నేర వార్తల వలన లాభపడేది.... పోలీస్ వారని చెప్ప వచ్చు. నేర వార్తలు వారి పరిశోధనకు ఎంతో ఉపయోగపడు తుంటాయి. విలేఖరి ఈ నేర వార్తల పట్ల అప్రమత్తముగా వ్యవ హరించి వ్రాయగలిగితే.... అటు పత్రికకు, ఇటు విలేఖరికి మంచి గుర్తింపు లభిస్తుంది. విలేఖరి నేరవార్తలను వ్రాయాలన్న ఉత్సాహ ముతో పాటు- తఱచు పోలీస్ ఠాణాలకు వెళ్తూ.... వారితో మంచి సంబంధాలు పెట్టుకొని, వారిలో కలిసిపోయి వుండాలి. విలేఖరికి పోలీస్ ఉన్నతాధికారి నుండి, దిగువస్థాయి ఉద్యోగి వఱకు మంచి

సంబంధాలున్నప్పుడే నేర వార్తలు వ్రాయడానికి అవకాశము, సేకరణకు సులభ మార్గము ఏర్పడుతుంది.

అలాగే.... మత-కుల ఘర్షణలు జరిగినపుడు విలేఖరులు ఏ మాత్రము తప్పటడుగులు వేసినా.... పత్రికలలోని తన వ్రాతల వలన మరింత ఆజ్యము పోసి, ఘర్షణలు పెంచినట్లు ఔతుంది. మరణించిన వారి మతము-కులము, పేర్లు వ్రాస్తే ... ఉద్రిక్తత మరింత పెరగడానికి కారణము కాక తప్పదు. కాబట్టి విలేఖరి వార్త వ్రాసేటపుడు ముందు-వెనుకల గూర్చి బాగా ఆలోచించి మరీ వ్రాయాలి. జరిగిన దారుణాలకు తాను తీవ్రముగా స్పందిస్తే.... ఆ దారుణాలను మరింత పెంచిన వాడౌతాడన్నది నూటికి నూరుపాళ్ళు నిజము! కాబట్టే ... దేశములో ఎక్కడ మత ఘర్షణలు జరిగినా.... పత్రికలు మతము-కులము, వ్యక్తుల పేర్లను విడిచిపెట్టి వ్రాస్తుంటాయి. ఐతే.... కొన్ని మతతత్వ పార్టీలకు చెందిన పత్రికలు, వాటి విలేఖరులు "ఫలానా మతమునకు చెందిన పన్నెండు మంది దారుణముగా వధింపబడ్డారు. వారిని వధించిన తీరు ఇది!" అని వ్రాస్తుంటారు. దీనివలన ఆ మత ఘర్షణల తీవ్రత పెరిగిపోయి; మరిన్ని హత్యలకు, గృహదహనాలకు కారణమైన వైనాలు చాలాచోట్ల లోగడజరిగాయి

కర్ఫ్యూ విధించబడిన పట్టణ ప్రాంతములోని న్యూస్ కంట్రిబ్యూటర్స్- ఇటీవల వార్తా పత్రికల పోటీలకు అనుగుణముగా.... ప్రాణాలకు సైతము తెగించి, వార్తా సేకరణలో చాలా ముందంజ వేసారు. హైదరాబాద్‌లో మత కల్లోలాలు జరిగినపుడు.... నిర్మానుష్యమైన బజారుల వెంట, భయంకరమైన నిశ్శబ్దములో- కాలినడకన కేవలము చిన్న నోట్ బుక్, ఒక పెన్ పట్టుకొని వార్తలను సేకరించారంటే.... తెలుగు జర్నలిజమ్ వార్తాప్రపంచములో ఎంతటి ప్రగతిసాధించినదో.... అర్థమౌతున్నది. B.S.F. జవాన్‌లు- వారి విధి నిర్వహణలో భాగముగా లాఠీలు ఝళిపిస్తే .. ఆ లాఠీ దెబ్బలు తిన్న విలేఖరులు చిరునవ్వులు చిందిస్తూ.... నాటి కర్ఫ్యూ వార్తలు

చక్కగా పత్రికలకు తీసుకురాగలిగా రంటే... వారికున్న మన స్థైర్యాన్ని, సమయస్ఫూర్తిని- ప్రతి కంట్రిబ్యూటర్ విధిగా తెలుసు కోగలగాలి.

కత్తిపోట్లు, పోలీస్ కాల్పులవంటివి జరిగిన ప్రదేశాలయందు- విలేఖరులు ప్రత్యక్షమై.... వాస్తవ వార్తలను రాబట్టారంటే.... శ్లాఘించవలసినదే! ప్రాణాలను లెక్కచేయకుండా... వృత్తిధర్మాన్ని పాటించడమంటే... అనుకున్నంత సులువుకాదు.

బంగ్లాదేశ్ విముక్తి కొఱకై భారత్-పాకిస్తాన్‌తో పోరాటము సాగిస్తున్నపుడు- ఆ యుద్ధ వార్తలుసేకరించడానికివెళ్ళిన "అమృత్ బజార్" ఆంగ్ల పత్రిక రిపోర్టర్‌ను పాకిస్తాన్ సైనికులు కాల్చివేసారు. ఆ తరువాత దీనిపై అంతర్జాతీయముగా పెద్ద అసంతృప్తి వ్యక్త మైనది. ఈ సంఘటన 1971లో జరిగింది. అందుకే కర్ఫ్యూ సమయములోనూ, యుద్ధము జరుగుతున్నప్పుడూ విలేఖరులు సాహ సించరు. మరి నేటి పోటీ ప్రపంచములో విలేఖరులు సాహసాలకు పూనుకుంటున్నారు. ప్రాణాలను లెక్కచేయడము లేదు.

## దొంగతనాలు-దోపిడీలు

సాధారణముగా దొంగతనాలు జరిగినపుడు విలేఖరులు క్షుణ్ణ ముగా పరిశీలించి వార్త వ్రాయాలి. దొంగలు ఏ విధముగా గృహ మందు లేక ఆ స్థానమందు ప్రవేశించారు? విలువైన వస్తువులను ఎంతమేరకు ఎత్తుకుపోయారు? వారివద్ద మారణాయుధాలున్నాయా? ఉంటే.... అవి ఎలాంటివి? ఎవరినైనా గాయపఱచారా? ఇలాంటివి వ్రాస్తూ.... దొంగలను చూసిన వారి ప్రత్యక్ష సాక్ష్యాలు విధిగా వార్తలో వ్రాయాలి! ఇవన్నీ వ్రాస్తే.... ఈ దొంగలను గూర్చిన వివ రాలు జిల్లా అంతటా తెలుస్తాయి ఈసారి ఇలాంటివి మరో గ్రామ ములో జరిగినప్పుడు ఇదే పద్ధతిలో దొంగతనము జరిగితే.... "ఒకే ముఠా చేస్తున్నది" అని పోలీస్‌లు, ప్రజలు నిర్ధారణకు వస్తారు.

దీని వలన పోలీస్‌వారి పరిశోధన కొంత ముందుకు సాగుతుంది. అలాగే... ఈ విషయములో ప్రజలు కొంతమేరకు జాగ్రత్తపడే అవకాశము ఉంటుంది. ఇలా వార్తా పత్రికల వలన కొంత ప్రయోజనము చేకూరుతుంది. ఇందుకు సంబంధించిన ఒక వార్తా కథనము ఈ క్రింద పరిశీలించండి!

ఒక విచిత్రమైన దొంగలముఠా ఒకసారి శ్రీకాకుళం జిల్లాలో ప్రవేశించింది. వీరివద్ద ఎలాంటి ఆయుధాలు లేవు. పట్టపగలు క్షణాలలో దోచుకోవడము వీరికి వెన్నతో పెట్టినవిద్య! ఎవరో ఆసామి బస్-స్టాండ్‌నందు క్యాష్‌బ్యాగ్‌తో బస్ కోసము నిలబడివుంటే.... ఒక అనామకుడు వచ్చి "సార్ ఏమిటి? మీ షర్ట్ వెనుక ఏదో అంటుకుందని" చెప్పడము; ఆ ఆసామి తడుముకుని చూస్తే.... అది పంది లేదా కుక్క మలము కావడము .. సదరు ఆసామి ముక్కుపుటా లెగరేస్తూ... బ్యాగ్ ప్రక్కన పెట్టి, షర్ట్‌కు అంటినది వదిలించుకోవడానికి షర్ట్ విప్పడము.... నీళ్ళతో వదిలించుకున్నాక.... బ్యాగ్ కోసము చూసేసరికి బ్యాగ్‌లేకపోవడము క్షణాలలో జరిగిపోయాయి. తదుపరి పోలీసులు రావడమూ... ఈ విచిత్రమైన దొంగతనముపై దర్యాప్తు చేయడము జరిగింది. బ్యాగ్‌లో వేలరూపాయలు గల్లంతైన విషయము విలేఖరి చక్కగా స్టోరీవ్రాస్తే... పాఠకులకు ఏదో క్రైమ్ నవల చదివిన ఫీలింగ్ కలిగింది అలా ఆసక్తిగా చదివింపచేసిందా వార్త!

ఈ వార్త వెలువడిన తరువాత కూడా జిల్లాలో పలుచోట్ల ఇదే పద్ధతిలో దొంగతనాలు జరిగాయి. ఒకే ముఠా జరిపిన విచిత్ర దొంగతనాల క్రింద పోలీస్ వారి దర్యాప్తు సాగింది. విలేఖరు లెప్పుడూ.... దొంగతనాలు-దోపిడీల గురించి కళ్ళకు కట్టినట్లు వ్రాయగలిగితే... ప్రజలకు మేలు చేసిన వారౌతారు. వరుసగా ఒకే ముఠా చేసిన దొంగతనాలను ఎప్పటికప్పుడు ఆయా ప్రాంత విలేఖరులు వ్రాయడము వలన జిల్లా ప్రజలు అప్రమత్తులౌతారు. ఆ

మురా అంతటితో ఆ జిల్లా వదిలేస్తుంది. కొంతమంది పోలీస్ ఆఫీసర్స్ సమయ స్ఫూర్తితో వ్యవహరిస్తూ... సమస్యలను తేలికగా పరిష్కరిస్తూ వుంటారు. ఇటువంటి వారిని విలేఖరి ఒకమంచి వార్త ద్వారా పాఠకుల ముందుంచాలి. దీనికి సంబంధించిన ఒక వాస్తవ ఉదంతాన్ని గురించి ఇక్కడ చర్చించుకొందాము!

పారిశ్రామిక వేత్తయైన వైశ్యరాజు అప్పలరాజుగారి వద్ద గుమస్తాగా పని చేస్తున్న మన్మథరావుగారింట ఎవరో మూడు తులాల బంగారు గొలుసు తస్కరించారు. ఇది ఎవరు తీసారో.... చూచాయగా మన్మథరావు దంపతులకు తెలుసు! ఇంట్లోని T.V.లో సినిమా చూడడానికి వచ్చిన ఇరుగు-పొరుగువారే- ఆ 'నగ' దొంగిలించారు. వారి నుండి 'నగ' ఎలా రాబట్టాలో తెలియని మన్మథరావుగారు- తనయజమాని అప్పలరాజుగారికి చెప్పుకున్నాడు.ఆయన పోలీస్‌వారికి ఫోన్ చేసాడు. ఈ కేస్ విషయమై వచ్చిన సబ్‌ఇన్‌స్పెక్టర్ D.రమణారావుగారు మన్మథరావు గారింటి వద్ద చిన్న అలజడి రేపాడు. ఆయన చుట్టు ప్రక్కల ఇళ్ళవారి నుద్దేశించి- "మన్మథరావుగారింటిలోనుండి దొంగిలించిన'నగ'ను మర్యాదగా అప్పజెప్పండి! ఆ నగ ఎవరు దొంగిలించారో... మన్మథరావుగారికి తెలుసు! కానీ.... అనవసరముగా మిమ్ము బజారు కెక్కించడము ఇష్టము లేక.... మాకు మీ పేరు చెప్పలేదు. ఇక నగ దొరకకపోతే.... ఆయన దొంగిలించిన వారి పేరు మాతో చెబుతాడు! ఆయన చెప్పినా-చెప్పకపోయినా.... అన్ని కుటుంబాల వారిని అరెస్ట్‌చేసి, మా విధానములో మేము నిజాన్ని రాబట్టగలము. నేరము చేసి, మానుండి తప్పించుకోవడమంటూ ఉండదు!" ఈ విధముగా గంభీర స్వరముతో అరుస్తూ ఉన్నారు. ఆయన మాటలలో- బెదిరింపు, బుజ్జగింపు, కఠినత్వము మిళితమై ఉన్నాయి. నేరము చేసినవారు ప్రొఫెషనల్స్ కానపుడు ఈ టెక్నిక్ బాగా పనిచేస్తుంది. కొద్ది సేపట్లో.... మన్మథరావు పెరటి పిట్టగోడ మీదనుంచి ధూపకు వచ్చి పడిందా నగ!

అంటే.... ఇరుగు-పొరుగు వారిలో- ఆ నగ దొంగిలించినవారు మానసికముగా బెదరిపోయారు. వారు దొంగతనమే వృత్తిగా ఉన్న వారుకారు. ఏదో బలహీన క్షణములో నగ దొంగిలించారు. కానీ.... S.I. D. రమణారావుగారి చాతుర్యముతో, సమయస్ఫూర్తితో.... ఎలాంటి అరెస్టులు, ఇంటరాగేషన్స్ లేకుండా.... 'నగ' లభించింది. మరి ఇలాంటి కథను చక్కగా వ్రాసి, వార్తగా తీసుకురావాలి. ఈ కథనాలు- పోలీస్ అధికారులను హీరోలనుచేస్తాయి. ఐతే లేనిపోనివి మాత్రము సృష్టించి వ్రాయకూడదు. వాస్తవాలను మాత్రమే విలేఖరి వ్రాయాలి.

## గుర్తు తెలియని శవాలు

"గుర్తు తెలియని శవము"అని నిర్ధారణ జరిగిన తరువాత.... కచ్చితముగా దాన్ని ఫొటో ఐటమ్ చేయాలి. విధిగా ఫొటో తీసి వార్త వ్రాయాలి. "బస్‌లో ప్రయాణిస్తూ.... మరణించిన వ్యక్తి!" అలాగే.... రైల్‌లో జరిగినా- ఫొటోతీసి వార్త వ్రాయాలి. ఆ మరణించిన వ్యక్తి ఎవరైనదీ తెలియడానికి, పోలీస్‌ల దర్యాప్తు సులభతరము కావడానికీ ఈ వార్త పనికివస్తుంది. అలాగే....రోడ్ ప్రమాదాలు జరిగినపుడు ప్రతి చిన్న విషయాన్ని విలేఖరి వ్రాసుకోవాలి. ప్రమాదము జరిగినతీరు.... ఎంతమంది మరణించినదీ? ఎంతమంది ప్రభుత్వాసుపత్రిలో చేరినదీ? వారి పరిస్థితీ....డ్రైవర్‌ఏమయ్యాడు? ఒక వేళ సురక్షితముగా ఉంటే.... పోలీసులకు లొంగాడా? పారిపోయాడా? ఇవన్నీ వార్తలో వ్రాయాలి. ఫొటోలు ఎన్నివేయాలో.... ప్రమాద తీవ్రతనుబట్టి నిర్ణయించుకోవాలి.

గుర్తు తెలియని శవాన్ని కూడా పోలీస్ వారు పోస్టుమార్టమ్ చేయిస్తారు. ఆ రిపోర్ట్ పరిశీలిస్తే... మరణము సహజ సిద్ధమా ? హత్యా?? అన్నది తెలుస్తుంది. ఆ రిపోర్ట్ చూసాక.... ఫాలోఅప్ వార్త వెంటనే వ్రాయాలి. ఇలాంటి గుర్తు తెలియని శవాల వెనక-

హంతకులు ఉంటే.... పోలీస్ దర్యాప్తులో దొరికిపోతారు. అందుకే పోస్ట్‌మార్టమ్ వివరాలు పోలీస్ వారి ద్వారా తెలుసుకొని వ్రాస్తే... నిజానిజాలు తెలుస్తాయి. సహజ మరణమైతే.... వార్త అంతటితో సరి! అసహజ మరణమైతే... వార్త పొడిగింపుకు అవసరము కలుగుతుంది.

## ఆత్మహత్యల వార్తలు

ఆత్మహత్యా వార్తల విషయములో- విలేఖరులు తగు జాగ్రత్తలు తీసుకోవలసి ఉన్నది. ఆత్మహత్యలు ముఖ్యముగా మానసిక, ఆర్థిక కారణాల వలన జరుగుతాయి. ఆత్మహత్యలు ఇటీవలి కాలములో చాలా ఎక్కువ అయ్యాయి. భర్త, అత్త-మామల హింస కారణముగా తన పిల్లలతో ఒక గృహిణి బావిలో పడి మరణిస్తే.... విలేఖరి పూర్తి వివరాలు సేకరించాలి. ఆమె ఎప్పుడు బావిలో దూకింది? మృతదేహము ఎప్పుడు వెలికి తీసారు? భర్త, అత్త-మామలను పోలీస్‌లు అరెస్ట్ చేసారా? ప్రశ్నించి వదిలేసారా? ఆ తదుపరి పోస్ట్‌మార్టమ్ రిపోర్ట్‌లో- ముందుగా హత్యచేసి బావిలోకి నెట్టారా? ఆమె కావాలని దూకిందా? తెలిసిపోతుంది. ఈ వివరాలు అక్కడి ఇరుగు-పొరుగు వారి నుంచి, హతుల బంధువుల నుంచి రాబట్టుకోవచ్చు. వార్తలో ఎక్కడా విలేఖరి కనిపించకూడదు. "భర్త, అత్త-మామల హింసలను తట్టుకోలేక పాపము చనిపోయింది! చనిపోక ఏమి చేస్తుంది? ఈ సమాజములో స్త్రీకి విలువెక్కడుంది? ఆమెను ఓదార్చేవారే లేరు! చావక ఏమి చేస్తుంది? పోతూపోతూ పిల్లలను కూడా తనతో తీసుకుపోయింది. ఉంటే.... వారిని ఎవరు చూస్తారు?" వంటి కంటితుడుపు వ్యాఖ్యానాలు అనవసరముగా విలేఖరి చేయకూడదు. ఈ వ్యాఖ్యానాల- ప్రేరణతో, ప్రభావముతో మరో చోట.... ఇంకోచోట.... ఇదే తరహా ఆత్మహత్యలు జరగడానికి అవకాశాలు ఏర్పడవచ్చు.

ఏదైనా ఆత్మహత్య కేస్‌లో విషము త్రాగి మరణించారను కోండి! ఆ విషము పేరు ఫలానా అని వివరము ఇవ్వకూడదు. ఆ విషము పేరు తెలియ చెప్పడము మంచిదికాదు.

## తుపానులు-వరదలు-ఉప్పెనలు

తుపాను సంభవిస్తే ... విలేఖరులు పాఠకులకు ఆసక్తికర మైన వార్తలకు మొదటి ప్రాధాన్యత ఇవ్వాలి. ఆ తరువాత తుపాను బీభత్స రూపము ఎలా ఉన్నది సేకరించాలి! 1) పంటల నష్టము, 2) పడిపోయిన చెట్లు, 3) కూలిన గుడిసెలు, 4) వరదల కారణ ముగా తెగిపోయిన రహదారులు, 5) కొట్టుకుపోయిన రైల్వేట్రాక్స్, 6) బస్-ట్రైన్ సర్వీస్‌ల కంతరాయము, 7) వరదలలో ముంపుకు గురైన గ్రామాలు, 8) ఆహార పొట్లాల విషయములో ప్రభుత్వ-ప్రైవేట్ సంస్థల పంపిణీ తీరు; 9) అధికారుల, రాజకీయ నాయ కుల వరద ప్రాంత సేవలు; 10) నిరాశ్రయుల తాత్కాలిక వసతికై అధికారులు ఏమిచేసారు....? వంటివి సేకరించాలి!తుపాను-వరదల వంటివి ఏర్పడినపుడు విలేఖరి మానవాసక్తికరమైన కథనాలు ఎప్పటికప్పుడు వ్రాయాలి.

వరదలలో ముఖ్యముగా ప్రజారోగ్యముపై దృష్టి కేంద్రీ కరించాలి. కలరా, డయేరియా, గ్యాస్ట్రోఎంటిరైటీస్ వంటివి క్షణా లలో ప్రబలిపోతాయి. వీటి వలన ఒక్కొగ్రామములో చాలామంది తీవ్ర అస్వస్థతకు గురౌతుంటారు. వీంకి వైద్య సదుపాయము ఏ విధముగా అందుతున్నదీ? అందనిదీ?? వారి పరిస్థితి,ఎవరైనా చని పోతే.... ఆ వివరాలు వెంటనే వార్తా రూపములోకి తీసుకురావాలి. ప్రాథమిక ఆరోగ్య కేంద్ర అధికారులు ఈ పరిస్థితిపై ఏ విధముగా స్పందించారు? వ్యాధి ప్రబలకుండా, మరణాలు పెరగకుండా.... ఏ విధముగా కృషి చేస్తున్నదీ వార్త వ్రాయాలి. పరిస్థితి అదుపులో ఉన్నపుడు- ఆరోగ్య కేంద్ర అధికారుల స్పందనపై కూడా వార్త వ్రాయగలిగితే.... వారికి మంచి ఉత్సాహము ఉంటుంది. ఒక వేళ

వారిలో స్పందన లేకుంటే ... చావుల సంఖ్య పెరిగిపోయి, వైద్య సహాయము అందని వారు ప్రైవేట్ ఆసుపత్రులలో ట్రీట్‌మెంట్ పొందుతూ ఉంటే.... ఈ వైనము మొత్తము పత్రికలో వ్రాయాలి. ఈ తరహా వార్తలు పాఠకులకు ఉత్కంఠ కలిగిస్తాయి. పైగా.... ఇలాంటివి బాక్స్ ఐటమ్స్‌గా వస్తాయి. వైద్య సిబ్బంది నిర్లక్ష్య వైఖరి చూపినపుడు.... ఒక వైపు జిల్లా అధికారులు, రాజకీయ నాయకులు విలుచుకుపడతారు. వీటినికూడా విలేఖరి వాస్తవిక దృష్టితో వ్రాస్తే.... ఆ గ్రామములో ఆరోగ్యమును పరిరక్షించిన వారౌతారు.

'గూడు' కొట్టుకుపోయినవారి 'గోడు'ను కథా రూపములో వ్రాయగలిగితే ... ఇదో మానవాసక్తికరమైన వార్తౌతుంది. అలాగే.... ఏడాది పొడుగుగా రెక్కలు ముక్కలు చేసుకొని, పండించి, గాదెల్లో దాచుకొన్న పంట వరదొచ్చి తుడుకుపోయిన కథనాలు, దాని వెనుక ఆ రైతు దీనగాథ; ఇంకా.... వందలాది ఎకరాలలో.... ఇసుక మేటలు వేసిన విషయాలు; సన్నకారు-చిన్నరైతుల దిక్కుతోచని పరిస్థితి, ఆ కొద్ది పొలమే కుటుంబానికి ఆధారమైన తీరును వార్తలుగా మలచాలి.

పంటల నష్టాన్ని సంబంధిత అధికారుల నుంచి సేకరించుకోవాలి. ఊజ్జాయింపుగా వ్రాసేయ కూడదు. వరద బాధితులకు- ప్రభుత్వ సాయాన్నీ, ఇచ్చే రాయితీలనీ, ఋణాల మాఫీని- ఎప్పటికప్పుడు సేకరించి వ్రాయాలి. ఒక్కోసారి- వందలు-వేల ఎకరాలలో ఇసుక మేటలు వేస్తే.... "కేవలము ఒక వంద ఎకరాలల్లోపే ఇసుక మేట పడింద"ని కొంతమంది జిల్లా అధికారులు నమోదు చేసుకొని ప్రభుత్వానికి నివేదిక పంపుట జరుగవచ్చును. ఇలా జరిగినపుడు విలేఖరులు అధికారి సేకరించిన ఇసుక మేటలు వేసిన వ్యవసాయ క్షేత్రాల వివరాలు తెలుసుకొని; మిగిలిన గుర్తింపు పొందని ఇసుక మేటల వివరాలు ఫొటోలతో సహా పత్రికలలో వార్తగా వ్రాయాలి. ఇలా వ్రాసినపుడు విలేఖరి- రైతులకు తనవంతు సహాయము చేసిన వాడౌతాడు.

వరద-తుపాను తాకిడికి గుఱైన ప్రాంతాలపై ఎప్పటికప్పుడు 'ఫాలోఅప్' వార్తలు ఇస్తూ ఉండాలి. ఆయా గ్రామాలకు, రైతులకు ప్రభుత్వము నుంచి సకాలములో సహాయము అందడానికి పత్రికలలో వచ్చే వార్తలు ఎంతో ఉపకరిస్తాయి. ఎట్టి పరిస్థితులలో కూడా విలేఖరి అవాస్తవమూ, కల్పితాలకు తావివ్వకూడదు.

## అగ్ని ప్రమాదాలు

వేసవిలో అగ్ని ప్రమాదాలు తఱచుగా జరుగుతుంటాయి. పూరి పాకలు, గడ్డివాములు తగలబడి పోతుంటాయి. వీటిపై వార్తలను- విలేఖరులు కళ్ళకు కట్టినట్లుగా చిత్రీకరించవలసి ఉంటుంది. పూరిళ్ళు లేక పూరి గుడిసెలో వంట చేస్తుండగా.... నిప్పు చెలరేగి, అంటుకొని- అగ్ని ప్రమాదము జరుగవచ్చు. ఆ ప్రమాదములో వందల ఇళ్ళు కాలిపోవచ్చు. పశువులు, కోళ్ళు, పసిపిల్లలు మృతి చెందవచ్చు. దాచుకున్న ధాన్యము, డబ్బు, బంగారము కాలి-బూడిద కావచ్చు. ఇలాంటి సమయాలలో విలేఖరి పూర్తిగా లీనమై వార్తలు సేకరించాలి. ప్రమాద కారణము... ఎన్నిళ్ళు కాలాయి? ఎంత నష్టము వాటిల్లినది? ఫైర్ సర్వీస్ వారి పనితీరు, బాధితులకు ఎవరేమి సహాయము చేస్తున్నది? వార్తల రూపములో ఎప్పటి కప్పుడు వ్రాస్తుండాలి. ఇలాంటి ప్రమాదాలలో కొన్ని వింతలు జరుగుతుంటాయి. అలాంటి ఒక వాస్తవిక వార్తా కథనము ఈ క్రింద పరిశీలించండి!

చేపలు పట్టే వృత్తితో జీవిస్తున్న కంద్రజాతివారి పాకలకు నిప్పంటుకుని పెద్దమంటలులేచాయి. ఆ మంటల ఉధృతికి పొరుగున ఉన్న హరిజనవాడలోని పూరిళ్ళు అంటుకున్నాయి. మొత్తము ఇరువైపులా తొంబై ఇళ్ళు భస్మీపటలమై పోయాయి. ఈ నేపథ్యములో పట్టణములోని కొన్ని సేవా సంస్థలవారు- బాధితులకు భోజనాల ఏర్పాటు చేసారు. కంద్రజాతి కులస్థులు దాచుకున్న కొద్దిపాటి డబ్బు, ఇళ్ళు సమస్తము అగ్నికి ఆహుతికాగా.... కట్టుబట్టలతో నడిరోడ్డున నిలబడి ఉన్నారు. ఆ సమయములో కూడా వారు జాతి

వివక్షత కనపఱచారు. అది ఏమిటీ అంటే ..."హరిజనులతో కలిసి, ససేమిరా కూర్చొని తినముగాక తినమ"న్నారు. మొండి పట్టుదల కనపఱచారు. పసిపిల్లలు నకనకలాడుతూ ఏడుస్తున్నా....కుల పెద్దలు వివక్షత మాత్రము వదలలేదు. ఇలాంటి వార్తను ఒక ప్రముఖ పత్రిక బాక్స్ ఐటమ్‌గా వేసింది. ఆ వార్త జిల్లాలో పెద్ద సంచల నము రేపింది. ఇక్కడి విలేఖరి- వార్త సేకరణలో వేసిన ముందంజ, చొఱవ నిజముగా ప్రశంసనీయము!

## రైల్ ప్రమాదాలు

ట్రైన్ ఏక్సిడెంట్స్ జరిగినపుడు వార్తలు వ్రాయడానికి విలేఖరి ప్రమాదస్థలికి చేరుకోవాలి. అక్కడ కనిపించే దంతా.... ఒకటికి పదిసారులు గుర్తుంచుకోవాలి. ప్రమాదములో గాయపడ్డవారెందరు? మరణించిన వారెందరు? ప్రమాదము ఎలా జరిగింది? గాయము తగలని ప్రయాణీకుల ప్రవర్తన ఎలా ఉన్నది? వారు ఏవిధముగా హాయ పడ్డారు? కొంతమంది ఇదే అదనుగా భావించి, వస్తువులు దొంగిలించడము వంటివి చేసారా ? ఇలాంటివి సేకరించాలి. ప్రయాణీకులను ఇంటర్వ్యూ చేయాలి. అధికారులను కలుసుకుని, పరిస్థితి సమీక్షించుకుని రిపోర్ట్ తయారు చేయాలి! ఈ ప్రమాద బాధితుల నుంచి కొన్ని ఆసక్తికరమైన కథలు వినవచ్చు. ఉదా హరణకు : ఆ మరుసటిదినము రాకరాక వచ్చిన "ఇంటర్వ్యూకు తను హాజరు కావలసి ఉన్నది. కానీ.... బలమైన గాయాలు తగిలి ఆ అవకాశము పోయింది." అని నిట్టూర్చిన ఒక నిరుద్యోగ యువ కుని కథనము వంటివి చాలా లభిస్తాయి. కళ్ళకు కట్టినట్లుగా దృశ్యాలు వివరిస్తూ ... విలేఖరి వివిధ రకాలుగా వార్తలను మల చుకు పోవచ్చును.

రైల్వే అధికారులు ఏ విధముగా స్పందించారు? ఎన్ని రైళ్ళ రాకపోకలకు అంతరాయము కలిగింది? రైల్వే సిబ్బంది యుద్ధ ప్రాతిపదిక పైన సహాయక పనులను చేపట్టినదా? లేదా?? అనేవి

పరిశీలించి వ్రాయాలి. ట్రైన్ ప్రమాదానికి కారణము ఏమిటి? అన్నది అధికారుల ద్వారా తెలుసుకోవాలి. ఆ దర్యాప్తు వివరాలు వార్తగా వ్రాయాలి. రైల్ క్రింద పడి ఆత్మహత్య చేసుకున్న వారి వివరాలు అప్పుడప్పుడూ రైల్వే పోలీస్ వారు ఇస్తుంటారు. ప్రమాదాల వార్తలను విలేఖరి స్వతంత్రించి వ్రాయకూడదు.

## "క్రైమ్ రిపోర్టర్" అనుట తప్పు

ఇటీవల కొన్ని తెలుగు దిన పత్రికలు "క్రైమ్ రిపోర్టర్", "క్రైమ్‌కంట్రిబ్యూటర్" పేరిట క్రైమ్ వార్తలు ప్రచురిస్తున్నాయి. అసలు ఈ"క్రైమ్ రిపోర్టర్" అనేది తప్పు! దీనికి"నేరాల విలేఖరి" అన్న అర్థము పాఠకులకు స్ఫురించేట్లుఉన్నది. కాబట్టి.... "క్రైమ్ స్టోరీ కంట్రిబ్యూటర్", "క్రైమ్ న్యూస్ రిపోర్టర్" పేరిట ప్రచురించాలి. తెలిసి-తెలిసి తప్పు చేయడము పాఠకులను పరీక్షించడమే ఔతుంది.

ఇప్పటికీ కొన్ని పెద్ద పత్రికలు "విలేకరి" అని తప్పుగా వ్రాస్తున్నాయి. "విలేఖరి" అన్నది సరైన పదము!

## కోర్ట్ వార్తల పట్ల జాగ్రత్తలు

న్యాయస్థానాల మీద వార్తలు వ్రాయడానికి కొన్ని పత్రికలు "లీగల్ కంట్రిబ్యూటర్స్"ను వేసుకున్నాయి. కారణము ఈ వార్తలు వ్రాయడము చాలా కష్టము!! కత్తిమీద సాములాంటి ఈ వార్తలు వ్రాసేటపుడు ప్రతి విలేఖరి ఒకటికి పది సారులు "ఏమైనా పొరపాటు మనము చేస్తున్నామా? వ్రాసే విధానములో ఏదైనా లోపమున్నదా?" అని తలచి-తలచి చూచుకోవాలి. కోర్ట్ విచారణలో ఉన్న కేస్‌లను గూర్చి వ్రాయడము, జడ్జ్‌మెంట్ ఐన తరువాత అనవసరముగా వ్యాఖ్యానాలు చేస్తూ వార్త వ్రాయడము ఎంత మాత్రము మంచిది కాదు.

అతి ముఖ్యమైన కేస్ ఐనా, ప్రజలలో ఉత్కంఠరేపే కేస్ ఐనా... కచ్చితముగా దానిని పత్రికలో వ్రాయవలసి ఉంటుంది.

అంటే.... జడ్జ్‌మెంట్ కాపీ అయా కోర్టులలో పొందవచ్చు. విలేఖరి మాటకారియై ఎదుటి వారిని ఆకట్టుకొనే గుణము ఉంటే.... నేరుగా మేజిస్ట్రేట్‌ను కలుసుకోవచ్చును. ఆయన చెప్పాలనుకుంటే.... చెబుతారు. లేకుంటే.... వెనుతిరిగి వచ్చేయాలి. కోర్టులో లభించే తీర్పు కాపీని చక్కగా, వివరముగా.... పత్రికల భాషలోకి వ్రాసుకోవాలి. అనవసర వ్యాఖ్యానాలు గానీ, న్యాయస్థానాన్ని కించపఱచేటట్లుగానీ వ్రాయకూడదు న్యాయాధికారిపైన ఏవిధమైన ఆరోపణలూ చేయకూడదు. దీనికో ఉదాహరణ ఈ క్రింద పరిశీలిద్దాము!

"ఒక మేజిస్ట్రేట్- న్యాయవాదులతో చేతులు కలిపి, ప్రతి కేస్‌లోనూ పెద్దమొత్తము తీసుకుంటున్నారు. ఈ విషయమై ... నా వద్ద బలమైన సాక్ష్యాలున్నాయి! వార్తగా వేద్దామ"ని ఒక కంట్రిబ్యూటర్ ఒక దినపత్రిక డెస్క్ ఇన్‌చార్జ్‌ని అడిగాడు. "ఆ వార్త మనము వేయలేము! ఎంతటిబలమైన సాక్ష్యాలున్నా...న్యాయస్థానాన్ని, న్యాయమూర్తినిఅవమానించే వార్తలు-పత్రికలో ప్రచురించలేమ"ని ఇన్ చార్జ్ చెప్పి, ఊరుకోమన్నాడు. ఇది జరిగిన కొద్ది రోజులకు జిల్లా జడ్జ్‌చే ఆ మేజిస్ట్రేట్ లంచగొండితనము గుఱించి- ప్రభుత్వము దర్యాప్తు చేయించింది. తరువాత ఆ జడ్జ్ డిస్మిస్ చేయబడటము కూడ జరిగింది. ఎందుకు డిస్మిస్ అయ్యాడన్న వార్త పత్రికలకు ఆ తరువాత వచ్చింది.

కోర్ట్ పదజాలాన్ని యథాతథముగా వ్రాస్తే.... పాఠకులకు పెద్దగా అర్థముకాకపోవచ్చు. కాబట్టి పత్రికల భాషలోకి సరళముగా మార్చుకుని వ్రాయాలి. న్యాయమూర్తి- ఏ భాగమైనా "వార్తలోకి రాకూడదు!" అని చెప్తే .. ఆ మేరకు తొలగించాలి. సాక్ష్యములు, నిందితుల వాదనలు సేకరించి వ్రాయవచ్చు. ఎట్టి పరిస్థితులలో కూడా కోర్ట్ తీర్పుకంటే ముందుగా.... విలేఖరి- "తీర్పు ఇలా ఉండవచ్చు!" అని ఊహించి వ్రాయకూడదు.

ఇక.... విలేఖరి వార్తా వ్యాసంగములో ఏ మాత్రము తెలివితేటలు ప్రదర్శించినా మంచి వార్తను వెలుగులోకి తీసుకురావచ్చు.

ఇందుకు ఒక చక్కని ఉదాహరణ 13-జనవరి, 1990లో "ఈనాడు"లో వెలువడ్డ వార్తా క్లిప్పింగ్ ఈక్రింద చూడండి!

"మునిసిఫ్ మేజిస్ట్రేట్ తొలగింపు"

ఆమదాలవలస, జనవరి-12 (న్యూస్‌టుడే) :- స్థానిక మునిసిఫ్ మేజిస్ట్రేట్ శ్రీ భాస్కరరావును ఈ నెల నుండి ఆ ఉద్యోగము నుండి తొలగిస్తూ.... హైకోర్ట్ ఉత్తర్వులు జారీచేసింది. ఉత్తర్వులు ఒక ప్రత్యేక దూత ద్వారా ఆయనకు అందాయి. ఉత్తర్వులు అందుకోగానే శ్రీ భాస్కరరావు తన బాధ్యతలను శ్రీకాకుళం ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేట్‌కు తాత్కాలికముగా అప్పగించారు. శ్రీ భాస్కరరావును పదవినుండి తొలగించడానికి గల కారణాలు పరిశీలించగా.... ఆయన మునిసిఫ్ మేజిస్ట్రేట్ పరీక్షకు హాజరైనపుడు సర్వీస్ కమీషన్ నిబంధనలు పాటించక పోవడమేనని తెలిసింది. మొదటి మూడు-నాలుగేళ్ళపాటు రాజోలులో లాయర్‌గా ప్రాక్టీస్ చేసిన శ్రీ భాస్కరరావు 1981వ సం॥ము నందు విశాఖలో హిందూస్తాన్ షిప్‌యార్డ్‌లో లా ఆఫీసర్‌గా పనిచేస్తూ, మునిసిఫ్ మేజిస్ట్రేట్ పోస్ట్‌కు దరఖాస్తు చేసారు. కానీ.... దరఖాస్తు చేస్తున్న నాటికి లా ప్రాక్టీస్ చేయాలన్న నిబంధనను ఆయన పాటించని కారణముగా ఆయన దరఖాస్తు తిరిగి వచ్చేసింది. ఐతే.... శ్రీ భాస్కరరావు 1984వ సం॥ములో హైకోర్ట్‌కు వెళ్ళి, తాత్కాలిక ఉత్తర్వులు సంపాదించి, పరీక్షలో కూర్చుని, ఉత్తీర్ణులై పోస్ట్ సాధించారు. ఆ తరువాత హైకోర్ట్‌లో ఈయనకు వ్యతిరేకముగా తీర్పు రాగా.... 1986వ సం॥ములో తిరిగి ఆయన సుప్రీమ్‌కోర్ట్‌కు వెళ్ళారు. అక్కడా వ్యతిరేక తీర్పు రావడముతో 1987వ సం॥ములో రాష్ట్ర గవర్నర్‌కు ప్రత్యేకముగా విజ్ఞప్తి చేసుకున్నారు. "మూడేళ్ళగా మేజిస్ట్రేట్ పదవిలో కొనసాగుతున్నాన"నీ, "ఇకపై కూడా కొనసాగ నివ్వాల"నీ ఆయన గవర్నర్‌ను అభ్యర్థించారు. నాటి నుంచి కాలయాపన జరిగి మరో రెండు ఏళ్ళు గడచిన తరువాత.... చివరగా.... ఈ నెల

మూడో తేదీన గవర్నర్ కూడా ఆయన విన్నపాన్ని తిరస్కరించ డముతో పదో తేదీన హైకోర్ట్ శ్రీ భాస్కరరావుకు తొలగింపు ఉత్తర్వులు పంపింది.

శ్రీ భాస్కరరావును తొలగిస్తూ జారీ ఐన ఉత్తర్వులు చూసిన లాయర్సంతా.... మొదట ఆశ్చర్య చకితులయ్యారు. ఆయన మంచి తనము, నీతి-నిజాయతీలను గుర్తు చేసుకొని తీవ్రముగా స్పందించారు. గురువారము రాత్రి- కోర్ట్ ఉద్యోగులు, లాయర్స్ ఆయనకు ఘనముగా వీడ్కోలు ఇస్తూ, విందు ఏర్పాటు చేసారు. ఈ సందర్భముగా జరిగిన లాయర్స్ సమావేశములో- శ్రీయుతులు A. రామ్మోహనరావు, S.ప్రభాకరరావు, K.కృష్ణారావు, A.మురళీమోహనరావు, B. సత్యం, M.M. హుస్సేన్, Ch. రమేశ్ గారులు ప్రసంగించారు. "శ్రీభాస్కరరావు ఎక్కడున్నా...."మేలిమి వంటివార"నిస్తుతించారు.

ఈ వార్తను వెలికి తేవడములో విలేఖరి మంచి ప్రతిభను కనబఱచాడు! వాస్తవానికి ఈ వార్త మిగిలిన పత్రికలలో రాలేదు. కారణము ఆ వార్తపట్ల మిగతా విలేఖరులు పెద్దగా ఆసక్తి చూపించక పోవడమే! పైనఉదహరించిన"మునిసిఫ్ మేజిస్ట్రేట్ తొలగింపు" వార్త ఏ ఉన్నతాధికారి చెప్పినట్లుగా లేదు. అది కేవలము విలేఖరి సేకరించుకొని మరీ వ్రాసుకున్నవార్త! "ఈ వార్తను ఎలా రాబట్టాడు?" అనేది పరిశీలిస్తే.... "మేజిస్ట్రేట్ తొలగింపు జరిగింద"ని న్యాయవాదులనుంచివిన్నాక....ఆవిషయముపైఆసక్తికలిగి, సేకరణపైన దృష్టిని నిలుపుట వలన మొత్తము విషయము వార్తగా వ్రాయగలిగాడు. న్యాయవాదులకు న్యాయ సంబంధమైన పత్రికలున్నాయి. అందులో ఒక పత్రికయందు శ్రీ భాస్కరరావు కేస్ విషయము పదిహేను పేజీల వఱకు ఇంగ్లీష్‌లో వివరించబడిఉన్నది. "శ్రీ రమేశ్" అనే న్యాయవాది సహకారముతో విలేఖరి తనకు పనికి వచ్చే అంశాలను ఎంపిక చేసుకుని, వార్తా రచన చేసాడు. అంటే.... విలేఖరులకు-న్యాయవాదులతో, కోర్ట్ సిబ్బందితో,పోలీస్‌లతో మంచి స్నేహ సంబంధాలుంటే.... ఇలాంటి వార్తలు రాబట్టుకోవచ్చు నన్నమాట!

ఇక కోర్ట్‌లో తఱచుగా వినిపించే- పారిభాషిక పదాలకు తగిన అర్థము విలేఖరులకు తెలిసి ఉండాలి. ఆ కోర్ట్ పదాలనే వాడితే.... పాఠకులకు 'పజిల్'గా ఉంటుంది. కాబట్టి ఆ వార్తను వారు సరిగా చదువరు. ఏ వార్తైనా.... పాఠకుడు హాయిగా చదువుకో గలగాలి! కఠినమైన పదాలతోగాని, అర్థముకాని పదాలతోగాని, పూర్తి గ్రాంథిక భాషలోగాని వార్త వ్రాయకూడదు. వార్త చదివేటపుడు పూర్తిగా చదువకుండా మధ్యలోనే ఆపేసేట్టుగా వార్త వ్రాయకూడదు. తేలిక భాషలో వార్త వ్రాయడము- ప్రతి విలేఖరి విధిగా, తప్పని సరిగా నేర్చుకోవాలి!

## ఎన్నికలలో విలేఖరి పాత్ర

పార్లమెంట్, అసెంబ్లీ, మునిసిపాలిటీ, పంచాయతీలతో బాటుగా.... అతి చిన్న ఎన్నికలైన పరపతి సంఘాలు, కాలేజ్‌లు, ఫ్యాక్టరీ యూనియన్ ఎన్నికల వంటివి కూడా వార్తా పత్రికలలో ప్రముఖముగా చోటు చేసుకుంటాయి. పార్లమెంట్, అసెంబ్లీ ఎన్నికలు మెయిన్ ఎడిషన్స్‌లో.... పతాక శీర్షికలుగా వస్తాయి. మిగిలిన మునిసిపాలిటీ, పంచాయతీ స్థాయి ఎన్నికల వంటివి- జిల్లా పేజీలలో ప్రముఖముగా కనిపిస్తాయి. ఈ ఎన్నికలలో విలేఖరుల పాత్ర గూర్చి చర్చించుకొందాము! ఎన్నికలలో విలేఖరుల ప్రాధాన్యత, సమయస్ఫూర్తి, నైపుణ్యమును- బట్టి మంచి రస పుష్టిగల వార్తలు వెలువడతాయి. ఎన్నికలనేవి ఉత్కంఠ భరితముగా ఉంటాయి. కనుక పాఠకులు ఎన్నికల వార్తల పట్ల బాగా ఆకర్షితులై చదువు తుంటారు. ఈ సమయాలలో పత్రికల సర్క్యులేషన్ కూడా బాగా పెరుగుతుంది.

ఎన్నికల తరుణములో విలేఖరులంతా.... రెట్టించిన ఉత్సాహముతో పని చేయాలి! పత్రికలకు డెడ్‌లైన్ ఉన్నది కాని; వార్తా సేకరణకు డెడ్‌లైన్ లేదు! ఉండకూడదు!! తొలుత పార్లమెంట్

లేదా అసెంబ్లీ ఎన్నికల గూర్చి తెలుసుకుందాము! ఎన్నికల ప్రకటన తేదీ వెలువడ్డాక.... అవి పద్ధతి ప్రకారము ఐదేళ్ళ తరువాత జరుగుతున్నాయా? మధ్యంతరముగా జరుగుతున్నాయా?? తెలుసు కొని సందర్భానుసారముగా వార్త వ్రాయాలి! ఐదేళ్ళ పాలించిన ఒక పార్టీ పాలనపై వివిధ వర్గాల వారినుంచి అభిప్రాయ సేకరణను- మండల స్థాయిలోనూ, నియోజకవర్గ స్థాయిలోనూ జరిపి; ప్రజాభిప్రాయమును వార్తగా వ్రాయాలి. ఎంతమంది ఎన్నికల బరిలోకి రానున్నారు? ప్రముఖుల నుండి సేకరించి ... ఊహాగానాలుగా వ్రాయాలి. చివరికి పార్టీ నిర్ణయించిన అభ్యర్థి పేరు- ఆయా పార్టీల వారి నుంచి వెలువడ్డాక... వారిపైన వార్తలు వ్రాయాలి. ఇందులో అభ్యర్థి బయోడేటా, గతములో ఎన్నికయ్యాడా? క్రొత్తవాడా?? ఆ కుటుంబము లోగడ ఎన్నికలలో పోటీ చేసిందా? లేదా?? అన్నది సేకరించి మరీ వ్రాయాలి. లోగడ రెండు సారులు గెలిచినట్లైతే ... అప్పుడు ఎవరిపై- ఏ మేరకు ఆధిక్యతతో విజయము సాధించినది వ్రాయాలి. ప్రజలకు ఏమన్నా సేవలు చేస్తే.... వాటిని విపులీకరిస్తూ వ్రాయాలి.

ఆ తదుపరి అభ్యర్థులఇంటర్వ్యూలు;ఈఎన్నికలలోగెలిస్తే ... ప్రజలకు ఏమి చేయనున్నారో?ఎలాంటి వాగ్దానాలు చేస్తున్నారో.... వాటిని పాఠకులకు అర్థమయ్యే రీతిలో వ్రాయాలి. ఇవి వ్రాస్తూ .. సేకరిస్తూ.... మరో వైపు ఎన్నికల సమయములో.... సర్పంచ్‌లు, కుల నాయకులు- పార్టీ ఫిరాయింపులు జరిపితే.... వాటిని వెంటనే సేకరించి, అవసరమైతే.... ఆ ఫిరాయింపుదారునే నేరుగా కలిసి, ఇంటర్వ్యూ చేసి మరీ వ్రాయాలి. కొన్ని గ్రామాలలో అభ్యర్థులను ప్రచారానికి రానీయకుండా.... గ్రామీణులు "కస్సు-బుస్సు" మంటుంటారు. ఇలాంటివి సేకరించాలి. ఇవి విలేఖరి స్వయముగా వెళ్ళి తెలుసుకోవడము కుదరదు కనుక.... విలేఖరికి నాయకుడి నుండి, కార్యకర్త వఱకు; అలాగే.... పెద్ద అధికారి నుండి నైట్

వాచర్ వఱకు మంచి స్నేహ సంబంధా లుండాలి. లేకుంటే.... ఏ గ్రామములో ఏమి జరిగిందో సకాలములో తెలియదు. ఎవరూ వచ్చి చెప్పరు. పోతే... ఎవరైనా ఏమి చెప్పినా...."గాలి కబురు" అనుకోకుండా.... త్వరితముగా ఆ విషయమై చొరవతీసుకుని నిజ నిర్ధారణ జరిపి; పత్రికలకు పంపాలి. ఎన్నికల సమయములో-ఎట్టి పరిస్థితుల లోనూ "....అట" కబుర్లు "....అనుకున్నారు" లాంటి వ్రాతలు మంచివి కావు. సాధ్యమైనంతవఱకు వాస్తవ వ్రాతలనే విలేఖరి వ్రాయాలి!

ఎన్నికలు దగ్గఱ పడినపుడు ... అభ్యర్థులు వోటర్స్‌ను ఏ విధముగా కలుసుకుంటున్నారు? ఏమి చెబుతున్నారు? వోటర్‌ల స్పందన ఎలా ఉన్నది?.... వంటి వివరాలు సేకరించాలి. మధ్య-మధ్య నియోజక వర్గమందు ఎన్నికల సింహావలోకనము, గత ఎన్నికలలో వాగ్దానాల వంటివి పాతపత్రికలు తిరగవేసిగానీ లేదా నియోజక వర్గములోని రాజకీయ పండితులనుంచి గానీ సేకరించి మరీ వ్రాయాలి.

పార్టీ అభ్యర్థులు టెన్షన్‌తో ఫీల్ ఔతున్నట్లుగా విలేఖరులు లేనిపోని టెన్షన్స్‌తో వార్తలు సేకరించరాదు. నిదానముగా, సమయస్ఫూర్తితో వార్తా సేకరణ చేయాలి! బాధ్యతగా వ్యవహరించాలి !! ఏవైనా రెండు పార్టీల మధ్య గొడవలు, దెబ్బలాటలు జరిగితే.... అక్కడ పరిస్థితికి విలేఖరి పెద్ద జడ్జిగా మాఱిపోయి; ఒకవైపు తీర్పునిచ్చేస్తూ ... వార్త పంపడము ఎంతమాత్రము మంచిదికాదు. జరుగుతున్న దారుణాలు, దుస్సంఘటనలపై విలేఖరికి టెన్షన్ రాకూడదు. అనవసరముగా రెచ్చిపోయి, వార్తలు వ్రాయడము మంచిది కాదు. పేదవర్గాలపై- భూస్వామ్య వర్గాలవారు దాడులు చేసారనుకోండి! విలేఖరి లోతుగా పరిశీలించాలి. వ్యక్తిగతముగా ఎంతైనా బాధపడవచ్చు. సానుభూతి చూపవచ్చు. కానీ వార్తలో తన వ్యక్తిగత అభిప్రాయము కనిపించకూడదు. జరిగిన కథనాన్ని కళ్ళకు కట్టినట్లుగా వార్తా రూపములోనికి తీసికొని రావాలి.

ఎన్నికలలో- కొంతమంది పార్టీలోనే ఉంటూ ... పార్టీ అపజయానికి దొడ్డిదోవలలో పనిచేస్తుంటారు. అట్టి వారిని విలేఖరి గూఢచారిలా కనిపెట్టేసి; వారు చేసిన నిర్వాకాన్ని వార్తగా వ్రాయడానికి ప్రయత్నించకూడదు. ఇలాంటివి ఆ పార్టీ నాయకులే చూసుకుంటారు. వారికంటే ముందు విలేఖరి తొందరపడితే .. ఆ పార్టీ వారు విలేఖరి మీద దాడి చేయడమో లేదా నిలదీయడమో చేస్తారు. విలేఖరి భవిష్యత్‌కి ఇవన్నీ ఆటంకాలౌతాయి.

"ఎన్నిక"లంటేనే.... టెన్షన్! ఇటు- ఓటర్స్‌కి, అటు- నాయకులకి, అటు-ఇటు పత్రికలకు ఈ టెన్షన్ ఉంటుంది. ఈ పరిస్థితులలో విలేఖరి సున్నితముగా బహు జాగ్రత్తగా వ్యవహరిస్తూపోవాలి. తప్పితే.... దుందుడుకుగా దూసుకు వెళితే ... అటు- పత్రిక యాజమాన్యము దృష్టిలో,ఇటు- నాయకుల దృష్టిలో, చదివే- పాఠకుల దృష్టిలో.... విలేఖరి చులకనౌతాడు.

ఎన్నికల బరిలో ఉన్న అభ్యర్థులు తమ పార్టీలోని తిరుగుబాటు చేస్తున్న వారిని గూర్చి విలేఖరుల సమావేశములో చెప్పినపుడు.... వెంటనే- ఆ తిరుగుబాటు దారులను విలేఖరి కలుసుకొని, వివరాలు అడిగి; ఆ మొత్తము వార్తగా వ్రాస్తే ... ఆ వార్త పాఠకుల ముందు మంచి రసపుష్టికలదై నిలుస్తుంది. కొంతమంది కుల బలము తోనో, వ్యక్తిగత ప్రతిభతోనో.... వేలాది వోటర్స్‌ను ప్రభావితము చేయగలిగి ఉంటారు. ఇటువంటి నాయకులు ఒక పార్టీలో ఉన్నప్పటికీ.... వ్యక్తిగత కారణాలతోనో, పార్టీ నిలబెట్టిన అభ్యర్థిపై మంచి అభిప్రాయము లేకనో.... మౌనముగా ఉంటారు. అటువంటి నాయకులతో ఇంటర్వ్యూలు సాధించి, వార్తగా ఇస్తే.... పాఠకులు ఉత్కంఠగా చదువుతారు. సాధ్యమైనంత వరకు ఈ తరహా నాయకులు పోలింగ్ తేది వరకు పెదవి విప్పరు. విప్పినా "కర్ర విరగదు- పాము చావదు" అన్నట్లుగా ఉంటుంది వీరి సంగతి. ఇలా ఉంటుండగా.... బరిలో ఉన్న అభ్యర్థి మౌనముగా ఉన్న

ఆ నాయకుని పేరిట తానే కరపత్రాలు వేసి ప్రజలలోకి వదులు తుంటాడు. ఈ పరిస్థితిలో విలేఖరి చురుకుగా పని చేయవచ్చు. ఆ కరపత్రాన్ని మౌనధారియైన నాయకునికి చూపించి- "ఇది మీరే వేసారా?" అని అడిగితే చాలు! "తీగలాగితే ... డొంకంతా కదలి నట్లు" అంత వరకు గోడమీద పిల్లిలా మాట్లాడి తప్పించుకున్న నాయకుడు గళము విప్పి మొత్తము వివరించవచ్చు. విలేఖరి చక్కగా వార్తను వ్రాసుకోవచ్చు. ఇది పెద్ద సంచలన వార్త ఔతుంది.

ఎన్నికల ప్రచారభేరి ముగిసే దశలో.... ప్రధాన పార్టీ గత ఎన్నికల బలాబలాలు, ఇప్పుడున్న పరిస్థితి, ప్రజలలో పార్టీలపై- అభిప్రాయాలు, అభ్యర్థుల ప్రచార సరళి, బూత్‌ల వివరాల వంటి వార్తలు ముమ్మరముగావ్రాయాలి. ఎట్టిపరిస్థితులలోకూడా-"ఫలానా అభ్యర్థి గెలుపు ఖాయము! ఫలానా అభ్యర్థి ఓడి తీరుతాడు!!" అని అర్థము-పర్థము లేని జోస్యపు వ్రాతలు వ్రాయకూడదు.

ప్రజాస్వామ్య పంథాలో జరిగే ఎన్నికలు కండబలము, బుద్ధి బలముతో గెలిచేవికావు. ప్రజలు తమ వోటు ద్వారా తీర్పుఇవ్వాలి! ఈ నాటి ఎన్నికలు చాలావరకు ప్రజాస్వామ్య పంథాలో జరుగుట లేదు. అది వేరే విషయము! ఇక్కడ ప్రధానముగా అభ్యర్థి స్థాయి, హెూదా,ప్రజాసేవా ధృక్పథమున్న వాడై ఉండాలి. ఒక్కోసారి ఊరు-పేరులేని వారు గెలిచే అవకాశాలుంటాయి. ఉదాహరణకి- ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ నామమాత్రుడైన రాజ్‌నారాయణ్ చేతిలో ఓడిపోవడము దేశ ప్రజలలో నమ్మలేని నిజముగా మిగిలి పోయింది. అలాగే.... తెలుగుదేశం తొలిసారిగా అసెంబ్లీ ఎన్నిక లలో పాల్గొని- అతిరథ-మహారథుల వంటి కాంగ్రెస్ నాయకులపై ఊరు-పేరులేని కొందరు అనామకులను నిలబెట్టి; పెద్ద మెజారిటీతో గెలిపించుకున్నది. కాబట్టి విలేఖరులు జోస్యపు వార్తలు వ్రాయ కూడదు. గెలుపు-ఓటమి నిర్ణయించేది ప్రజలు! ఈ విషయము విలే ఖరి మరువరాదు.

ర్టీల ఏజంట్స్ నుండి కౌంటింగ్ వివరాలు సేకరించి, అవి సరైనవే నని ధృవీకరించుకుని వ్రాయాలి. (బూత్‌లవారీ వోట్స్ వివరాలు కొన్ని పత్రికలు ప్రచురిస్తున్నాయి.)

పై విధముగానే ... మునిసిపాలిటి, పంచాయతీ, పెద్ద ఫ్యాక్టరీ యూనియన్స్. R.T C. కార్మికుల ఎన్నికలలో కూడా విలేఖరులు వార్తలు పంపాలి. తమవంతు వార్తలు ఎవరినీ నొప్పించక.... జాగ్రత్తగా సేకరించాలి. ఈ తరహా ఎన్నికలు- అసెంబ్లి, లోక్‌సభ ఎన్నికలవలే ఉండక పోవచ్చును. కొంత ముఖచిత్రము మారుతుంటుంది. ఐతే.... మొత్తము ఎన్నికల సరళి ఒక్కటే! విలేఖరి సేకరించే విధానము ఒక్కటే!!

ఎన్నికలలో విలేఖరులు సున్నితముగా, చక్కగా, ఎవరూ వేలెత్తి చూపని విధముగా వార్తలు సేకరించాలి. ఎన్నికల సమయములో పత్రికలకు, జర్నలిస్ట్‌లకు చేతినిండా పనీ ఉంటుంది. మంచి గుర్తింపూ లభిస్తుంది. టెన్షన్ పొందకూడదు. ముఖ్యముగా ఏదో ఒక పార్టీ కొమ్ముకాయకూడదు. చురుకుగా వార్తలను రాబట్టాలి. ఉద్రిక్తత కలిగించే వార్తల జోలికి పోకూడదు. వార్తలువ్రాస్తే.... చదివే పాఠకుడు ఉత్కంఠగా చదువుకోవాలి తప్పితే.... ఆ వార్త చదివి ఉద్రిక్తత పొందకూడదు.

## విలేఖరి లక్షణాలు

గ్రామీణ ప్రాంతాలలో పనిచేసే విలేఖరులకు, పట్టణ ప్రాంతాలలో పని చేసే విలేఖరులకు విధి నిర్వహణ ఒక్కటే ఐనా.... గ్రామీణ ప్రాంతపు విలేఖరులకు శ్రమ కొంచెము ఎక్కువ వుండవచ్చు. వీరు మండల ప్రధాన కేంద్రములోగల ఆఫీస్‌లు- తరువాత మండలానికి చెందిన గ్రామాలలో పర్యటించి; గ్రామ విశేషాలపై వార్తలు తయారు చేయాలి. ఇదే పట్టణ ప్రాంతపు విలేఖరికి- అనేక ఆఫీస్‌లు; అత్యధిక జనాభా ఉండుట వలన ఏదో ఒక సమస్యో, గొడవో, సభో, ధర్నో, V I.P.ల రాకో.... ఒకటేమిటి.... ఇలా

చాలా చాలా వార్తలు వెదుక్కోనవసరము లేకుండా లభిస్తాయి. విలేఖరిగా పనిచేయడము కత్తిమీద సాములాంటిది. ఈ సాము చెయ్యాలంటే.... విలేఖరికి కావలసినది ఏమిటో ఇక్కడ వివరిస్తాను.

ఏదో ఒక పత్రికలో విలేఖరిగా చేరిన తరువాత వార్తా సేకరణకు- కాగితము-కలము పట్టుకుని బయలు దేరడముతోనే ... విధి నిర్వహణ ఆరంభమౌతుంది. "జర్నలిజ్మ్" అనే బురఖా కప్పబడుతుంది. ఈ "జర్నలిజ్మ్" అనేది.... విశ్వమానవ కల్యాణము, సత్యాన్వేషణ, సంఘీభావము, ఐక్యత, సామాజిక బాధ్యత, పత్రిక గౌరవములతో ముడిపడి ఉంటుంది. ఇది ప్రతి విలేఖరీ గ్రహించాలి. విలేఖరికి చక్కని భాష, తెలివైన సంభాషణ, వాక్చాతుర్యము, స్ఫూర్తి, ఎదుటి వారిని గౌరవించే స్వభావముల వంటివి ఉన్నపుడు బాగా రాణిస్తాడు. "సమాజాన్ని తానే ఉద్ధరిస్తున్నట్లు"గా ఎదుటి వారిని చిన్నచూపు చూడకూడదు. కనిపించే ప్రతి 'గోరంత దుస్సంఘటన'ను- కొండంతగా చేయడము విలేఖరికి ఉండకూడదు. ఇవి విలేఖరిగా పేరొంది, ఎదుగుటకు పనికిరావు.

గ్రామాలలోని విలేఖరులకు మంచి గౌరవము ఉంటుంది. చాలామంది "విలేఖరికి- తమ కష్టాలు చెప్పుకుంటే.... పరిష్కారము లభిస్తుంది" అని నమ్ముతారు. ఇలా భావించే వారి శాతమే గ్రామ సీమలలో ఎక్కువ! ఇంకొందఱు విలేఖరిని- సినీహీరోని చూసినట్లు చూస్తారు. ఎవరు ఎలాచూసినా....విలేఖరిఆగౌరవాన్ని నిలుపుకోవాలి. గ్రామీణులతో విలేఖరులు మంచిస్నేహ సంబంధాలు పెంచుకోవాలి. ధుమ ధుమ లాడుతూ.... వృత్తి కొనసాగిస్తే.... గ్రామాలలో జరిగే మంచి-చెడులు ఏ మాత్రము చెవులకు సోకకుండాపోయే అవకాశము ఉంటుంది. కలిసిపోయే మనస్తత్వము ఉండాలేగాని; గ్రామీణ విలేఖరులు చాలా వార్తలు హాయిగా, తేలికగా వ్రాసుకోవచ్చు. ఇందుకు చక్కని ఉదాహరణగా ఒక వార్తాకథనాన్ని పరిశీలించండి!

వంశధారనదీ తీర గ్రామము ఒకటి నేటికీ 'ద్వీపకల్పము'గా ఉన్నది. నదిలో ఏ కొద్ది నీరు ఎక్కువ చేరినా.... ఆ గ్రామము

ముంపుకు గుఱయ్యేది. మొత్తము గ్రామములో సగలపై ఇళ్ళున్నాయి. చీటికి-మాటికి నదీ ప్రవాహము పెరిగి, ఆ ఇబ్బందుల దృష్ట్యా ఇరవై కుటుంబాలవారు ఆ గ్రామము వదలి వెళ్ళిపోయారు. ప్రభుత్వాధి కారులు మిగిలిన వారిని ఖాళీ చేయమన్నా...."మాకు ఇళ్ళు నిర్మించు కోడానికి అవసరమైన నిధులివ్వండి! ఖాళీచేస్తాము"న్నారు "ఈ విష యమై ప్రభుత్వమునకు వ్రాసాము"ని అధికార్లు చెప్పారు. ఈ నేపథ్య ములో ఆ గ్రామము ఎప్పుడూ ముంపుకు గుఱికావడము పరిపాటి ఐనది. దీనికోసము వెళ్ళిన విలేఖరికి మరొక విశేషము కూడా తెలీ సింది. పులిమీద పుట్రలా ఆ గ్రామానికి ఎలుగుబంట్ల బెడద కూడా ఉన్నది. సాయంత్ర మయ్యేసరికి... అతిపెద్ద పరిమాణము గల ఒక ఎలుగుబంటి ఆఊరిలోకి వచ్చి .. ప్రజలను భయ-భ్రాంతులను చేసేది. దీన్ని ఎలా వదిలించుకోవాలో అర్థముకాని ఆ గ్రామీణులు అధికారులకు చెప్పిచూసారు. లాభములేకపోయింది. విద్యుత్ లైన్స్‌కి కొన్ని వైర్‌లను కనెక్ట్ చేసి... ఎలుగుబంటి వచ్చే మార్గ ములో వేసారు. వారి ఊహ ప్రకారము ఎలుగుబంటి ఆ విద్యుత్ తీగలకు తగులుకొని మరణించింది. ఆ ఎలుగుబంటి శవమును దూరముగా ఉన్న కొండలలోనికి మోసుకుపోయి చర్మము తీసి ఎక్కువ ధరకు అమ్ముకున్నారు. ఇలాంటి కథనాలు విలేఖరికి ఎవరూ బొట్టుపెట్టి చెప్పరు. గ్రామీణులతో మంచి స్నేహ-సంబంధాలున్న ట్లైతే.... వారే చెబుతారు. ఐతే ఈ కథనాలు వార్తలుగా వస్తే.... ఒక ప్రమాదము ఉన్నది. అటవీ శాఖవారు వచ్చి వాలతారు. కేస్‌లు, అరెస్ట్‌ల వంటివి ఉంటాయి.

ఇటువంటి వార్తలు విలేఖరి వ్రాసేటపుడు... కఱ్ఱ విఱగ కుండా.... పాము చావకుండా వ్రాయగలగాలి. విద్యుత్ స్తంభము నుండి విద్యుత్ తీయడమనేది చట్టరీత్యా చౌర్యము క్రిందకి వస్తుంది. ఎలుగుబంటి చర్మము అమ్ముకోవడము మరోనేరము! కనుక ఇలాంటి వార్తలను గ్రామీణులు అమాయకముగా చెప్పినపుడు వారిపై ప్రమా

దము వచ్చిపడేట్లు వ్రాయకూడదు. అలా అని నేరమును కప్పిపుచ్చ కూడదు. పైగా... వార్తను యథాతథముగా.... తను చూసినట్లుగా వ్రాసుకుంటూ పోతే.... విలేఖరి సాక్ష్యము చూపే అవకాశము లేదు. విద్యుత్ శాఖ అధికారులు వచ్చిచూస్తే .. అక్రమముగా విద్యుత్ చౌర్యము చేసినట్లు అక్కడేమీ రుజువుండదు. అలాగే ... ఎలుగుబంటి భౌమికాలు తప్ప ఏమీలభించవు. గ్రద్దలు, రాబందులు మాంసము తినేసినట్లు జాడలు తెలుస్తాయి. కనుక విలేఖరి ఈ తరహా వార్తల పట్ల అప్రమత్తముగా ఉండాలి. విన్నది విన్నట్టు వ్రాస్తూ పోతే... గ్రామీణుల కన్నెర్రకు గురికాక తప్పదు. ఈ వార్త గ్రామము పేరు లేకుండా వ్రాయబడింది. పైన ఉదాహరించిన అమాయక గ్రామీణులవలేగాక.... అదే వృత్తిగా.... వ్యాపారముగా పెట్టుకొని- నిత్యమూ వన్య ప్రాణులను అక్రమముగా, అన్యాయముగా చంపుతున్న వారిపై- బలమైన సాక్ష్యాలు చూపుతూ ... విలేఖరి వార్త వ్రాయవచ్చు! వ్రాయాలి కూడా!! వన్య సంపదలను, ప్రాణులను హరించేవారిపై విలేఖరి కలము బలముగా పనిచేయాలి. ఇందుకు ఉదాహరణగా ఒక వార్తా కథనము చూడండి!

ఒక మండల కేంద్రానికి చాలా దగ్గరలో దట్టమైన చిట్టడివి లాంటి అడవి ఒకటున్నది. అక్కడ దుప్పులు, అడవి పందులు, ముళ్ళపందులు, కుందేళ్ళు చాలా ఉన్నాయి. అటవీ శాఖకు చెందిన గార్డ్‌లతో చేతులు కలిపి ఆ ప్రాంతపు వేటగాళ్ళు అక్రమముగా నిత్యము వేటసాగిస్తున్నారు. ఈ నేపథ్యములో ఒక అడవి పందిని నాటు తుపాకులతో కాల్చారు. అది బాగా దెబ్బతిని పడుతూ.... లేస్తూ.... పరుగులు తీసింది. దాని వెంటపడ్డారు వేటగాళ్ళు! అది కనిపించకుండా పోయింది. అది ఎక్కడున్నది ఒక కలప డీలర్ కంటపడింది. దాన్ని వెంటాడుతూ వచ్చిన వారికి మరో దిశ చూపించి, సాగనంపాడు. అడవి పంది చొరబడ్డ పొదలలోకి అతడు దూరాడు. అదికళ్ళు మూసుకొని పడి ఉన్నది. అది "చని పోయిం

ద"ని భావించిన కలప డీలర్ దాని కాళ్ళు పట్టుకొని ఇవతలికి ఈడ్చాడు. బాధతో-కక్షతో వున్న ఆ పంది చటుక్కున లేచి, ఆ డీలర్ తొడను నోటితో కసుక్కున పట్టేసింది. ఈ హఠాత్ సంఘటనతో భయ-భ్రాంతుడైన డీలర్ విపరీతమైన బాధతో....ఆ మరుక్షణమే దిక్కులు పిక్కటిల్లేలా అఱచాడు. తొడ ఛిద్రమైపోయింది. ఆ పంది మహా కోపముతో రెచ్చిపోయి... అతని తొడను చీల్చి వేయసాగింది. డీలర్ పెడ బొబ్బలకు- వెను దిరిగివచ్చారు వేటగాళ్ళు! ఆ తరువాత అడవి పందిని చంపి డీలర్‌ను ప్రభుత్వాసుపత్రిలో చేర్చారు. దీనిపై విలేఖరి మొత్తము వివరిస్తూ.... వార్త వ్రాసాడు. బలమైన సాక్ష్యాలతో నిరూపించుకోవడానికి మంచి అవకాశము లభించింది. మరోవైపు వన్య ప్రాణులను రక్షించడానికి ఆ విలేఖరివార్తఎంతోఉపయోగపడింది.ఇలాంటివే... ఎన్నెన్నో.... వ్రాయడానికి గ్రామీణులతో మంచి స్నేహ-సంబంధాలు తప్పకుండా ఉండాలి. గ్రామ సీమలలో- ఇలాంటి కథనాలతో బాటు... అతి చిన్న కథనాలపై కూడా వార్తలు వ్రాయడానికి అవకాశాలు దండిగా ఉంటాయి. వ్రాయాలన్న స్ఫూర్తి ఉండాలే గాని- వార్తల కఱవు ఉండదు. ఏ విలేఖరికైనా కావలసినది ముఖ్యముగా సహనము-ఓర్పు! కొన్ని సమయాలలో నీరసపడిపోయి, కొన్ని సందర్భాలలోరెచ్చిపోవడములాంటివి విలేఖరికిఉండకూడదు. ఓపికగా వార్తా సేకరణ చేయాలి. అనవసరపు విషయాలలోనికి దిగ కూడదు. ఎప్పుడూ వార్త వఱకే పరిమితమై ఉండాలి. మంచి లక్షణాలు, వ్యక్తిత్వము ఉన్న విలేఖరులు కచ్చితముగా రాణిస్తారు. భవిష్యత్‌కు బాటలు వేసుకుంటారు.

"విలేఖరంటేనే.... అందరూ భయపడాల"ని భావించకూడదు. "విలేఖరి చెప్పిందే వేదము!వ్రాసిందే వార్త"యని గర్వించరాదు. ఇలా జర్నలిజమ్‌లో మనుగడ సాగించే వారికి భంగపాటు కలుగక తప్పదు. వీరు విలేఖరిగా రాణించలేరు. విలేఖరితో బాటు ఆ పత్రిక కూడా చులకన ఔతుంది.

అధికారులని, నాయకులని; చిన్న వారని, పెద్ద వారని తార తమ్యము లేకుండా- అందరితో గౌరవముగా కలిసిపోయేటట్లు ప్రవర్తించ గలిగితే... ఆ విలేఖరి రాణిస్తాడు. మంచి వార్తలు అందించ గలుగుతాడు.

## OFF THE PRESS [ప్రకటించరానివి]

"ఆఫ్ ది ప్రెస్" లేక "ఆఫ్ ది రికార్డ్" అని విలేఖరులకు ఎవరైనా- ఏమి చెప్పినా- ఏరహస్యము వెల్లడించినా...."అది పత్రికలలో రాకూడదు" అని అర్థము! ఈ నియమాన్ని కచ్చితముగా పాటించి, పత్రికలలో ఆ విషయాన్ని వార్తగా విలేఖరులు వ్రాయ కూడదు. ఇదో సాంప్రదాయము! ఎవరో ఒక ప్రముఖవ్యక్తి తన అంతరంగములో కొన్ని విషయాలు దాచుకోలేక.... ఏదైనా వార్త అది ఎంత విశేషమైనదైనాసరే...."ఆఫ్ ది ప్రెస్"అని చెప్పినపుడు- ఎట్టి పరిస్థితులలోనూ వారు చెప్పినది వార్తగా వ్రాయ కూడదు. కొంత మంది విలేఖరులు వీటిని కావాలని, పనిగట్టుకొని వార్తగా వ్రాస్తుంటారు. ఇలా చేయడము ఆ విలేఖరి "హత్యకు పాల్పడినంత నేరమ"ని చెప్పక తప్పదు. అసలు "ఆఫ్ ది ప్రెస్" అంటే... "చెప్పింది పత్రికలలో వ్రాయకండి!"అని అభ్యర్థించడ మన్నమాట! అలాంటప్పుడు ఆ విషయాలు పత్రికలలోకి అక్షరరూప వార్తల లోనికి తీసికొని వస్తే... విషయము చెప్పిన ఆ వ్యక్తి ఎంత బాధ పడతాడో ఆలోచించండి! ఇందుకు ఉదాహరణగా కొన్ని విషయాలు తెలిసి కొందాము!

ఒక ప్రముఖ జర్నలిస్ట్ ఒకసారి బెంగుళూర్‌లో అప్పటి ముఖ్య మంత్రి శ్రీ R. గుండూరావును కలుసుకొన్నారు. ఆయన ఆ జర్నలిస్ట్‌ని తన ఇంటికి విందుకుపిలిచారు. వెళుతూ-వెళుతూ ఒక చిన్నటేప్ రికార్డర్ సెట్‌ను ఆ జర్నలిస్ట్ జేబులో వేసుకొని మరీ కూర్చున్నారు. అసలే శ్రీ గుండూరావు బోళా మనిషి! హాయిగా, ఎలాంటి జంకు- గొంకు లేకుండా మాట్లాడతారు. మొదటి నుండి ఆయన "మనమధ్య

స్నేహామే కానీ, ఇదంతా పత్రికలలో వ్రాయవలసినది కాద"ని చెబుతూ ఉన్నారు! ఐనా సంచలన వార్తలు వ్రాపే అవిలేఖరి- శ్రీ గుండూరావు సంభాషణ అంతా మరుసటి దినము ఆయన పని చేసే "ఇండియన్ ఎక్స్‌ప్రెస్'లో వ్రాసారు. అదో సంచలన వార్తై కూర్చున్నది. గుండూరావుకు చెప్పిన ఏ పనీ చేయరట అప్పటి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ! పైగా.... "ఆమె ప్రతిచిన్న పనికి తనతో సంప్రదించక తప్పదు" అనీ;"కేంద్రమంత్రులు ఉత్సవవిగ్రహాల"నీ చిత్రించి మాట్లాడారు. ఈవార్తలు కాంగ్రెస్‌లో సంచలనం రేపాయి. శ్రీమతిగాంధీ ఆగ్రహానికి శ్రీ గుండూరావు బలికాక తప్పలేదు. పదవి లోంచి తప్పుకోవలసివచ్చింది. ఇంత జరగడానికి కారణము- "ఆఫ్ ది ప్రెస్" వార్తలను ప్రచురించిన ఆ విలేఖరే! మరో విచిత్రాన్ని ఈ క్రింద పరిశీలించండి!

ఇటీవల కేంద్ర న్యాయశాఖ మంత్రి శ్రీ H.R. భరద్వాజ్ "ఆఫ్ ది రికార్డ్"గా ఒక జర్నలిస్ట్‌కి ఇచ్చిన ఇంటర్వ్యూలో ఆయన వెల్లడించిన కేంద్ర మంత్రులపై అక్కసును- సదరు విలేఖరి తెలివిగా వీడియో రికార్డ్ చేసి, అది ఎవరికి ఇవ్వకూడదో... వారికే అందివ్వడము జరిగింది. ఇందులో.... విలేఖరి అల్పమనస్తత్వము స్పష్టముగా గోచరమౌతున్నది. శ్రీ భరద్వాజ్ దూరదర్శన్‌కు ఇంటర్వ్యూ ఇస్తున్నప్పుడు ఆ విలేఖరి రికార్డ్ చేస్తున్నారు. చివరిగా "ఆఫ్ ది రికార్డ్" అని చెప్పారు కేంద్ర మంత్రి శ్రీ భరద్వాజ్! "O.K. సార్! మీరు హాయిగా మాట్లాడవచ్చు! రికార్డ్ చేయడము లేద"ని చెప్పి, నమ్మించి రికార్డ్ చేయడము జరిగింది. ఆ విలేఖరిని నమ్మిన సదరు భరద్వాజ్ మనస్సులో ఉన్న అక్కసువెళ్ళగ్రక్కారు. ఫలితముగా అనేక నిజాలు రికార్డ్ అయ్యాయి.

ఆ రికార్డ్‌లో నిజాలను దొంగచాటుగా- హర్షద్ మెహతా లాంటి ఘరానా స్టాక్ బ్రోకర్‌కి అమ్ముకునిచేతులు దులుపుకున్నాడు ఆ జర్నలిస్ట్! లోక్‌సభలో ఒక కేంద్రమంత్రి స్వయముగా చెప్పిన

ప్రముఖుల ముడుపుల భాగోతము, తోటి కేంద్ర మంత్రుల అవినీతి ఎంతటి దుమారము రేపిందో.... అందరికీ అర్థమైనది. ఈ విధముగా నిస్సహాయముగా భరద్వాజ ఇఱుక్కొన్నారు. "ఆఫ్ ది రికార్డ్" అని చెప్పాక ఈ తరహాలో వ్యవహరించడము మంచిది కాదు. పెద్దస్థాయిలో ఉన్నవారు "ఆఫ్ ది రికార్డ్" వార్తల కారణముగా తమ పదవులు పోయినా.... ఎలాంటి పగసాధింపు ఆ జర్నలిస్టులపై కనబఱచరు. ముఖ్యమంత్రి పదవి, కేంద్రమంత్రి పదవి పోయినా భరిస్తారు. అదే గ్రామీణ ప్రాంత విలేఖరుల పరిస్థితి ఇందుకు విరుద్ధముగా ఉంటుంది. గ్రామీణ విలేఖరులు M.P., M.L.A., ప్రభుత్వ ఉన్నతాధికారులు చెప్పిన "ఆఫ్ ది రికార్డ్" వార్తను వ్రాసారో.... "90 శాతము ప్రమాదములో పడ్డట్లేన"ని చెప్పకతప్పదు. ఇలాంటివి చాలాచాలా జరుగుతుంటాయి! జరిగాయి!! అవన్నీ మీ ముందుంచడము కుదరదు. కొన్నింటిని యథాతథముగా తెలిసికొందాము.

ఒక మండల సమావేశములో మండలాధ్యక్షుడు ఆగ్రహములో- కలెక్టర్‌ను చెడామడా తిట్టి "నేను తలచుకుంటే.... ఏమైనా చేయగలను! నాకు కలెక్టర్ ఒక లెక్కా?" అని పెద్దగా గాండ్రించాడు. తరువాత శాంతించి అక్కడే కూర్చుని వ్రాసుకొంటున్న విలేఖరులకు "ఆఫ్ ది ప్రెస్" అని చెప్పాడు. చాలామంది గ్రామీణ స్థాయి విలేఖరులకు ఈ "ఆఫ్ ది ప్రెస్" మర్మము తెలియదు. కారణము ఆయా పత్రికల సబ్ఎడిటర్స్, సీనియర్ రిపోర్టర్స్ చెప్పక పోవడమే! మొత్తము మీద ఐదు దిన పత్రికల విలేఖరులలో ఇద్దరు "కలెక్టర్‌నే నిలదీస్తా....!" అనే శీర్షికతో వార్త వ్రాసారు. ఆ వార్త గ్లాను కుదిపింది. మండలాధ్యక్షుని మతిలేని తనానికి ప్రతి ఒక్కరు హ్యంచుకున్నారు. "సంస్కారం లేని వాడన్నా"రు.

మండలాధ్యక్షుడు ఆ ఇద్దరు విలేఖరులపై విఱుచుకుపడి, వారి చొక్కాలు పట్టుకున్నాడు. కలెక్టర్ మాట ఎలా ఉన్నా.... విలేఖరులను నిలదీసి చెడామడా వాయించేసాడు. ఇది పెద్ద రభసగా

రూపాంతరము చెందింది. పోలీస్‌లు- ఫిర్యాదు అందుకొని, మండ లాధ్యక్షుడిని ఠాణాకు పిలిపించారు. ఆ తరువాత రాజీ కుదిరిం దను కోండి! ఇందులో వాస్తవానికి వార్తా పరముగా ఆలోచిస్తే.... "ఆఫ్ ది రికార్డ్" అని చెప్పాడు. ఐనా ఆ ఇద్దరు విలేఖరులు వార్తపట్ల వ్యామోహితులై ....వదలుకోలేక వ్రాసారు. మరి ఇదితప్పుకాదా....?

తెలుగుదేశం పాలనలో తఱచుగా మంత్రులు, ముఖ్యమంత్రి జిల్లా పర్యటనకు వస్తుండేవారు. వారు వస్తే... రెవెన్యూ శాఖకు చెప్పలేని ఇబ్బందులు! అధికారులు కూడా చాకిరి చేయవలసినదే!! ఒక్కొసారి తిండీ-తిప్పలు లేకుండా....రోజంతా కేవలము టీలతోనే గడపవలసి వచ్చేది. ఈ తరుణములో ఒక M.R.O. నిత్యము తన వద్దకు వచ్చే విలేఖరులతో తన బాధలు చెప్పుకున్నారు. "ఎవడో వస్తాడు! వాడి వెనుక తిరగాలి!! రోజంతా తిండిలేక మాడి పోతాము...." అని వాపోయారు. ఆ ప్రక్కనే ఉన్న ఇద్దరు సర్పం చ్‌లు కూడా శ్రుతి కలిపారు. "N.T.R. పాలనలో తిప్పలు తప్ప ఏముంది"? అని అన్నారు. వీటిని విలేఖరులు మామూలు సంభాషణ లుగా తీసికోవాలి. కానీ.... అలా జరగలేదు. "M R.O. కూతలు", "వంత పాడిన సర్పంచ్‌ల వాగుడు" యథాతథముగా వ్రాసారు. మరుసటి దినము వార్తలలో ఈ కూతలు బాక్స్ ఐటమ్స్‌లో దర్శన మిచ్చాయి. ఇంకేముంది? ముందురోజు ఒక్కపూట తిండికి మాడి పోయినM.R.O. ఈరోజంతా తిండిముఖముఎఱగడు! గొంతు తడారి పోయింది. ఎడతెరిపి లేకుండా చెమటలు పట్టాయి. పై అధికారుల నుండి ఫోన్‌లు, చీవాట్లు నిర్విరామముగా వచ్చి బిక్క ముఖము వేసాడు. తరువాత మారుమూల మండలానికి బదిలీమీద వెళ్ళి పోయాడు. అతడు ప్రభుత్వోద్యోగి కాబట్టి వెళ్ళిపోయాడు. మిగిలిన ఇద్దరు సర్పంచ్‌లుమాత్రము విలేఖరులనువెదకివెదకి పట్టుకున్నారు. నిలదీసారు. చొక్కాలు చింపారు. పెన్‌లు విఱిచారు. రక్తము కారకుండా దెబ్బలు కొట్టి.... తమ అక్కసు తీర్చుకున్నారు. 'ఆఫ్ ది

రికార్డ్' వార్తలు వ్రాసి అనవసరముగా ఇలా లేనిపోని గొడవలు సృష్టించుకున్నారు విలేఖరులు! ఈ వార్తల వలన ప్రజలకు పెద్దగా ఉపయోగము లేదనే చెప్పాలి.

"అఫ్ ది ప్రెస్-అఫ్ ది రికార్డ్" వార్తలు వ్రాసే గ్రామీణ విలేఖరులు పై విధముగా దాడులకు గురైన వైనాలు అనేకము ఉన్నాయి. కనుక "వద్దు మొర్రో" అని బ్రతిమలాడే అవతలి వ్యక్తి చెప్పిన రహస్యాలు ఎంతమాత్రము వార్తలుగా వ్రాయాలనుకోవద్దు! అది ప్రమాదము!! కొందరు "అఫ్ ది రికార్డ్"అని చెప్పరు. వాగుడు కాయల్లా వాగుతుంటారు. "పిడుక్కి బియ్యానికి ఒకే మంత్రము"లా విలేఖరులను చూసే సరికి ఎవరిని తిట్టాలన్నా వెనుకాడరు.

ఒక M.L.A. అగస్ట్ 15వ తేదీన మండల కేంద్రములో జెండా ఎగురవేస్తూ- ఏవో విషయాలు చర్చిస్తూ.... ఆవేశముతో ఊగి పోతూ.... "అవసర మొస్తే నా ఈ నియోజక వర్గము కోసము ప్రాణాలర్పిస్తాను! ముఖ్యమంత్రినైనా.... చొక్కా పట్టుకుని నిల దీస్తాను!!" అని పెడబొబ్బలు పెట్టాడు. ఈ పెడబొబ్బలను వార్తగా వ్రాయొచ్చు! M.L.A. "అఫ్ ది రికార్డ్" అని చెప్పలేదు. చెప్పక పోయినా.... గ్రామీణ విలేఖరులు ఆలోచించాలి. "వార్తవ్రాయాలా? వద్దా??" అని నిర్ణయించుకోవాలి. ఆ M.L.A. తరువాత "అలా అనలేదు" అనిదబాయించవచ్చు. మీదపడవచ్చు. వారి వాగుడుకు గ్రామీణ విలేఖరులు జవాబుదారులు కాకపోయినా.... ఇలాంటి వార్తలు వ్రాయడము క్షేమముకాదు. మరో విచిత్ర కథనము పరిశీలించండి!

దుందుడుకు స్వభావముగల ఒక M.L.A. రాత్రి పూట ఓ ధనిక వర్తకుని ఇంట్లో విలేఖరుల సమావేశము ఏర్పాటు చేసాడు. నాలుగైదు పత్రికల విలేఖరులు కాళ్ళీడ్చుకుంటూ వచ్చి కూర్చున్నారు. చుట్టూ కార్యకర్తలు, వర్తక ప్రముఖులు దండుగా వచ్చి నిశ్శబ్దముగా తిలకిస్తున్నారు. ఈ నేపథ్యములో సదరు M.L.A.

గొంతు విప్పారు. "ఏమయ్యా!? ఎవరైనా ఏమైనా చెబితే ... మీరు యథాతథముగా వ్రాయరా? కల్పిస్తారా?? ఈ పరిస్థితి ఇక కొన సాగితే బావుండదు. మొన్న పొరుగు మండలములో ఒక విలేఖరి నేనొకటి చెప్తే.... వాడొకటి వ్రాసాడు! వాడి సంగతి తర్వాత చూస్తాను. మీరు మాత్రము ఒక్క అక్షరము మార్చినా బావుండదు!" అని కఠినముగా చెప్పాడు.

అందులో ఒక విలేఖరి"మీరు చెప్పింది As it isగా రావాలి అనుకుంటే ... చక్కగా అడ్వర్‌టైజ్‌మెంట్ ఇచ్చుకుంటే తప్ప ... వార్తలలో అలా రాదుసార్! మేము (కంట్రిబ్యూటర్స్, స్ట్రింగర్స్) వ్రాసింది అక్కడి (పత్రికా కార్యాలయములోని డెస్క్ ఇన్‌చార్జ్‌లు, వారుకొద్దిగామార్పులుచేసివ్రాస్తారు. పైగా....మేమువ్రాసిందిఅర్థము, భావము, కథనము చెడకుండా రీరైట్ చేయబడతాయి" అని వివరించాడు. దానితో సదరు M.L.A. చిత్తైత్తి పోతూ.... "ఎవరా మార్చింది? వారిలెక్కలు తేలుస్తాను!మీకు మర్యాదగా చెప్తున్నాను. ఇదిగో టేప్‌రికార్డర్. ఇది ఆన్‌చేసి విలేఖరుల సమావేశము నిర్వహిస్తాను. రేపు పత్రికలలో ఒక్క అక్షరము మారినా బావుండదు" అని మరోమారు గర్జించి టేప్‌రికార్డర్ ఆన్‌చేసి గళము విప్పాడు.

అప్పటి రాజీవ్ ప్రభుత్వము మీద కారాలు-మిరియాలు నూరాడు. "తెలుగుదేశం కేంద్రంలో పాగా వేస్తుంద"న్నాడు. N.T.R. అంటే.... భారత ప్రజలలో మంచిగుర్తింపు ఉందన్నాడు. ఇలా చెబుతూ.... సడన్‌గా రాజీవ్‌మీద వ్యక్తిగత విమర్శలు ప్రారంభిస్తూ "విలేఖరులు ఇది వ్రాయకండి! నేను చెపుతున్నది అద్భుతమైన విషయము 'ఆఫ్ ది ప్రెస్' O.K." అని.... "రాజీవ్ భారతీయుడుకాడు- విదేశీయుడు! అతడి పుట్టుక...." అంటూ ఏమేమో వాగాడు. విలేఖరులనైతే.... ఆగమన్నాడు. వ్రాయొద్దన్నాడు. టేప్ రికార్డర్ మాత్రము ఆన్ చేసుకుని తననోటి దురుసుతనాన్ని రికార్డ్ చేసుకుంటున్నాడు. 'భస్మాసురిని హస్తము'లా సాగినదా కార్య

క్రమము! ఆ M.L.A.కి చుట్టూ కార్యకర్తలుంటే.... ఒళ్ళు మఱచి పోయి, ఏమివాగుతాడో....ఎవరినితిడతాడో... అతనికే తెలియదు. ఈ మొత్తము తతంగమంతా మరుసటి దినము ఒక ప్రముఖ దిన పత్రిక లోని మినీడైలీలో ఫ్రంట్ పేజీ వార్తై కూర్చున్నది. "టాప్ లేపిన M.L.A. టాప్ జాగ్రత్త" శీర్షికతో వెలువడ్డ ఈ వార్త సంచలనము సృష్టించింది. జిల్లాను కుదిపేసింది.

ఈ వార్తతో ఆ M.L.A. విలేఖరిపై లోలోపల కక్ష పెంచుకున్నాడు. ఒకసారి ఆ విలేఖరి పనిచేస్తున్న పత్రిక M.D.ని కలుసుకుని లేనిపోని అబద్ధాలు చెప్పి నమ్మించ గలిగాడు. దీనిపై సదరు M.D. విలేఖరిని తన చాంబర్‌కు రప్పించుకొని ప్రశ్నించారు. "నేను వ్రాసిన వార్తలలో అత్యధిక శాతము వాస్తవమైనవే! ఎవరికి వ్యతిరేకముగా గానీ, అనుకూలముగా గానీ వ్రాయలేదు!! కావాలంటే ... మీ కిష్టమైన ఒక నెలలోని మినీ డైలీలు పరిశీలిస్తే.... నిజము తెలుస్తుంది" అని చెప్పుకొన్నా.... ఆ విలేఖరి తొలగింపు జరిగింది.

"వార్తలు వ్రాసేటపుడు విలేఖరి నీతి-నిజాయతీ కనబఱచాలి" అన్నది శతశాతము నిజమే! కానీ.... ఈ నీతి-నిజాయతీ కనబఱచి "టాప్ లేపిన M.L.A. టాప్ జాగ్రత్త" వార్తవ్రాస్తే.... ఏమైనది? ఒక్కసారి ఆలోచించండి!

## అనంతర వార్తలు

పత్రికా పాఠకులను మంచిఉత్సాహముగా చదివించేవి అనంతర వార్తలు! ఈ అనంతర వార్తలు ఎలాంటివన్నది... ఇపుడు చర్చించుకొందాము. ఒక బస్ ప్రమాదము జరిగిందనుకోండి! ఆ ప్రమాదములో మృతులెందరు? వారిలో డ్రైవర్, కండక్టర్ ఉన్నారా?? ప్రమాద కారణము??? వగైరా విషయాలు విలేఖరి సేకరించగలుగుతాడు. ఆ ప్రమాదము ఏ రాత్రో జరిగితే.... కొంత వరకే సమాచారము లభ్యమౌతుంది. పూర్తి వివరాలు లభించవు.

ఈ మేరకే పత్రికలలో 'ఫ్లాష్ న్యూస్'గా వార్త వెలువడుతుంది. ఇలా "ప్రమాదవార్త, మృతుల సంఖ్యవంటి వివరాలు ఇవ్వగలిగితే చాలులే....!" అని విలేఖరి భావిస్తే కుదరదు. ఆ మరుసటి దినము మృతుల పూర్తి వివరాలు, వారి వెనుక కథనాలు, గాయపడినవారి పరిస్థితి, వారికి లభిస్తున్న వైద్య సేవలు, నాయకుల పరామర్శ, ప్రభుత్వము ప్రకటించిన ఎక్స్‌గ్రేషియా వివరాల వంటివి తప్పక విలేఖరి ఇవ్వగలగాలి. అలాగే ... లోగడ జరిగిన ఆ ప్రాంతపు బస్ ప్రమాదాల గురించి సంక్షిప్తముగా వ్రాస్తూ.... ప్రస్తుత ప్రమాదముతో పోల్చి చూపి, ప్రమాదస్థాయిని వివరించాలి. "అనంతర వార్త"లంటే ... ఇవే! ఆ తరువాతి రోజులలో తీవ్రగాయాలైనవారు ఆసుపత్రి నుండి డిశ్చార్జ్ చేయబడితే ... 'అనంతర వార్త'గా వ్రాయాలి. ఇదే కోవలోకి- రైల్ ప్రమాదాలు, విమాన ప్రమాదాలు, పడవ ప్రమాదాల వంటివీ వస్తాయి. ఇదే విధముగా అనేక కోణాల నుండి వివిధ రకాల వార్తలను కూడా అనంతర వార్తలుగా వ్రాయడానికి వీలుంటుంది.

ఒక మండల సమావేశములో ఒక M.R O. గారు సర్పంచ్‌ల ప్రశ్నకు సమాధానముగా "క్రొత్తగా రేషన్‌కార్డులు ఇవ్వడము కుదరదు. ఐతే....ప్రస్తుతము మండలములో బోగస్‌కార్డులు 2,965 ఉన్నాయి. వీటిని ఆగస్ట్ నెలాఖరులోగా ఏరి వేసి, నిజముగా కార్డులు లేనివారికి ఇస్తాన"ని చెప్పారు. దీనితో సర్పంచ్‌లు శాంతించారు. ఈ వార్త- పత్రికలలో ప్రముఖముగా వెలువడింది. అనేకమంది రాజకీయ పలుకుబడి ఉన్న రేషన్‌డిపో డీలర్స్ M.R.O.ని కలుసుకుని "బోగస్ కార్డుల విషయము మీరే బయట పెడితే ఎలా? అవి మంజూరు చేసింది మీరే కదా??" అని అడిగారు. M.R.O. నాలిక కలుచుకుని, వారివద్ద మరికొంత పుచ్చేసుకుని- "పొరపాటున అనేసాను! కార్డులు ఏరివేయనులెండి!! నిశ్చింతగా బోగస్ కార్డుల రేషన్ మీరు ఆరగించండి"! అని అభయం మిచ్చేసారు. నిజముగా

కార్డులు లేనివారి గోడు మామూలే! సెప్టెంబర్ చివరిలో ఒక దిన పత్రిక విలేఖరి M.R.O.ను ప్రత్యేకముగా కలుసుకుని "అయ్యా! తమరు ఆగస్ట్ చివరికి బోగస్ కార్డులు మొత్తము 2,965 ఏరివేస్తామన్నారు. ఎంతవరకు వచ్చింది?" అని అడిగాడు.

ఆ M.R.O. తడబడుతూ ... "అది.... అది.... సిబ్బంది చాలక.... ఆ పని సాగలేదు. అక్టోబర్ చివరికి ఏరివేస్తా"నన్నారు. ఈ మినీ ఇంటర్వ్యూ కూడా విలేఖరి వెంటనే వార్తగా వ్రాసాడు. అంటే ... 'ఇదొక అనంతర వార్త' అన్నమాట! అక్టోబర్ గడచి పోయింది. మళ్ళీ M.R.O.ను ప్రశ్నించాడు ఆ విలేఖరి! నీళ్ళు నములుతూ...."డిసెంబర్"అనిచెప్పి తప్పించుకున్నాడు. ఈ గడువు కూడా పత్రికలో అక్షరరూపము దాల్చింది. పాఠకులు శ్రద్ధగా ఈ అనంతర సమాచారమును చదువుతూనే ఉన్నారు. M.R.O. తరఫున అవినీతి డీలర్లు- విలేఖరికి డబ్బు ఆశ చూపి "ఈ అనంతర వార్తలకు స్వస్తి పలకమ"న్నారు. అందు కా విలేఖరి "ఈ బోగస్ కార్డుల పని పడతాన"న్నాడు. ఐతే.... ఈలోగా- ఆ విలేఖరి పనిచేసే దిన పత్రిక వేరే కారణాలను చూపి ... అతనిని తొలగించింది. అలా జరిగి ఉండకపోతే ... ఈ అనంతర వార్తలు ఏ విధముగా వెలువడేవో....? నేటికీ బోగస్ కార్డులు అలాగే చెలామణి ఔతున్నాయి. విలేఖరి తొలగింపుతో M.R.O., అతని వెనుకనున్న రేషన్ డిపో డీలర్స్ హాయిగా ఊపిరి పీల్చుకున్నారు.

దీపావళికి ముందు ప్రేలుడు ప్రమాదము జరిగి ఒక ఇంట్లో పదిమంది మరణించారు. ఈ మరణించిన వారిలో ఆ కుటుంబమే కాకుండా ఇతరులు కూడా ఉన్నారు. ఒకే కుటుంబమునకు చెందిన ఐదుగురు, పొరుగున ఉన్నవారి ముగ్గురు పిల్లలు, రోడ్ మీద నడచి పోతూవున్న ఇద్దరూ మరణించారు. ఈ వార్త జిల్లాకే పరిమితము కాకుండా రాష్ట్రవ్యాప్తముగా సంచలనమైనది. ఒక ప్రముఖ దిన పత్రిక ఈ మరణాలపై 'అనంతర వార్తలు' అందించి.... పాఠకుల

మెప్పును పొందింది. ఆ విధమెట్టిదో.... ఈ క్రింద పొందుపఱచుట జరిగినది.

ఒకే కుటుంబానికి చెందిన భార్యాభర్త, వారి ముగ్గురు అబ్బాయిలు ప్రేలుడు ప్రమాదము వలన నల్లగా మాడిపోయి, పోల్చుకొనవీలు లేకుండా కాలిపోయారు. ఈ ప్రేలిన శబ్దానికి ఒక కిలోమీటర్ వఱకు దద్దఱిల్లి పోయింది. ఇంట్లో ప్రేలుడు సంభవించిన తరువాత ... ఆ ఇంటి కెదురుగా నిలబడున్న వ్యక్తి.... అక్కడి కక్కడే తీవ్రగాయాలతో నేలకొరిగాడు. ఆ ఎదురుగా ఉన్న బస్‌లో కూర్చున్న ఒక ముసలామె అఱచేయి.... కత్తితో నఱికి నట్లుగా తెగి పడిపోయింది. అదేఇంట్లో పిల్లలతో ఆడుకోవడానికి వచ్చిన ముగ్గురు పొరుగింటి పిల్లలు మూడొంతులు కాలిపోయి మరణించారు. ఈ దైన్యము అంతా పత్రికలు ప్రముఖముగా ఫొటోలతో సహా వెలువరించాయి. రెండు-మూడు రోజుల వఱకు పత్రికలలో ఈ వార్తలు వచ్చాయి. ఐతే.... ఒక ప్రముఖ దిన పత్రికా విలేఖరి ఈ ప్రేలుడును గుఱించి, అందులో మృతి చెందిన వారిని గుఱించి రెండు నెలలపాటు ఎప్పటికప్పుడు 'అనంతర వార్తలు' అందిస్తూ.... పాఠకుల కున్న సందేహాలను, కుతూహలమును తీర్చాడు.

ఒకే కుటుంబంలోని వారు చనిపోవడమూ, వారికున్న లక్షలాది ఆస్తులకు వారసులు లేకపోవడమూ; ఆ ఆస్తిని బంధువులే దోచుకున్న దైనాలనూ "కాడు చల్లాఱక ముందే కాసులవేట" పేరిట ఒక వార్త వ్రాసాడు. ఆ ఆస్తిని బంధువులకు పంచేకంటే ...ప్రేలుడు ప్రమాదములోని బాధితులకు ఇవ్వాలని; అది ఎంతైనా అవసరమనీ; ఆ బాధితుల కథనాలు ఎప్పటికప్పుడు వార్తల రూపములో వ్రాస్తూ వచ్చాడు విలేఖరి! ఐతే ... ఈ ప్రేలుడు ప్రమాదములో మృతులు పదిమందైతే.... గాయపడ్డవారి సంఖ్య మరో పదిమంది వఱకు ఉన్నది. ఈ మొత్తము బాధితుల దయనీయమైన కథనాలను ఆ విలేఖరి వార్తలుగా వ్రాసాడు. అందులో కొన్ని ముఖ్యమైనవి....

"నిన్నటి లక్షాధికారి నేడు రోడ్‌న పడ్డాడు" అన్న శీర్షికతో వెలువడిన ఈ వార్తా కథనములోనిసారాంశము....ప్రేలుడు సంభవించినఇంటి ప్రక్కన ఉన్న మరో వ్యాపారి ఇల్లు ధ్వంసమైపోయి, లోపలి కిరాణా వస్తువులు అగ్నికి ఆహుతి అయ్యాయి!"బయలుదేరింది పెళ్ళి ప్రయాణానికి-చేరింది యమ పురికి" ఈ శీర్షికలో వెలువడ్డ వార్తా సారాంశము.... పెళ్ళి సంబంధము కుదర్చడానికి బయలుదేరిన వ్యక్తి బస్ ఎక్కబోతుండగా ఎదురింట్లో ప్రేలుడు సంభవించి అక్కడి కక్కడే తీవ్రగాయాలతో మృతిచెందాడు!! "వారసులు లేని మృతుల ఇంట్లో లక్షలు మూల్గుతున్నాయి" అనేహెడుగైన శీర్షికన వెలువడ్డ వార్తలో బాధితుల కుటుంబాలకు ఈఆస్తులలో కొంతైనా ఇవ్వాలని సూచించే కథనము ఉన్నది. ప్రమాదానంతరము కొన్నాళ్ళ వఱకు అనంతర వార్తలు అనేక కోణాలనుండి వెలువడుతూనే ఉన్నాయి. బాధితుల కుటుంబాలకు మృతుల ఆస్తులలో కొంత ఇవ్వబడడము మీద వార్తలు వెలువడుతూనే ఉన్నాయి. సంవత్సరము దాటాక.... మరో సారి ఆ వార్తను సమీక్షిస్తూ ఒక వార్త వెలువడింది. ఇలా అనంతర వార్తలు వచ్చాయి.

అనంతర వార్తలు వ్రాయాలంటే.... విలేఖరికి కావలసినది స్ఫూర్తి, నైపుణ్యము, జ్ఞాపకశక్తి! ఈ వార్తలు వ్రాసే విలేఖరి-విషయ సేకరణలో అప్రమత్తముగా ఉండాలి. ఏ క్రీడలమంత్రో... ఏ ప్రారంభోత్సవ నిమిత్తమో.... ఒక గ్రామానికో, పట్టణానికో వస్తే.... అతనిని కలుసుకున్నప్పుడు- "ఇక్కడ క్రీడాకారులు ఎక్కువగా ఉన్నందున- మినీ స్టేడియమ్ మంజూరు చేస్తున్నాను!" అని విలేఖరుల సమావేశములో చెప్పాడనుకోండి! అది ఎలాగూ వార్తగా వ్రాస్తాము. ఐతే.... అంతటితో వదలకూడదు. ఆ వార్తను గుర్తుంచుకోవాలి. మళ్ళీ మరోమాఱు అదేమంత్రి ఏ ఏడాదికోవస్తే.... కచ్చితముగా గతాన్ని గుర్తుచేసి; "మినీ స్టేడియమ్ మంజూరు విషయము ఏ దశలో ఉంద"ని అడిగి, దాని పైన పాతవార్తను కలుపుతూ....

ఇప్పుడు మంత్రి ఇచ్చిన వివరణతో జోడించి వ్రాయాలి. విలేఖరి ఇలా వ్రాస్తూ ఉంటే ... ఆ ప్రాంత ప్రజల దృష్టిలో ఓ మంచి విలేఖరిగా గుర్తింపు పొందుతాడు.

అలాగే ఏడాది చివరిలో ఆ ప్రాంత పోలీస్ స్టేషన్స్ నందు ఎన్ని నేరాలు నమోదైనది సేకరించాలి. దొంగతనాలు, దోపిడీలు, హత్యలు, హత్యా ప్రయత్నాలు, మానభంగాల వంటివి ఒకవార్తగా వ్రాయాలి. మరో ఏడాది ఈ విధము.గానే సేకరించి వార్త వ్రాసే టపుడు.... నేరాలు- గత ఏడాది, ఈ ఏడాది ఏ మేరకు పెరిగాయి లేదా తగ్గాయి.... ఒకవార్తా కథనముగాఇస్తే.... ఆ ప్రాంత ప్రజలలో నేర వార్తలపై ఒక అవగాహన ఏర్పడుతుంది. ఇదే త్రోవలో F.C.I. గోడౌన్స్‌లో బియ్యము నిల్వలపై ... ఏ ఏడాది కా ఏడాది సేకరించి, గత సేకరణతో జోడించి వార్త వ్రాయాలి. "నిల్వలు పెరిగాయా? తగ్గాయా??" అన్న వన్నీ అనంతర వార్తలే!

ప్రాథమిక వైద్యకేంద్రములో గత ఏడాది కుటుంబనియంత్రణ ఆపరేషన్‌లు ఎన్ని జరిగాయి? ఈ ఏడాది ఎన్ని జరిగాయి? తగ్గినందుకు అధికారుల వైఫల్యము ఉన్నదా??? వైద్య కేంద్రములో డాక్టర్ ఉండడము లేదా? ఎక్కువ సెలవులపై ఉంటున్నాడా?? అనేవి జోడించి, వివరణాత్మక కథనమువ్రాయాలి. విలేఖరి వార్తలు వ్రాసాక.... వాటిని ఎప్పటికప్పుడు ఒకసారి చదువుతుండాలి. అలా చదివితే... అనంతర వార్తలు వ్రాయడానికి అవకాశాలు పెరుగుతాయి.

ఫ్యాక్టరీల సామర్థ్యము పెంపుపై- ప్రభుత్వాధికారులు, రాజకీయ నాయకులు ప్రకటిస్తే...వార్తవ్రాస్తారు. అ సామర్థ్యము పెంపుపై కొన్నాళ్ళు చూసి; విలేఖరి సంబంధిత అధికారులను ప్రశ్నించి, గత వార్తను జోడించి వ్రాస్తే ... అది ఒక మంచి వార్త అవుతుంది. అనంతర వార్తలు వ్రాసే ఆ విలేఖరికి, ప్రచురించే పత్రికకు మంచి గుర్తింపు ఉంటుంది. ప్రభుత్వాధికారులకు; రాజకీయ నాయకులకు వారి కర్తవ్యము వారికి గుర్తుచేసినట్లు అవుతుంది.

## ధ్రువ పడని వార్తలు

ధ్రువ పడని, అవాస్తవ వార్తలను వ్రాయడము విలేఖరికి కూడని పని! పత్రికకు, ఆ విలేఖరికి ఎంతో చెడ్డ పేరు తెచ్చేవి ఈ తరహా వార్తలే!! వార్తలంటే.... వాస్తవికతతో కూడుకున్నవి. ఏవో "అట" కబురులు వ్రాసి, చేతులు దులుపు కుంటాననే విలేఖరి ఆ వృత్తికి అనర్హుడు! సాధారణముగా విలేఖరులు వార్తలు వ్రాసే టపుడు.... "ఈ వ్రాస్తున్న వార్తలో యథార్థ మెంతున్నదో" నని ఒకటికి రెండు సార్లు సరిచూడాలి. అతి సున్నితమైన ప్రచార సాధనమిది! ప్రమాదము కొని తెచ్చేటట్లు ఏది పడితే అది వ్రాసే యడము మంచిది కాదు. ఇక ధ్రువ పడని వార్తలపైన కొన్ని కథ నాలను గూర్చి ముచ్చటించుకుందాము!

ఒక మండల విలేఖరి ఏదో పని మీద పొరుగుమండలము వెళ్ళాడు. అక్కడ పని చూసుకుని వెనుదిరిగి వస్తుండగా ... దారిలో ఎవరో పరిచయమున్న వ్యక్తి చెప్పాడు. "ఇక్కడ ఉన్నా వేంటి? అక్కడ 'రామభద్ర పురము'లో పెద్ద అగ్ని ప్రమాదము జరిగిపోతే....! పదహారు ఇళ్ళు దగ్ధమయ్యాయి, ఎనిమిది పశువులు మరణించాయి, లక్షలాది రూపాయల విలువ గల ఆస్తులు భస్మీపటలమయ్యాయి" అని చెప్పడముతో.... అందులో వాస్తవమెంతున్నదో.... తెలుసు కోకుండా.... ఆ క్షణమే ఆ విలేఖరి వార్త వ్రాసేసి; ఎదురుగా వస్తున్న విశాఖపట్నము బస్‌లో కవర్ ఇచ్చేసాడు.

మరుసటి దినము మెయిన్ పేజీలో ఆ వార్త వచ్చేసింది! ఆ వార్త చూసిన కలెక్టర్, సంబంధిత ఇతర అధికారులు అగ్ని ప్రమా దము జరిగిన గ్రామము వెళ్ళారు. అక్కడ ఏమీ లేదు. అంతా నిక్షే పముగా ఉన్నది. దీనిపైన వెంటనే ఆ పత్రికా కార్యాలయానికి అధి కారులు ఫిర్యాదు చేసారు. "తప్పుడు వార్త ప్రచురించినందుకు మేమెంతో కలత చెందుతున్నాము! ఇలాంటి అవాస్తవ వార్తలు ప్రచురించి, మమ్మల్ని టెన్షన్‌కు గురి చేయవద్ద"ని హెచ్చరించారు.

అప్పటికే తాను తప్పుడు సమాచారము వ్రాసినందుకు ఆ విలేఖరి బాధపడుతుండగా.... ఆ పత్రికా కార్యాలయము నుండి సబ్ ఎడిటర్ వచ్చి, జరిగిన విషయము తెలుసుకుని మండిపడ్డాడు. "ఎవరు ఏమి చెప్పినా.... వ్రాసేయడమేనా? అందులో యథార్థమెంతో.... ఆలోచించకుండా వ్రాస్తే ఇలాంటి సమస్యలే ఎదురౌతాయి!" అని చివాట్లు పెట్టాడు. ఐతే .. ఇక్కడ విలేఖరి తపనను, వార్త పంపుటలో చూపిన వేగాన్ని మెచ్చుకోవాలి. అలా అని ఎవరో చెప్పిన వార్తలు వ్రాయకూడదు. నిజానిజాలు తెలిసికోవాలి. ఒకవేళ అలాంటి వార్తలు ప్రచురించబడినా.... వెంటనే మరుసటి దినానికే కవర్ చేసుకోవాలి! ఏ మాత్రము ఆలస్యము కారాదు. ఈ పోటీ ప్రపంచములో తాను ఒకమంచి వార్తనుఅందించకపోతే.... పత్రిక రెగ్యులర్ పాఠకులు పెదవి విరిచేస్తారు. ఆ ఆదుర్దాలో విన్న వెంటనే వ్రాసాడు. ఈ వేగము, తపన విలేఖరిలో ఉండవచ్చు! ఉండాలి!! తప్పుడు వార్త వ్రాస్తే.... అది బూడిదలో పోసిన పన్నీరౌతుంది. ఇలాంటి వార్తలు నిర్ధారణ జరిగితేనేగాని వ్రాయకూడదు. మరో రాజకీయ కథనమును గూర్చి పరిశీలించండి!

తెలుగుదేశానికి చెందిన ఒక M.L.A. ఆ పార్టీ అధికారముల్ ఉన్నపుడు జిల్లాలో బాగా పట్టు సాధించిన రోజులవి! ఒక పత్రి విలేఖరి ఏ వార్తా వ్రాయడానికి లేనందున సరదాగాసదరు "M.L.A కాంగ్రెస్‌లో చేరిపోయి, రానున్న ఎన్నికలలో ఆ పార్టీ టిక్కెట్ పోటీ చేస్తార"ని ఫ్లాష్ వార్త ఒకటి ఇచ్చాడు. ఆంధ్ర పత్రికలో ఉ వార్త ప్రచురింపబడింది. అప్పటికే సేల్స్‌లో బాగా నీరసప పోయి ఉన్న ఆ పత్రికలోని వార్త ఆ M.L.A.కి తెలియదు. మరో విలేఖరి ఉబుసుపోక.... "పార్టీ మారుతారట"గా అని ఆ M.L.A. అడిగాడు. అతను ఆవేశపడిపోయి "పార్టీని నమ్ముకున్న మారడమా? కలలో కూడా కల్ల!" అని అంకెలు వేస్తూ ... ఆంధ్ర పత్రిక విలేఖరిని పిలిపించి "ఎందుకు వ్రాసావు....? ఆ నీచ-నికృష్ట

వార్త! నాతో పెట్టుకోకు!! ఒకకాలు తెగనరుకుతా....!!! ఏ చేతితో వ్రాసావో ... ఆ చెయ్యుండదు. వెంటనే తాటికాయంత అక్షరాలతో వ్రాయ్! ఈ M.L.A. పార్టీఫిరాయించడు అని!" ఇలాతీవ్రస్థాయిలో హెచ్చరించాడు. వాస్తవానికి ఆ వార్త కేవలము రెండు సెంటీమీటర్లు, సింగిల్ కాలమ్‌లో వెలువడింది. ఈ వార్త వలన ఆ M.L.A. అధిష్ఠాన వర్గముముందు చేతులు జోడించ వలసిన పరిస్థితి లేదు. కేవలము "అట" కబురుగా, పూర్తి స్థాయి గాలి వార్తగా వెలువడింది. పైగా.... ఈ వార్త వ్రాసి, ఆ విలేఖరి పాఠకులకు చెప్పేది ఏమీలేదు. "అట" కబురు వార్తలంటే.... పాఠకులు నిరాసక్తత కనబరుస్తారు. కాబట్టి.... ఇలాంటి వార్తలు ఏ వైపు నుండి చూసినా.... హర్షింపదగ్గవి కావు. రాద్ధాంతాలే తప్ప! ధ్రువపరచుకొని వ్రాస్తే...చదువుకునే వారికి బాగుంటుంది. ఏ మాత్రము సెన్సేషన్ ఉన్నా.... ఆ వార్త కాస్తా పాఠకులలో, ప్రజలలో ప్రముఖమై రాణిస్తుంది.

ఒక కాంగ్రెస్ నాయకుడు చాలా కాలముగా బలమైన నాయకత్వ లక్షణాలతో చెలామణౌతూ....1989అసెంబ్లీ ఎన్నికలలో... పార్టీ టికెట్‌కై ప్రయత్నించి, విఫలుడై, రాజధాని నుంచి తిరిగి వచ్చేసాడు. ట్రైన్ దిగి తనను కలుసుకున్న కొంతమందితో "నేను ఇండిపెండెంట్‌గా పోటీ చేస్తాన"ని చెప్పుకున్నాడు. కాంగ్రెస్ కార్యకర్తలలో ఇది బాగా నానింది. ఇది విన్న ఒక ప్రముఖ దినపత్రిక విలేఖరి- ఆ నాయకుడిని కలుసుకుని వార్తా సేకరణ చేద్దామని ప్రయత్నించి విఫలుడయ్యాడు. ఆ నాయకుడు అత్యవసర పనిమీద పొరుగు జిల్లా వెళ్ళిపోయాడు. స్ఫూర్తి, తెలివి ఉన్న ఆ విలేఖరి- ఆ నాయకుడు ఎవరెవరికి చెప్పాడో.... వారినందరినీ కలుసుకుని, విషయ సేకరణ చేసి, వార్త వ్రాసాడు. ఆ వార్త ధ్రువపరచుకొని వ్రాయడము వలన "అట" కబురు క్రింద వ్రాయనందున ... మంచి సంచలన వార్తే ఐనది. ఎవరైనా వార్తను ఖండించి ప్రశ్నిస్తే....

విలేఖరి బిక్కముఖము వేసేటట్లు ఉండే.... ధ్రువపడని వార్తలు వ్రాయకూడదు. అవాస్తవ వార్తా ప్రచురణను ఏపత్రికా చేయరాదు. ఈ తరహా ధ్రువపడని, అవాస్తవ వార్తలు రావడానికి గల కారణము- విలేఖరులు "వార్తను అందించాలన్న తపన" ను మాత్రమే ప్రధానముగా పెట్టుకొంటున్నారు. వార్తలపై ఏ కొంచెము దర్యాప్తు చేసినా ... ఇలాంటి వార్తలు ప్రచురణ కావు.

ఓ సారి "నందిగామ"లో "పరార్ అవుతూ పట్టుబడ్డ పెళ్ళికొడుకు" అను వార్త సంచలనము సృష్టించింది. రాష్ట్ర స్థాయిలో ఫొటోతో సహా ప్రచురింపబడ్డ ఈ వార్తను చదివి; కలకత్తా నుంచి రెండు కుటుంబాలు మరుసటిరోజు శ్రీకాకుళం జిల్లాలో గల 'నందిగామ్' మండలానికి చేరుకున్నారు. తీరా వెళ్లాక "ఆ వార్త ఇక్కడ జరుగలేదు" అని నందిగామ్ వాసులు చెప్పారు. అయోమయములో పడ్డ ఆ రెండు కుటుంబాలు విసిగివేసారి వెనుదిరిగాయి. అసలు విషయము ఏమిటంటే ... వార్తకు సంబంధించిన 'నందిగామ' కృష్ణా జిల్లాలోనిది! "పరారౌతూ పట్టుబడ్డ పెళ్ళికొడుకు" నాలుగుచోట్ల నలుగురు అమ్మాయిలను పెళ్ళిచేసుకుని, పరార్ అయ్యాడు! ఐదో సారి నందిగామలో ఇలాచేసి పట్టుబడ్డాడు. ఆ ఫొటో చూసి "మా చెల్లెనే ఇలా చేసాడు" అని కలకత్తా నుంచి రెండు కుటుంబాలవారు తెగబడ్డారు. తీరా చూస్తే "శ్రీకాకుళం జిల్లాలోగల నందిగామ్"కాదు, "కృష్ణాజిల్లాలోని నందిగామ" అని తరువాత తెలిసి వెళ్ళారు. దీనికి కారణము వార్త వ్రాసే సబ్ ఎడిటర్ వార్తలో విధిగా ఏ జిల్లా అనేది వ్రాసుంటే సరిపోయేది. ఇలాంటివి తఱచుగా జరుగుతున్నాయి. ఒకే పేరు గల మండలాలు, గ్రామాలు రాష్ట్రములో అనేకచోట్ల ఉన్నాయి. ఒకే జిల్లాలో ఒక్క పేరేగల గ్రామాలు, మండలాలు ఉండవచ్చు (ఉదా॥ రాజుపాలెం మండలం, రాజుపాలెం గ్రామం గుంటూరు జిల్లాలో ఉన్నాయి). ఈ పరిస్థితిలో కచ్చితముగా వార్తలో మండలంపేరుతోబాటు జిల్లాపేరు వ్రాయాలి. ఇలా ఐతే ... చదివే పాఠకుడు అస్పష్టతకు లోను కాడు.

ఒకే పేరు గల మండలాలు ఈ క్రింద ఇచ్చినవి ఉదాహరణకు పరిశీలించండి! ఈ మండలాల గూర్చి వ్రాసేటపుడు జిల్లా పేరు తప్పక వ్రాయాలి.

| ఒకే పేరుతో ఉన్న వివిధ మండలాలు | ఆ మండలాలు ఉన్న ఆయా జిల్లాలు |
|---|---|
| 1) బాలానగర్ | : రంగారెడ్డి, మహబూబ్‌నగర్ |
| 2) సీతానగరం | : తూర్పుగోదావరి, విజయనగరం |
| 3) నందిగామ, నందిగామ్ | : కృష్ణా, శ్రీకాకుళం |
| 4) రొంపిచెర్ల | : గుంటూరు, చిత్తూరు |
| 5) తాండూర్, తాండూరు | : రంగారెడ్డి, ఆదిలాబాద్ |
| 6) చింతపల్లి | : విశాఖపట్టణం, నల్గొండ |
| 7) కొత్తపేట | : తూర్పుగోదావరి, మహబూబ్‌నగర్ |
| 8) గంగవరం | : తూర్పుగోదావరి, చిత్తూరు |
| 9) ఇబ్రహీంపట్నం | : కరీంనగర్, రంగారెడ్డి |
| 10) గూడూరు | : నెల్లూరు, కృష్ణా, కర్నూలు |
| 11) ఆత్మకూర్, ఆత్మకూరు | : మహబూబ్‌నగర్, నెల్లూరు, నల్గొండ, కర్నూలు, వరంగల్, అనంతపురం |
| 12) రాజుపాలెం | : గుంటూరు, కడప |
| 13) రంగంపేట | : మెదక్, తూర్పుగోదావరి |
| 14) కొత్తగూడెం | : వరంగల్, ఖమ్మం |
| 15) నరసాపూర్, నరసాపురం | : మెదక్, పశ్చిమగోదావరి, కడప |
| 16) మైలవరం | : కడప, కృష్ణా |
| 17) కందుకూర్, కందుకూరు | : రంగారెడ్డి, ప్రకాశం |
| 18) పామర్రు | : తూర్పుగోదావరి, కృష్ణా |
| 19) వెంకటాపురం, వెంకటాపూర్ | : ఖమ్మం, వరంగల్, నెల్లూరు |

| | | |
|---|---|---|
| 20) | యలమంచిలి | : పశ్చిమగోదావరి, విశాఖ |
| 21) | ఉంగటూరు | : పశ్చిమ గోదావరి, కృష్ణా |
| 22 | అచ్చంపేట | : మహబూబ్‌నగర్, గుంటూరు |
| 23 | కమలాపూర్; కమలాపురం | : కడప, కరీంనగర్ |
| 24 | ప్రత్తిపాడు | : తూర్పు గోదావరి, గుంటూరు |
| 25 | కొత్తూరు | : మహబూబ్‌నగర్, శ్రీకాకుళం |
| 26 | మద్దూర్ | : వరంగల్, మహబూబ్‌నగర్ |
| 27) | సారంగాపూర్,సారంగపురం | : కరీంనగర్, ఆదిలాబాద్ |

ఇక ఒకే పేరుగల గ్రామాలు కూడ అనేకము మన జిల్లాలలో ఉన్నాయి. "రామచంద్రపురం" అనేది చాలా జిల్లాలలో ఉన్నది. "సీతానగరం", "రామాపురం"ఇలాంటి వెన్నెన్నో.... పలు ప్రాంతాలలో ఉన్నాయి. కనుక.... ఈ గ్రామాల పేర్లు వ్రాసేటపుడు జిల్లా, మండలము విధిగా వ్రాయవలసి ఉన్నది. అలా వ్రాస్తే.... చదివే వారికి ఎలాంటి అసౌకర్యము ఉండదు. వార్త 'పజిల్' కాకూడదు. చదివిన క్షణమే అర్థము కావాలి.

"వార్త"ను వాయువేగముతో పంపించి.... తాజా వార్తగా తీసుకు రావాలన్న తపన విలేఖరికి విధిగా ఉండాలి! ఐతే.... నిర్ధారణలో కూడా ఆ తపన ఉండాలి. వ్రాసే వార్తలో పాఠకుడు లీనమైపోవాలి! ఆసక్తి కరముగా చదువుకోవాలి తప్పితే.... వారి చేత తప్పుడు వార్తలు చదివించి.... "హిహ్హిహ్హి.....!" అని నవ్వుకునేట్టు చేసి, చులకన కారాదు. ఒక విధముగా ఇది ఆ పత్రికను హత్యచేసినంత తప్పు!

## ఆకర్షించే వార్తలు

ఆకర్షించే వార్తలు వ్రాయడము ఒక కళ! వ్రాయాలన్న తపన, పట్టుదల విలేఖరిలో ఉండాలేగాని.... పాఠకుడిని చదివింప చేసే ఈ వార్తలు గుర్తింపు స్థాయిని పెంచుతాయి. ఈ వార్తలు

ఒకే మూసలో ఉండవు. విలేఖరికి ఈ తరహా వార్తలు వ్రాయడానికి కావలసినది రచనా శిల్పము, శైలి! కథలు వ్రాసే విధానములో- ఈ ఆకర్షించే వార్తలు వ్రాయాలి. ముఖ్యముగా మనము ఇక్కడ చర్చించుకుంటున్నది గ్రామీణ విలేఖరులను గురించి! అదే ఏ కాలమిస్ట్‌లను గురించో, సీనియర్ రిపోర్టర్‌లను గురించో ఐతే ... ఆకర్షించే వార్తలు జాతీయ స్థాయిలో ఉంటాయి. అటువంటివి ప్రతి నిత్యమూ చూస్తుంటాము! బోఫోర్స్ కుంభకోణాలు, ప్రధానులకు ముడుపులు, N.T.R. అమెరికా సభలో.... "ఆంధ్రుడు అమెరికా అధ్యక్షుడు కావాల"ను కోవడము వంటివి జాతీయ స్థాయిలో ఆకర్షించే వార్తలనవచ్చు. మరి గ్రామీణ స్థాయి విలేఖరులు పైన ఉదహరించిన వార్తలు వ్రాయలేరు కదా! వ్రాసే అవకాశము లేదు!! అలాంటపుడు ఎలా ఆకర్షింపబడే వార్తలు వ్రాయాలి!

ఈ తరహా వార్తలు సుమారు ఓ పాతిక రకాలు ఉన్నాయి. ఉదాహరణకు ముఖ్యమంత్రి ఓ ప్రాజెక్ట్ లేదా ఓ ఆసుపత్రి శంకు స్థాపనకు విచ్చేసారు అనుకోండి! అప్పుడు ఈ గ్రామీణ విలేఖరులను ప్రక్కకు పెట్టి, జిల్లా కేంద్రములో ఉండే రిపోర్టర్ శంకు స్థాపన కార్యక్రమానికి హాజరౌతాడు. ఈ పరిస్థితిలో గ్రామీణ విలేఖరి చేతులు ముడుచుకోనవసరము లేదు. స్టాఫ్‌రిపోర్టర్ సేకరించేది ముఖ్యమంత్రి ఉపన్యాసము, శంకుస్థాపన, కొన్ని ఫోటోలు! వీటిని వదలి గ్రామీణ విలేఖరి సునిశితముగా గమనిస్తూ.... ఆ కార్యక్రమములో పాల్గొంటే.... "సైడ్‌లైట్స్" అని చక్కని చిక్కని చిన్న చిన్నవార్తలు వ్రాయొచ్చు! ఇవి పాఠకుల ముందు సీమటపాకాయల్లా ప్రేలుతాయి. మంచిపేరు తెస్తాయి. ఉదాహరణకు ముఖ్యమంత్రి శంకుస్థాపన చేస్తుండగా.... వేదమంత్రాలు చదివే పురోహితుడు ముఖ్యమంత్రి గోత్రనామాలు చదువుతూ.... అలవాటు ప్రకారము "సతీసమేతస్య" అని చదివేస్తుంటాడు. మధ్యలో ముఖ్యమంత్రి నవ్వుతూ "ఏమయ్యా! ఒంటరిగా వచ్చాను!! 'సతీ సమేతము'

అంటావేమిటి?" అనే సరికి చుట్టు ప్రక్కల వాళ్ళంతా గొల్లు మంటారు. ఇదో నవ్వించే వార్తగా సైడ్‌లైట్‌లో ఇవ్వొచ్చు.

ముఖ్యమంత్రి శంకుస్థాపన కార్యక్రమానికి అతి చేరువలో ఉన్న అంబేద్కర్ విగ్రహమును- పట్టించుకోకుండా తిరిగిపోతే .. సైడ్‌లైట్స్‌లో చక్కని ఉదాహరణగా ఇవ్వొచ్చు. అంబేద్కర్ విగ్రహాన్ని పూలమాలతో సత్కరించని వైనము వ్రాయొచ్చు.

ఉన్నత స్థాయి వ్యక్తుల ప్రతిమాట, ప్రతి చర్యలో విలేఖరి ఇలాంటి వార్తలే వెదకాలి. ముఖ్యమంత్రిగారు తినబోతుండగా.... ఎవరో తుమ్మారు. ఆయన ఒక నిమిషము ఆగారు. మళ్ళీ తిన బోతుండగా.... మళ్ళీ తుమ్మారు "ఏమయ్యా? నేను తినడము ఎవరికో ఇష్టము లేదు. ఓహ్ తుమ్మేది ... కలెక్టర్‌గారా!? ఏముంది! మీ జిల్లాలో అతిథులను తిననివ్వరా?" అని ముఖ్యమంత్రిగారంటే మళ్ళీనవ్వులు! ఇవన్నీ సైడ్‌లైట్స్ వార్తలే! ఇందులోనే ముఖ్యమంత్రి ఆగ్రహము, అధికారులను కేకలు వేయడము, చిరు-బురు లాడుతు కార్యక్రమములలో ఆయన ముభావముగా ఉండడము వంటివి జ గినా వ్రాసుకోవచ్చు.

వార్త వ్రాయాలన్న తపన ఉండాలే గాని వ్రాయడానికి తగిన సంఘటనలు కళ్ళముందు అనేకము జరుగుతుంటాయి. ఇవన్నీ పాఠకుడిని ఆసక్తి కరముగా, ఉత్సాహముగా చదివిస్తాయి.

1982 నుంచి 1989 వరకు అప్పటి ముఖ్యమంత్రి శ్రీ N.T. రామారావు పర్యటనలలో కేవలము ఆయన భోజనము గూర్చేఅనేక వార్తలు వెలువడేవి. ఆయన భోజన విధానము చాలా ఆసక్తి కరముగా పాఠకుల నోళ్ళలో బాగా నానింది. సైడ్‌లైట్స్ వ్రాసే టపుడు ఒకటికి పదిసార్లు చదువుకుని, మరీ ప్రచురణకు ఇవ్వాలి. "ఏదో వ్రాసేస్తే పోలా?" అనుకుని వ్రాయడము శుద్ధ దండుగ! మరి కొన్ని రకాల ఆసక్తి కరమైన వార్తలను ఈ క్రింద వరుసగా పరి శీలించండి!

"సరుబుజ్జిలి మండలంలో బిర్లామందిర్" అనే వార్తను ఒక శాసన సభ్యుడు విలేఖరుల సమావేశములో తెలిపారు. దీన్ని ఒక విలేఖరి వ్రాసాడు! డెస్క్‌వారు కూడా "ఏమిటీ వింత వార్త?" అని ఆలోచించకుండా వేసేసారు. అదీ.... మినీ డైలీలో బాక్స్ కట్టి మరీ అచ్చేసారు. వాస్తవానికి ఈ వార్తను చాలామంది హాయిగా చదువుకున్నారు... ముసిముసిగా నవ్వుకున్నారు."బిర్లాలు, టాటాలు- మూలు మూల కీకారణ్యాలను పోలిన మండలాలలో మందిర నిర్మాణాలు చేస్తారా? వాళ్ళు అలా చేయడమేమిటి? వారి మందిర్‌కు అనుగుణముగా ప్రభుత్వము పర్యాటక స్థలముగా వసతి గృహ నిర్మాణము తల పెట్టడ మేమిటి?" ఈ వార్త చదివేందుకు ఆసక్తి కరముగా ఉన్నా.... ఇలాంటి అభూత కల్పనలకు శాసన సభ్యుడు శ్రీకారము చుట్టినా.... విలేఖరులు అనుబంధ ప్రశ్నలు వేసి వార్త వ్రాయాలి. ఆ శాసన సభ్యుని చెప్పిన వెంటనే అడగాలి. "బిర్లాలు మీకు నోటి మాటగా చెప్పారా? లిఖితపూర్వకముగా చెప్పారా?ఆధారాలుంటే... దయచేసి ఇవ్వండి! ఎలాగూ ప్రభుత్వము పర్యాటక స్థలముగా అభివృద్ధి చేస్తానంది అని చెప్పారు! కనీసము ప్రభుత్వ పరముగా ఆధారము చూపండి!" అని విలేఖరులు అడిగి; ఈ మొత్తము వార్తగా వ్రాస్తే.... శాసన సభ్యుడు నీళ్ళు నమలిన విధము కూడా పాఠకులకు తెలుస్తుంది.

ఒక గ్రామమందలి కొండమీది సంగమేశ్వరునికి సంక్రాంతి నాలుగు దినాలూ జాతరలు, జరుగుతుంటాయి. ఈ జాతరకు అనేక మంది పలుగ్రామాల నుండి వస్తుంటారు. చివరి రోజున ఏదో చిన్న గొడవ జరిగి చిలికి-చిలికి గాలి-వానఅయ్యింది. జాతర అయ్యాక.... కొండ ప్రక్క గ్రామము మీదకు పొరుగుగ్రామ యువకులు కత్తులు-కఱ్ఱలతో బయలుదేరారు. పెద్ద సైన్యములా వస్తున్న యువకులను చూసి పాపమా చిన్న గ్రామములోని మగాళ్ళు భయముతో ఇళ్ళల్లో దాక్కున్నారు. ఆడాళ్ళు మాత్రము కారండబ్బాలతో విజృంభించారు.

క్షణాలలో దాడికి వెళ్ళిన యువకులు పరుగులు తీసారు. ఎలాంటి రక్తపాతము, హింస లేకుండా కేవలము స్త్రీలు- కారం డబ్బాలతో విజయము సాధించుకున్నారు. ఇదో ఆసక్తికరమైన వార్త అయ్యింది. ఇటువంటి హాస్యముతో కూడిన వార్తలు ఈ క్రింద చూడండి!

ఒక గ్రామ సర్పంచ్ అర్ధరాత్రి రైల్ దిగి తన గ్రామము వెళ్ళడానికి ఒంటరిగా బయలుదేరాడు. నాలుగు కి॥మీ॥ల దూరము గల ఆ గ్రామము వైపు చకాచకా నడుస్తుంటే ... దారిలో మరో గ్రామము తగిలింది. ఆ గ్రామస్థులు అంతకుముందే దొంగలను తరిమి వేసి- హడావిడిగా ఉన్నారు. సర్పంచ్‌ను చూడగానే.... "ఈ రాత్రికి ఇక్కడే ఉండిపోండి! దొంగలు మీ ఊరివైపే పారిపోయారు" అని చెప్పారు. "నాకు దొంగల భయము లేదు! నేనంటేనే దొంగలకు భయము" అని డప్పాలు పలికి.... అక్కడ నుండి బయలుదేరాడు. ఇదంతా కొద్ది దూరములో చీకటిగా ఉన్నచోట నక్కి దాక్కున్న దొంగలు గమనించారు. సదరు సర్పంచ్‌ను దారిలో పట్టుకుని,అతని వద్ద ఉన్నది లాక్కుని, నాలుగు తన్ని, కట్టేసి, ఒక పొలములో పడేసి వెళ్ళిపోయారు. ఆ మరుసటి దినము పొలములో మూలుగ తున్న సర్పంచ్‌ని కొందరు రైతులు బంధ విముక్తుడిని చేసార ఈ కథనము విలేఖరి వ్యంగ్యముగా, చక్కగా....ఆసక్తి కల్గించే వ్రాసి.... చదివింప చేయగలిగాడు. వీటిని సేకరించడానికి ఆ ఖరి రెండు గ్రామాల వారిని వాకబు చేసి, సర్పంచ్‌ను కదిపితె ముందు కాదన్నా- తరువాత ఒప్పేసుకొన్నాడు. ఈ వార్తల రాబట్టడములో విలేఖరికి- చాలా ఓర్పు, గ్రామీణులతో మం స్నేహము ఉండాలి. వార్త పడ్డాక.... సర్పంచ్ కూడా తేలిగ్గా తీస కుని నవ్వేటట్టు ఉండాలి. వార్త వ్రాయడములో ప్రజ్ఞ ఉంటే వీటి సాధించవచ్చు.

ఒకసారి "నెల్లిమెట్ట" అనే గ్రామములో "నకిలీ టీచర్ ఉదంతము రాష్ట్ర వ్యాపిత వార్త అయ్యింది. ఈ వార్తను గురిం ఇంతకుముందు 19వ పేజీలో చర్చించుకున్నాము.

ఇలా చెప్పుకు పోతుంటే.... రెండువేల పేజీలు వ్రాసినా.... ఇంకా సశేషముగానే మిగులుతుంది. కాబట్టి ఇంకొన్ని సంఘటనలను గూర్చి చర్చించుకొని ఈ అధ్యాయాన్ని విరమిద్దాము.

దుర్ఘటనల్లో ఆసక్తి కల్గించే వార్తలు: అగ్ని ప్రమాద సంఘటనలలో.... చుట్టూ పెద్ద ఎత్తున మంటలు, ఆ మంటలమధ్య పసి పిల్లలు బిక్కు బిక్కు మంటున్న తరుణములో.... ప్రాణాలు లెక్క చేయకుండా లోపలికి దూకి వెళ్ళి రక్షించిన యువకులను గురించి వార్తా కథనము వ్రాస్తే ... విశేషముగా ఆకర్షించే వార్త ఔతుంది. అదే అగ్ని ప్రమాదములో చాలా కాలముగా దాచుకున్న డబ్బు ఆహుతి కావడము వంటి కథనాలు కూడా ఆసక్తిని కలిగిస్తాయి. ఇలాంటి వాటిని విలేఖరులు చాకచక్యముగా రాబట్టాలి. ఇవి ఎవరూ వార్తగాచెప్పరు. ఆ ప్రమాద స్థలములో తిరిగి చెవులు రిక్కించాలి.

నదిమీద వంతెనపై రైల్ స్పీడ్‌గా పోతోంది. దాన్ని సడెన్‌గా చూసిన- వంతెన మీద నడుస్తున్న వ్యక్తులు "ఏవిధముగా ప్రాణాలు కాపాడు కోవాలో?" తెలియని ఆ పరిస్థితిలో పెద్దగా కేకలు పెడు తుంటారు. వారికి చేరువలో ప్రాణాలు దక్కించుకోవడానికి ట్రాలీ రెస్ట్స్ (రైల్ వంతెనపై అక్కడక్కడ చిన్నచిన్న బోనుల మాదిరి కట్టడాలు ఉంటాయి. వీటిలోకి వెళ్ళిపోతే ... వంతెనమీదకి రైల్ వచ్చినా ప్రమాదము ఉండదు) లేవు. ఈ పరిస్థితిలో వంతెనమీద నుంచి ఎగిరి క్రింద వేగముగా పారుతున్న నీటిలోకి గెంతేసారు. ఈ వైనము కళ్ళకు కట్టినట్లు విలేఖరి వ్రాయగలగాలి. "నీళ్ళలో ఈదు కుంటూ... ఒడ్డుకు చేరుకున్న మృత్యుంజయులు" ఈ వార్త ఆసక్తి కరమైన అంశమౌతుంది. ముమ్ముందు ఇలాంటి ప్రమాదాలు జరుగ కుండా వంతెనదాటే టప్పుడు ముందు వెనుక చూసుకుని మరీ వెళ్ళేం దుకు ఈ వార్త అనేకమందికి తోడ్పడుతుంది. రైల్వేశాఖవారు కళ్ళు తెరచి... ట్రాలీరెస్ట్స్ నిర్మించే ప్రయత్నాలకు ఒగవచ్చు.

శాస్త్ర విజ్ఞానమునకు సంబంధించిన వార్తలు కొన్నింటిపై చర్చించుకొందాము. చెరువులో పెంచే చేపలకు ఊహించని విధముగా 'కుళుపు వ్యాధి' సోకిందనుకోండి! ఈ వ్యాధిసోకిన చేపలను తింటే.... ప్రమాదము! ఐనా....పెంపకం దారులు చేపలను మార్కెట్‌లో అమ్మి, సొమ్ముచేసుకో చూస్తారు. ఈ చేపలపై విలేఖరులు తమకున్న పరిజ్ఞానముతో వ్రాసేయకుండా... దగ్గరలో ఉన్న మత్స్య పరిశ్రమ అధికారులను కలుసుకొని; వారిద్వారా ఈ కుళుపు వ్యాధి చేపలను గూర్చి పూర్తి వివరాలు తెలుసుకుని వార్త వ్రాయాలి. "అట" కబురులు, అతిశయోక్తులు నింపి; వార్త వ్రాయకూడదు. కుళుపు వ్యాధి వచ్చిన చేపలను ఏరివేస్తే ... కొంతవరకు ఈ జబ్బు ప్రబలకుండా ఉంటుంది. అలాగే ... చెరువులలో మందులు జల్లడము వంటివి వెంటనే జరగాలి. ఇవేవీ పట్టించుకోకుండా పెంపకం దారులు చేపలను అమ్ముకునే తాపత్రయములో ఉంటారు. కాబట్టి కుళుపు వ్యాధి సోకిన చేపల రూపము, తీరు గూర్చి వార్తలు వెలువడితే ప్రజలు కొనరు. అనారోగ్యము ప్రబలకుండా ఉంటుంది.

ఆయా సీజన్‌లలో వచ్చే గొఱ్ఱెల, మేకల జబ్బుల వలన ఒకేసారి ఎక్కువ సంఖ్యలో అవి చనిపోతూ ఉంటాయి. వీటిని మార్కెట్‌లో చౌకగా అమ్మేస్తారు పెంపకం దారులు! వీటిని కొన్న మాంస విక్రయ దారులు ఆరోగ్య కరమైన మాంసములా అమ్ముతుంటారు. ఈ మాంసము తింటే ... అనారోగ్యము తప్పదు కాబట్టి సీజన్‌లో వచ్చే రోగాలను గూర్చి పశు సంవర్ధక శాఖద్వారా తెలుసుకోవాలి. రోగాలు-వాటి నివారణ, ఏ గ్రామములో ఎన్ని చనిపోయాయి? వంటి వార్తలు ఎప్పటి కప్పుడు వ్రాస్తుండాలి. దీని వలన ఒక వైపు పెంపకందారులకు జాగ్రత్త పడమనీ; రోగాలబారి నుంచి రక్షించుకోమనీ హెచ్చరింపు ఔతుంది. మరోవైపు మార్కెట్‌లో మాంసము కొన్నప్పుడు వినియోగదారులు తగు జాగ్రత్త పడతారు. అలాగే ... పశువులకు జబ్బవాపు వ్యాధి, మెదడువాపు వ్యాధివంటివి

సీజన్‌లో వచ్చే రోగాలలో ముఖ్యమైనవి! వీటిని గూర్చి విలేఖరులు ప్రత్యేక శ్రద్ధ వహించాలి. ఇక మనుష్యులకు వచ్చే సీజనల్ వ్యాధులలో డైయేరియా, పొంగువ్యాధి, కలరా, విషజ్వరాలవంటివి ముఖ్యమైనవి. ఇవి గ్రామాలలో ఎక్కువగా వస్తాయి. అత్యవసర చికిత్సలు లభించని కారణముగా ఈ వ్యాధులు త్వరితగతిని వ్యాప్తి చెందుతాయి. వీటిపై ఎప్పటి కప్పుడు వార్తలు వ్రాయాలి. అక్కడ ప్రాథమిక ఆరోగ్య కేంద్రమువారు అత్యవసర విధులు పాటించి, పెరుగుతున్న వ్యాధిని అదుపు చేసినదీ ...లేనిదీ ...వార్తలువ్రాయాలి. వైద్యుల సేవను తూలనాడే భావముతో.... ఒకే బాణీలో వ్రాసేయకూడదు. గ్రామాలలో వ్యాధులు తగ్గకపోయినా.... ఎలాంటి మరణాలూ లేకుంటే....వైద్యులు రాత్రింబవళ్ళు శ్రమించిఅదుపుచేస్తే... ఈ అంశాన్ని ప్రస్తుతిస్తూ వ్రాయవలసిన అవసరము ఎంతైనా ఉన్నది. చికిత్స చేసే వైద్యుల సలహాలు, రోగనివారణ విధానాలు విలేఖరి తెలుసుకొని మరీ వ్రాయాలి. ఒకప్పుడు గ్రామాలలో సంఘీభావము, ప్రేమ, ఐక్యత ఉండేవి. ఇప్పుడు రాజకీయాలు ఎక్కువైపోయి... ప్రతి గ్రామము ఒక 'మందు పాతర'లా మారిపోయింది. సీజనల్ వ్యాధులు వచ్చేటపుడు ఈ రాజకీయ నాయకుల నుండి విషయాలు తీసుకునివ్రాస్తే ... అంతా రాజకీయమే ఔతుంది. నిజమైన వార్తకు అక్షరరూపము కనిపించదు. కాబట్టి వీటిని గురించి వ్రాసేటపుడు వైద్యుల నుండి తెలుసుకొని వ్రాయాలి.

వింత జననాలను గూర్చి ప్రజలకు మంచి ఆసక్తి ఉంటుంది. ఈ వింత జననాల గూర్చి విలేఖరులు వ్రాస్తూ ఉండాలి. ఇలా వ్రాయాలంటే.... ముందుగా ఆ ప్రాంతపు వైద్యులతో మంచి స్నేహము ఉండాలి. అలా ఉన్నపుడు ఈ జననాలు విలేఖరిదృష్టికి ఆ డాక్టర్లే తీసుకు వస్తారు. అలాగే.... వైద్య చికిత్సలలో, శస్త్ర చికిత్సలలో ఏమైనా విశేషాలున్నా.... విలేఖరి చక్కగా పాఠకుల ముందుంచడానికి వీలుంటుంది.

ఇంకా.... విధులకు హాజరుకాని A.N.M లు, ప్రాథమిక అరోగ్య కేంద్ర వైద్యులను గూర్చి; వారివృత్తి ధర్మము పాటిస్తున్న వైనాలనుగూర్చి చక్కని కథారూప వార్తలు వ్రాయొచ్చు. ఇందులో వాస్తవాలే వ్రాయాలి. ఇక వినోద విషయాలు; రాక రాక ఎప్పుడో సర్కస్‌వస్తే.... చూడటానికి జనము ఎగబడతారు. ఆ సర్కస్ కంపెనీవారు "గొప్ప ప్రదర్శన" అని పత్రికలలో ప్రకటనలు ఇస్తారు. ఇక్కడ విలేఖరులు సర్కస్ వెనుకనున్న కథనాలను జాగ్రత్తగా సేకరించగలిగితే.... పాఠకులను విశేషముగా ఆకర్షించే వార్త ఔతుంది. ఉదాహరణకు ఒకచక్కని వార్తావిశేషాన్ని ఇక్కడ పరిశీలించండి!

సర్కస్‌లోని పెద్ద పులికి బాగా అనారోగ్యము చేసింది. అది ఏదో తింటున్నది తప్పితే ...సరిపడా ఆహారము తినలేక పోతున్నది. సర్కస్ ఫీట్‌లు కూడా చేయని పరిస్థితిలో ఉన్నది. ఈ పులికి వచ్చిన వ్యాధికి సరైన వైద్యము చేయించాలని స్థానిక పశువైద్యుడిని పిలుచుకొని వచ్చారు- సర్కస్ కంపెనీ యజమానులు! తీరా వచ్చిన పశువైద్యుడు బోనులో ఉన్న పులికి ఏదో వైద్యము చేసేవాడు!! బోనువెలుపల-నిద్రపోతూ కనిపించిన పులిని చూస్తే.... ఆయనకు చెమటలు పట్టేసేవి! ఎవరు ఎంత చెప్పినా.... ఆ పులి దగ్గరకు చేరలేక పోయాడు. "బ్రతికుంటే బలుసాకు తినవచ్చు! పులికి వైద్యము చేసి బలికాలేను!" అని పరుగు లంకించుకున్నాడు. ఇదంతా వార్తా రూపంలో వెలువడి; చదివే పాఠకులను ఎంతో ఉత్సాహములో ముంచేసింది. "ఫలానా 'జూ'లోని పులికి నాలుగు పిల్లలు పుట్టాయి" అని దినపత్రిక పతాక శీర్షికలో వేస్తే.... కనులు చేటలంత చేసుకొని చదివే పాఠకులకు- పైన "పులి అనారోగ్యం వార్త" పట్ల ఎంతగా రియాక్ట్ ఔతారో? అర్థము చేసుకోవచ్చు!

పై విధముగానే సర్కస్ వెనుక అనేక ఆసక్తికరమైన వార్తలు ఉంటాయి. ఏనుగు సర్కస్ ఫీట్‌లు సరిగా చేయకపోతే.... దానికి

శిక్షగా మంచినీరు ఇవ్వరు. పులి, సింహము, ఎలుగుబంటి వంటి క్రూర జంతువులకు వేకువ జామున మూడు నుంచి ఐదు గంటల వరకు ఫీట్‌లు నేర్పుతారు. అవి అప్పుడు నిద్రనుంచి తేరుకోక పోవడముతో.... చెప్పినట్లు సులభముగా వింటాయి ఇంకా.... కళా కారులు, సాంకేతిక నిపుణులవంటి వారంతా.... నెలసరి జీతాలపై పనిచేస్తుంటారు. వీరి కథలు ఎక్కువ భాగము జాలి కలిగించేవిగా ఉంటాయి. ప్రతిరోజూ మృత్యువు కోరలలోకి జొరబడి బయటికి రావ డమే వీరిపని! ఇలాంటి వెన్నెన్నో... విలేఖరులకు వార్తలుగా పనికి వస్తాయి.

**సంఘ వార్తలు:** చాలామంది యువకులు ఒక సంఘముగా ఏర్పడి.... "అది చేస్తాము! ఇది చేస్తాము!!" అని పెద్ద హడావిడి చేస్తారు. కొంత మంది ఉచిత నేత్ర-దంత చికిత్సా శిబిరాల వంటివి ఏర్పాటు చేస్తారు. త్వరలో "బస్ షెల్టర్స్ నిర్మిస్తామం"టారు. ఇవన్నీ విలేఖరులు వార్తలుగా వ్రాస్తారు. ఈ సంఘాలు నూటికో... కోటికో.... ఒకటి నిలబడుతుంది. అలా అని మొదటి నుండి వీరిని చిన్నచూపు చూడకుండా.... వారి చర్యలు, చేస్తున్న కార్యక్రమాలు వార్తలుగా వ్రాయవలసిన బాధ్యత ఉన్నది.

**తారలు-T.V. తారలు :** సినిమా తారలు వస్తే.... వారితో ఇంటర్వ్యూలూ, వారు ఎందుకు వచ్చింది? ఏమి చేసింది? ఒకవేళ వారు ప్రసిద్ధి పొందిన తారలైనచో- సైడ్‌లైట్స్ వార్తల ద్వారా ప్రతి చిన్న విషయము వ్రాయవలసి ఉంటుంది. అలాగే ... T.V. తారల గూర్చి విపులీకరించాలి. నాటకాలలోనటించే ప్రసిద్ధ నటులు, బుఱ్ఱ కథలలో గొప్పవారు, హరికథా పితామహుల వంటి వారు వస్తే వదలకూడదు. గౌరవాదరాలను చూపుతూ- వారితో సంభాషించాలి. వారిని గూర్చి ఓపికగా చాలా విషయాలు సేకరించాలి. అప్పుడే విలేఖరికీ.... తద్వారా ఆ పత్రికకూ కూడా మంచి విలువ లేర్పడ తాయి. కొంతమంది విలేఖరులు "నేనువచ్చి అడిగితే.... ఇప్పుడు

కాదంటారా? నన్ను తరువాత రమ్మంటారా??" అని చిరుబురు లాడుతుంటారు. ఇటువంటివి ప్రదర్శించి, విలేఖరి జర్నలిజ్మ్‌కు తలవంపులు తీసుకురాకూడదు. కళాకారులు దూర ప్రయాణపు బడలిక, రాత్రుల యందు నిద్రలేమి, సరైన సమయానికి తిండిలేకపోవడము వంటివి ఎదుర్కొంటుంటారు; చికాకు ప్రదర్శిస్తే .. విలేఖరి పట్టించుకోరాదు. ఎంతో గౌరవ భావముతో మెలగాలి.

## వివిధ శాస్త్రాలను గూర్చి.....

ఒకప్పటి జర్నలిజ్మ్‌కు- నేటి జర్నలిజ్మ్‌కు చాలా వ్యత్యాసమున్నది. అది స్పష్టముగా కనిపిస్తోంది. ఇప్పటి పాఠకులకు- ఎపుడూ ఏదో క్రొత్తదనము, తెలుసుకోవాలన్న తపన ఎక్కువగా ఏర్పడింది. ఆ తపనే ... విచిత్ర వార్తా కథనాలకు దారి తీసింది. దీనిపై కొంచెము సంక్షిప్తముగా చర్చించుకొందాము :- రెండు దశాబ్దాల క్రితము- సాహిత్యము, ప్రాచీన గ్రంథాలు, వాటి చక్రవర్తులు, మహారాజులు, నిధులను గూర్చి తెలుసుకోవాలన్న ఆసక్తి పాఠకులలో ఉండేది. ఇప్పుడు వీటిపై ఉన్నా.... పరిశోధనాత్మకమైన విషయాలను గూర్చి; తెలియని విషయాలు, నమ్మలేని విజాలను గూర్చి తెలుసుకుందామన్న ఆలోచన, కుతూహలము, ఉత్సుకత స్పష్టముగా కనిపిస్తున్నాయి ఈ తరము పాఠకులలో!

ఒకప్పుడు ఎంతో రహస్యముగామాట్లాడుకునే సెక్స్‌ను-నేటి పత్రికలలో.... ప్రధానాంశముగా చేసి, కొన్ని పేజీలు వీటికి కేటాయించే పరిస్థితి ఉన్నది. సెక్స్‌ను A to Z విపులీకరించి చెబుతున్నారు. అలాగే.... ఈ సెక్స్‌కు సంబంధించిన ఏదైన మందు కనుగొనబడినా, ఏ విచిత్ర వ్యాధి వస్తున్నా- దీనిపై వార్తలు పత్రికలలో వస్తుంటాయి. ఉదాహరణకు ఎయిడ్స్.... ఈ వ్యాధివివరాలు, ఇదెందుకు వస్తుంది? దీనికి మందు కనుగొన్నారా? లేదా?? ఇలా అనేక వార్తలు ప్రపంచ వ్యాప్తముగా వస్తున్నాయి.

ఇక గ్రామీణ విలేఖరులు సుఖ రోగాలపై ఏ డాక్టర్ వివరించినా.... ప్రాణాంతకమైన ఏ ఆపరేషన్ చేసినా ... వాటిని వార్తా కథనాలుగా వ్రాస్తున్నారు. ఇలాగే .. పలు శాస్త్రాలపై వార్తలు వెలువడుతున్నాయి. పంటలు పండించునపుడు రకరకాల క్రిమి కీటకాలపైన, వాటి నివారణపైన శాస్త్రజ్ఞుల వివరణలను- రైతులకు అందించడములో గ్రామీణ విలేఖరుల పాత్ర ప్రశంసనీయముగా ఉన్నది. ఈ విషయములో వ్యవసాయభూములందు ఇటీవల ప్రబలిన "ఉల్లికోడు" అను వ్యాధీ, దీనిపై శాస్త్రజ్ఞుల ప్రయోగాలూ ముఖ్యముగా చెప్పుకోదగ్గవి! ఈ 'ఉల్లికోడు'కు నేటికీ సరైన నివారణ కనుగొన బడలేదు. ప్రారంభములో దీన్ని అరికట్టడానికి శాస్త్రజ్ఞుల ప్రయోగాలు కొంతవరకు ఫలించాయి. ముఖ్యముగా- ఈ 'ఉల్లికోడు'పై శాస్త్రజ్ఞులకు సమాచారము అందించినది గ్రామీణ విలేఖరులే! "ఫలానా మండలములో.... ఫలానా గ్రామములో.... ఇన్ని హెక్టార్ల భూమికి ఉల్లికోడు సోకింది!" అని ఎప్పటికప్పుడు వ్రాయడము వలన శాస్త్రజ్ఞులు ఆ వ్యవసాయ క్షేత్రాలలోని పైరును సేకరించి, ప్రయోగాలు చేయడానికి వీలు కలిగింది. ఇంకా గ్రామీణ విలేఖరులు ఈ క్రింది శాస్త్రాలపై ఆసక్తి చూపాలి. ఆయా శాస్త్రజ్ఞుల నుండి క్రొత్త సమాచారము ఏ కొంచెము లభ్యమైనా .... వెంటనే వార్తలుగా వ్రాయగలిగితే ... మంచి వార్తను అశేష పాఠకులకు అందించిన వారౌతారు. కాబట్టి ఆయా శాస్త్రాల పేర్లను ప్రాథమిక పరిజ్ఞానము కొరకు ఈ దిగువ నివ్వడమైనది.

ఎన్టోమోలజీ- కీటక శాస్త్రము, హార్టికల్చర్- ఉద్యానవన శాస్త్రము, న్యూరాలజీ- నరాల శాస్త్రము, అనాటమి- శరీర నిర్మాణ శాస్త్రము, ఫైలటాలజీ- తపాలా బిళ్ళల సేకరణ, సిస్మోలజీ- భూప్రకంపన శాస్త్రము; టెలిపతి- భావనలను చదువుట, ఆలోచనలను బదిలీ చేయుట; ఫిలాసఫీ- తత్వ శాస్త్రము, ఫ్రేనోలజీ- పుఱ్ఱె దాని భాగాలను గుఱించిన శాస్త్రము, ఫిజియోగ్నమీ-ముఖసాముద్రిక శాస్త్రము,

డాక్టలోగ్రఫీ- మూగవారి సైగలను తెలుపు శాస్త్రము, ఎపిగ్రఫీ- శిలాశాసనాల సంబంధ శాస్త్రము, న్యూరోపాథాలజీ- నాడీ మండల వ్యాధులకు సంబంధించిన శాస్త్రము, నెఫ్రాలజీ- మూత్రపిండాల శాస్త్రము, ఆర్థోపెడిక్స్- ఎముకల శాస్త్రము, జుయాలజీ- జంతు శాస్త్రము, ఫెలియంటాలజీ- పురాతనశాస్త్రము, పేథాలజీ- వ్యాధులకు సంబంధించిన శాస్త్రము, జియోమార్ఫాలజీ- భూమిపుట్టుకను గూర్చిన శాస్త్రము, ఆర్నిథోలజీ- పక్షులకు సంబంధించిన శాస్త్రము, లెక్సికోగ్రఫీ- నిఘంటువుల శాస్త్రము, మెటియరాలజీ- వాతావరణ శాస్త్రము, క్రిప్టొగ్రఫీ- రహస్యలిఖిత శాస్త్రము, అస్ట్రోనమీ- ఖగోళ శాస్త్రము, మైథాలజీ- పురాణ సంబంధ శాస్త్రము, ఫిలాలజీ- భాషా తత్వ శాస్త్రము, సైకాలజీ- మనో విజ్ఞాన శాస్త్రము, కాస్మోలజీ- విశ్వసృష్టి విషయక శాస్త్రము, ఫామోలజీ- ఫలముల శాస్త్రము, న్యూమిస్‌మాటెక్స్- నాణెముల శాస్త్రము, బయోలజీ- జీవ శాస్త్రము, సెలెనాలజీ- చంద్రుని గూర్చిన శాస్త్రము, ఎకోస్టిక్స్- ధ్వని లేదా శబ్ద సంబంధ శాస్త్రము, ఎథాలజీ- జంతు ప్రవర్తన శాస్త్రము, న్యూమరాలజీ- సంఖ్యా శాస్త్రము, అరికాలజీ- క్యాన్సర్ సంబంధ శాస్త్రము, అస్ట్రాలజీ-జ్యోతిష శాస్త్రము, హైడ్రోఫోనిక్స్- మట్టిలేకుండా మొక్కలను పెంచే శాస్త్రము, కేలోల్జీ- మానవ సౌందర్య శాస్త్రము, జరంటాలజీ- వృద్ధాప్య శాస్త్రము, యూజెనిక్స్- జన్య శాస్త్రము, బోటనీ- వృక్ష శాస్త్రము, లింగ్విస్టిక్స్- భాషోత్పత్తి శాస్త్రము.

## చద్ది వార్తలు

తెలిసిన విషయాలనే.... పదే-పదే చర్చించటమూ, వ్రాసినదే.... పలుమారులు వ్రాసేయడమూ, ఏదైనా ఓ మంచి న్యూస్ ఐటమ్ వ్రాస్తున్నప్పుడు అర్థములేని ఉపోద్ఘాతాలతో ప్రారంభించడమూ; సులభముగా వ్రాయవలసినదిపోయి.... క్లిష్ట భావాలతో, మఱుగున పడిపోయిన పద ప్రయోగాలతో వ్రాసి, చేతులు దులుపు

కోవడమూ గ్రామీణ విలేఖరులకే కాదు ... ఏ రిపోర్టర్‌కూ, ఏ సబ్ ఎడిటర్‌కూ పనికిరాదు. అందరికీ తెలిసిన విషయాన్ని చర్చించు టనే ... "చద్ది వార్తలు" అని అంటారు. ఉదాహరణకు మాజీ ముఖ్యమంత్రి, తెలుగుదేశం అధ్యక్షుడు శ్రీ N.T. రామారావు ఉప ఎన్నికల సభలకు గ్రామాలకువస్తే....ఆయన సభా విశేషాలు, టూర్ హైలెట్స్ వ్రాస్తే సరిపోతుంది. అలాకాక.... అందరికీ తెలిసిపోయిన ఆయనప్రత్యేక భోజనము గురించి తిరిగివ్రాయుటఅనవసరము! ఈ తరహా వార్తలు 1983 నుండి తెలుగు పాఠకులు రకరకాలుగా వివిధ కోణాలలో చదివారు. మళ్ళీ వీటిని వ్రాస్తే.... ఈ తరహా 'చద్దివార్త'లనుపాఠకులుఎంతవరకు ఉత్సాహముగాచదువుతారో.... ఆలోచించండి! అలాగే.... ఒక M.L.A. గత 20 సం॥ల నుండీ దురుసుగా ప్రవర్తిస్తూ.... ప్రభుత్వ అధికారులను బెదరించి- మరీ పనులు చేయించుకుంటున్నాడు. ఈ విషయము అనేక సారులు వార్తలుగా పాఠకులు చదివారు. మళ్ళీ ఇప్పుడు ఒక M.R.O.మీద పడి ఆయన చేతులలోని ఫైల్స్ దురుసుగా లాక్కొని విసరివేసాడు. తనకు కావలసిన ఒక గ్రామానికి సంబంధించిన పని చేయించు కొన్నాడు! ఈ సందర్భములో- "ఫలానా M.L.A." అనివ్రాస్తే.... పాఠకులు ఆ వార్త పట్ల ఎంత మాత్రము ప్రభావితులు కారు- ఇదే వార్తను మరో కోణములో వ్రాస్తే....కొంతవరకు పాఠకులు చదువు తారు. అదెలా అంటే....వార్తలో ఈ దురుసుతనమును విడిచిపెట్టి- "M.L.A. ఫలానా గ్రామానికి సంబంధించినపనిని M.R.O. ద్వారా చేసి పెట్టారు". అని చక్కగా వ్రాయాలి. అంతేకాని.... అతనికున్న క్రూరస్వభావాన్ని, చేసినహేయమైన చర్యలను వ్రాయకూడదు అలా అని ఆ M.L.A.ని సమర్థించకూడదు. ఇట్టివి చద్దివార్త లనుకునేలా వ్రాయకూడదు. కలానికి పదనుబెట్టి, మరోకోణములో వ్రాయాలి.

పాత విషయాలు, పోటీ దిన పత్రికలలో వచ్చిన వార్తలు, కాపీ వార్తలు, "ఏదో చెప్పాలనే తపన"తో.... అన్నీ తెలిసిన విష

యాలే ముచ్చటించడమూ; వార్త ప్రారంభములోనూ, మధ్యలోనూ, చివరిలోనూ తెలిసిన సామెతలనే జోడించడము వంటివి చక్కైవార్తల రూపాలని చెప్పక తప్పదు.

అలాగే ... గ్రామీణ విలేఖరులు వారి పరిధిలో గల గుళ్ళ-గోపురాలు, చారిత్రక ప్రదేశాలు, మహావీరుల గాథలను- ప్రతి ఏడాది వాటికి సంబంధించిన వేడుకలు జరిగేటపుడు ఒకే తరహాగా ఉండే.... కార్బన్ కథలనే వ్రాయకూడదు. ఏదో ఒక వెరైటీ చూపాలి. ఐతే ... వాస్తవికత తప్పకూడదు. కల్పనలు ఏ మాత్రము జోడించకూడదు. "ఏదో మార్చుదామ"ని ఊహించి, కల్పించి వ్రాయడము పత్రికా ప్రపంచములో పెద్ద తప్పు! ఈ విధానము- "చెడు" అనే గోతిలోకి తాను జారిపోతూ.... పాఠకులనూ ఈడ్చుకు పోతున్నట్లు కాగలదు. కాబట్టి ఇట్టి భ్రమల జోలికి వెళ్ళకండి! ఉదాహరణకు అల్లూరి సీతారామరాజు పోరాట గాథ రెండు రకాలుగా వినిపిస్తున్నది. ఆ రెండు కథలు వివరించడములో తప్పులేదు. 'అల్లూరి' సమాధి ప్రస్తుతము ఏపరిస్థితిలో ఉన్నది? ప్రభుత్వము సమాధిపట్ల ఏ విధముగా స్పందిస్తున్నది. అల్లూరి పట్ల నేటికీ మన్య ప్రజలలో ఉన్న మహోన్నత స్థానము.... వంటివి వ్రాస్తే ... ఒక విప్లవకారుని గూర్చి ఆసక్తిగా పాఠకులు చదువుతారు. కల్పించి వ్రాస్తే.... ఆ విలేఖరిని- చరిత్రకారులు క్షమించరు.

"తెల్లవారి తూటాలు తగిలి, మరణించబోయే సమయములో.... అల్లూరి వేసిన బాణాలకు- రూథర్‌ఫర్డ్, గుడాల్ తీవ్రముగా గాయపడ్డారు. దీర్ఘ కాల వైద్యముతో వారు బ్రతికారు. ఇందుకు బలమైన ఆధారాలు లభ్యమయ్యాయి! ఈ విషయము అల్లూరి వంశస్థుడు ఒకరు చెప్పారు" అని "అట" కబురులతో వార్త వ్రాస్తే ... ఆ విలేఖరి పాఠకుల ముందు దారుణ దోషిగా నిలవక తప్పదు.

శ్రమించి, సేకరిస్తే.... వాస్తవికతతో కూడిన న్యూస్ ఐటమ్స్ లభిస్తాయి. క్రొత్తదనము కోసము నిరంతరమూ వెతకాలి. కొందరు గ్రామీణ విలేఖరులు- కొన్ని పాత వార్తలనే.... మక్కికి మక్కీగా ఇతర దిన పత్రికలలోచూసి వ్రాసేస్తుంటారు. ఇది మంచిపద్ధతికాదు.

ఓ విలేఖరి- ఒక సుగర్ ఫ్యాక్టరీ గురించి, దాని పుట్టుపూర్వోత్తరాలను సేకరించి; 8 కాలమ్‌ల అతిపెద్ద వార్త వ్రాసాడు. దీన్ని మిగిలిన విలేఖరులు కొన్ని నెలలు గడిచాక.... ఒక్కొక్కరూ యథాతథముగా కాపీ చేసారు. ఇందులో క్రొత్తదనము లేదు సరికదా.... ఆ ప్రాంతపు పాఠకులు "ఇది కాపీ వార్త! లోగడ చదివేసాము!!" అని అపహాస్యముగా ఎద్దేవా చేశారు. ఇది ఫక్తు చద్దివార్త! ఇందులో ప్రమాదము లేదుకాని.... పూర్తిస్థాయి కాపీకథ! ఇదే సుగర్ ఫ్యాక్టరీ గురించి- మరో విలేఖరి "రెండుకోట్ల నష్టానికి కారణము ఈ ఫ్యాక్టరీ కార్మికులే! ఫ్యాక్టరీని అనేక రకాలుగా దోచుకున్నార"ని మూడు కాలమ్స్‌లో- సుమారు అరవై సెంటీమీటర్స్ వార్త వ్రాసాడు! ఆ వార్త సంచలనము రేపింది. ఇది గడిచిన ఏడాదిన్నరకు- ఒక పత్రికా విలేఖరి ఆ వార్తను యథాతథముగా కాపీ చేసి ... తన సత్తా ప్రదర్శించాడు! ఇక్కడ పెద్ద పొరపాటు జరిగింది. మొదట వ్రాసినపుడు ఉన్నతాధికారులచే దర్యాప్తు జరిగి, సద్దుమణిగింది. తీరా.... రెండోసారి అదే వార్త వచ్చేసరికి- ఫ్యాక్టరీ యాజమాన్యము వారు- "కార్మికులు తిరిగి అదే తప్పు చేసారా?" అని ఆశ్చర్యపోయారు. తీరా పరికించి చూస్తే ... "ఇదో కాపీ వార్త! పాత చింతకాయ పచ్చడి వార్త!! సూపర్ సూపర్ చద్దివార్త!!!" అని తెలుసుకొని ఆ విలేఖరి స్థాయిని ఊహించుకోగలిగారు. పకపక నవ్వుకున్నారు.

## విలేఖరులపై దాడులు- ఖండనలు

విలేఖరుల వృత్తి సాహసాలతో కూడుకొని ఉంటుందనుటలో అతిశయోక్తి లేదు. ఎలాంటి మారణాయుధాలు, ప్రేలుడు పదార్థాలు లేకుండా.... కేవలము సిరా పోసుకొని, వ్రాసుకునే విలేఖరి 'కలము' కొంతమంది అవినీతి పరులు, భూస్వాములు, పెట్టుబడిదారులు, రాజకీయ నాయకులపై ఎక్కు పెట్టిన 'తుపాకీ'ఔతున్నది. ఈ తుపాకి (కలము) వలన నష్టపోయినవారు- విలేఖరి నిజాయతీకి తట్టుకోలేక.... అతనిపై కక్షకట్టి, దాడులు జరుపుతూ ఉంటారు. ఇలాంటి దాడులను గురించి- ఎప్పటికప్పుడు దినపత్రికలలోనేగాక; వార, పక్ష, మాసపత్రికలలో కూడా చదువుతుంటాము. మరింత

విడమర్చి- ఫొటోలతోసహా.... కథనాలు, వ్యాసాలు కొన్ని పత్రికలు ఇస్తుంటాయి.

ఈ దాడుల వలన భారతదేశమంతటా పలు భాషావిలేఖరులు దారుణముగా దెబ్బ తింటున్నారు. కొంతమంది హత్యగావింపబడుతుంటే.... మరికొంతమంది తీవ్ర గాయాలతో బయటపడుతున్నారు. ఈ కారణముగానే ... చాలామంది జర్నలిజమ్‌ను ఒకవృత్తిగా చేపట్టానికి భయపడతారు. ఈ వృత్తిని చూసి తెలిసిన వారెవరూ పెద్దగా ఆసక్తిని చూపుటలేదు. "విలేఖరిగా పని చేస్తున్నాను!" అని ఎవరైనా దగ్గరి బంధువుకో, స్నేహితునికో చెప్పుకొంటే ... పెదవి విరిచి "విలేఖరిగా చేస్తున్నావా? అది చాలా ప్రమాదకరమైనది కదా!? దాన్నెందుకు ఎంచుకున్నావు??"అని తర్కించి అడుగుతారు. "ఈ తరహా వృత్తి మంచిదికాదు. అందరికీ చెడ్డ ఔతావు. ఇప్పటికైనా వదిలేసి.... వేరేదైనా చూసుకో!" అని సలహా ఇచ్చేవారు కూడా ఉన్నారు. దీనిని బట్టి- జర్నలిజమ్‌పట్ల, విలేఖరి వృత్తిపట్ల, ప్రజలకు ఎలాంటి అభిప్రాయమున్నదో.... అవగతము చేసుకోండి!

ఇంత వరకు జరిగిన దాడులను పరిశీలిస్తే.... "జర్నలిజమ్ చేపట్టే వారికి-'రక్షణ'ఒక్క భారతదేశములోనే కాదు ...ప్రపంచము' లోనే లేద"ని డంకా భజాయించి చెప్పవచ్చు. "నిజమాడితే- నిష్ఠూరము!", "యథార్థవాది- లోక విరోధి!" అన్న రెండు సామెతలూ విలేఖరులకు సరిగ్గా సరిపోతాయి. అచి-తూచి వ్రాసినా, పేర్లు-ఊర్లు లేకుండా వ్రాసినా.... దాడులు జరిగిన సంఘటనలు కోకొల్లలు!

ఏది ఎలా జరిగినా....విలేఖరిగా కొనసాగేవారు సమాజశ్రేయస్సుకు భిన్నముగా వ్యవహరించకూడదు. ఏ ఒత్తిడులకు లొంగకూడదు. విలేఖరులు వార్తలను సృష్టించకూడదు. వాటిని అందించాలి. ఈ సత్యాన్ని, గుర్తించి- ముందుకు సాగిపోండి!

—o—

## జర్నలిజమ్‌లో - పారిభాషిక పదాలు

పదము [ఉచ్చారణ] (డిక్షనరీ అర్థము) : పత్రికా పరిభాష :

1. Accredition card [అక్రెడిషన్ కార్డ్] (అధికారపత్రము) : ప్రభుత్వము వారు జారీచేయు విలేఖరి గుర్తింపు కార్డ్.
2. Article [ఆర్టికల్](పదార్థము, వస్తువు; సంగతి, గ్రంథము) : ఒక విషయ పూర్వాపరాలను గురించి సమగ్రముగా చర్చిస్తూ.... పూర్తి వివరాలతో కూడియున్న వ్యాసము!
3. Assignment [అసైన్‌మెన్ట్] (అప్పగింత, నిర్ణయము, ప్రత్యేకించుట) విలేఖరికి- ఫలానా ప్రాంతానికి వెళ్ళి వార్తలు సేకరించమని ప్రత్యేకించుట!
4. Banner [బ్యానర్] (ధ్వజము,జెండా) : పత్రికమొదటి పేజీలోని ప్రధాన వార్తా శీర్షిక లేక 8 కాలమ్‌ల వార్తా శీర్షిక.
5. Blow-Up [బ్లో-అప్] (........): చిన్నఫొటోని పెద్దదిగా చేసి ప్రచురించుట.
6. Bottom Spread [బాటమ్ స్ప్రెడ్] (క్రింద వ్యాపించినది) : వార్తాపత్రిక అడుగున ఇచ్చే....విస్తృత వార్తా శీర్షిక.
7. Box [బాక్స్] (పెట్టె, డబ్బి) : ఆసక్తి కలిగించే ముఖ్యమైన వార్తల చుట్టూ గీతలు గీయుట. ఉదా॥
8. By-line [బై-లైన్](........): వార్తవ్రాసిన విలేఖరి పేరును ఆ వార్తకు పైనగానీ, క్రిందగానీ ప్రచురించుట!
9. Caption [క్యాప్షన్] (జడ్జ్ ఆజ్ఞ ప్రకారము బంధించుట) : ఫొటోకి సంబంధించిన వివరణ.
10. Catch-line [క్యాచ్-లైన్] (........): వార్త తరువాయి భాగాలను గుర్తించడానికి వ్రాసే వాక్యము!
11. Centre-spread [సెంటర్-స్ప్రెడ్] (........): పేజీకి మధ్యభాగాన-పెద్ద శీర్షికగా వచ్చే....వార్త లేక వ్యాసము లేక ఫొటో.
12. Classified Ads. [క్లాసిఫైడ్ యాడ్స్] (తరగతులుగా విభజించిన ప్రకటనలు) : నిర్ణీత పేజ్‌లో- ప్రతిరోజూ ఒకేస్థలములో ప్రచురించే ప్రకటనలు!

13. Clipping [క్లిప్పింగ్] (కత్తిరించిన ముక్క) : రకరకాల పత్రికలలో వచ్చు వివిధ వార్తలు, వ్యాసాలు, చిత్రాలను కత్తిరించి.... భద్రపఱచుట.

14. Cover [కవర్] [మూత,ముసుకు,ఒఱ] : నిర్ణీత కార్యక్రమాలు లేక సంఘటనల సమాచారాన్ని సేకరించి వార్తలుగా వ్రాయుట.

15. Credibility [క్రెడిబిలిటి] (నమ్మదగియుండుట, విశ్వసనీయత): కచ్చితమైన వార్తలను ప్రచురించే పత్రికలను-పాఠకులు నమ్ముట!

16. Credit-Line [క్రెడిట్-లైన్] (........) : ఛాయాగ్రహకుని పేరును- ఆ ఫొటో క్రింద ప్రచురించుట.

17. Cropping [క్రాపింగ్] (కత్తిరించుట): ఛాయా చిత్రములోని అనవసర భాగాలను కత్తిరించుట.

18. Curtain-raiser [కర్టెన్-రైజర్] (........) : ముఖ్య కార్యక్రమానికి ముందు ఉండే పరిస్థితులను వివరించుట.

19. Curtain-raiser story[కర్టెన్-రైజర్ స్టోరీ] (........): విశేష కార్యక్రమము, గొప్పసభ,అసెంబ్లీ మున్నగునవి ప్రారంభించుటకు ముందు అక్కడి పరిస్థితి, ఏర్పాట్లు, వాతావరణము వంటి అంశాలపై వార్తా కథనాలు!

20. Date-line [డేట్-లైన్] (180° రేఖాంశము) : 1] వార్త వ్రాసిన ప్రాంతము, తేది, వార్తా సంస్థపేరు. 2] నేమ్ ప్లేట్ క్రింది తేది, సంచిక పేరు మొ॥గు వివరాలు.

21. Dead-line [డెడ్-లైన్] (.... ...) : ప్రచురణ నిమిత్తము వార్తలను పంపవలసిన నిర్ణీత కాలము.

22. Deck [డెక్] (ఓడ పైభాగము, పైకప్పు): లైన్ పై భాగము.

23. Desk [డెస్క్] (ఏటవాలుగా ఉండు వ్రాతబల్ల): 1] ఎడిటోరియల్ డెస్క్, 2) రిపోర్టర్స్ డెస్క్, 3] స్పోర్ట్స్ డెస్క్ ఇలా.... ఆయా వార్తలను చూచే వారిని- ఆయా డెస్క్‌లని అంటారు.

24. Double Spread [డబుల్ స్ప్రెడ్] (........) ఏదైనా వార్త గానీ, యాడ్‌గానీ రెండు పేజీలలో ప్రచురించుట.

25. Drop Letter [డ్రాప్ లెటర్](.... ...) : పత్రికలలో 'పేరా' యందలి తొలి అక్షరాన్ని పెద్దదిగా ఉంచుట.
26. Ear-Panels [ఇయర్ ప్యానల్స్] (........) నేమ్ ప్లేట్‌కి ఇరుప్రక్కల ఉండే బాక్స్ ప్రకటనలు.
27. Embargo [ఎమ్బార్గో] (అటంకము,నిరోధము): ఫలానా సమయము-పరిస్థితులలోనే వార్తను ప్రచురించాలన్న నియమము!
28. End-mark [ఎండ్-మార్క్] (........) : వార్త ముగింపులో పెట్టేగుర్తు. కొంతమంది "E.O.M." అని వ్రాస్తారు.
29. Exclusive [ఎక్స్‌క్లూజివ్] (విడుచునట్టి, ప్రత్యేకమైన) : ప్రత్యేకముగా- ఒకే పత్రికకు వార్త వ్రాయుట లేదా ఇంటర్వ్యూ ఇచ్చుట లేదా ఏ పత్రికా ప్రచురించని వార్తను ప్రచురించుట!
30. Feature [ఫీచర్] (ముఖవైఖరి, రూపము,అకృతి,లక్షణము): ఒక విషయము లేదాసంఘటనయొక్క పూర్వాపరాలను అసక్తికరముగా వ్రాయు వ్యాసరూప వార్త!
31. Feed back [ఫీడ్ బ్యాక్] (........) : పత్రికా వార్తలకు ప్రతిస్పందించి పాఠకులు వ్రాసే ఉత్తరాలు!.
32. Filing[ఫైలింగ్] (దొంతరగా పెట్టుట) : వార్తలు వ్రాసి డెస్క్ వారికి ఇచ్చుట!
33. Filler [ఫిల్లర్] (నింపువాడు, నింపునది): పేజ్ మేకప్ చేయునపుడు- ఖాళీలు ఏర్పడితే ... సందర్భాన్నిబట్టి ఆ ఖాళీలలో చిన్నచిన్న వార్తలను నింపువాడు!
34. Flash [ఫ్లాష్] (మెఱపు, స్ఫురణము) : 1] వార్తలను 'టెలి ప్రింటర్'ద్వారా పంపుట. 2] అత్యంత ప్రధానమైన వార్తను- ఒక ప్రాంతములోని విలేఖరి- పత్రికా కార్యాలయానికి పంపుతూ.... 'టెలి ప్రింటర్' మీద "ఫ్లాష్" అని చెప్పుట, 3] హఠాత్తుగా.... అనుకోకుండా వచ్చే ముఖ్యమైన వార్త!
35. Follow-Up [ఫాలో-అప్] (........)ఒకే విషయానికి సంబంధించిన వార్తా నేపథ్యము, ఆ వార్తవలన సంభవించే పరిణామాలను ఎప్పటి కప్పుడు వార్తలుగా అందించుట!

36. **Free Lancer** [ఫ్రీ లాన్సర్] (స్వేచ్ఛగాపనిచ్చే - [illegible] బల్లెపుబంటు) : జర్నలిజమ్ని వృత్తిగా స్వీకరించి - ఒకే పత్రిక అనికాకుండా ....వివిధపత్రికలకువార్తలు,వ్యాసాలు [illegible]

37. **Hand-out** [హ్యాండ్-ఔట్] (......) : పత్రికలకు [illegible] వారి నుండి వచ్చే ప్రకటనలు.

38. **Head-line** [హెడ్-లైన్] (......) : వార్తకు [illegible]

39. **Imprint** [ఇమ్ప్రింట్] (అచ్చు వేసిన వారిపేరు [illegible] రాలు, ముద్ర, గుఱుతు): పత్రిక చివరి పేజీలో [illegible] రణకర్త పేరు, సంపాదకుని పేరు, ప్రచురణ స్థలము [illegible]

40. **In-Camera** [ఇన్-కెమేరా] (........): స్త్రీల మీద అత్యాచారాలు మఱియు ఇతర సున్నిత విషయాలపై విచారణ జరిపే నపుడు- విలేఖరులను అనుమతించకపోవుట.

41. **Jump- Head** [జంప్-హెడ్] (........): జంప్స్టోరీకిచ్చే [illegible]

42. **Jump-Story** [జంప్స్టోరి] (దాటు కథ) : పత్రిక ప్రథమ పేజీలో-వార్తలు అధికముగా వచ్చుటకై.... ఆ వార్త [illegible] వాయి భాగాలను లోపలి పేజీలలో వచ్చుట.

43. **Kill** [కిల్] (చంపు, సంహరించు): పనికిరాని, [illegible] వార్తను 'చెత్తబుట్ట'లో వేయుట!

44. **Lay-out** [లే-ఔట్] (సెలవు చేయు) : పేజీలు [illegible] ఉండాలోనని.... ముందుగానే 'ప్లాన్' చేసికొన్న [illegible]

45. **Lead** [లీడ్] (దారి చూపుట, ప్రాజాపత్యము) : వార్తలోని 'ప్రధానఅంశము'నుఎత్తిచూపిస్తూ....వ్రాసే ప్రారంభపంక్తులు!

46. **Liner** [లైనర్] (గీతలు లేక రేఖలుగానున్న): [illegible] వార్తల పరిమాణమును బట్టి ప్రతి ఫలమును పొందు వ్యక్తి!

47. **Master-head** [మాస్టర్ హెడ్] (.... ...) : ఎడిటోరియల్ పై భాగాన ప్రచురించే పత్రిక పేరు.

48. **Media.** [మీడియా.] (మాధ్యమము): వార్తాప్రసారసాధనాలు.

49. **Name plate** [నేమ్ ప్లేట్] (........):పత్రిక మొదటి పేజీలో- పై భాగమునందు ప్రచురితమయ్యే.... ఆ పత్రిక పేరు.

50. Off The Record[ఆఫ్ ది రికార్డ్]( .......): చెప్పిన విషయా లను వార్తగా వ్రాయ వలదని చెప్పుట.
51. Page Make-Up [పేజ్ మేక్-అప్] (........): కంపోజ్ మేట ర్‌ని, ఫొటోలని, శీర్షికలని పేజీలో అమర్చుట.
52. Point [పాయింట్] (చుక్క, బిందువు, శిఖరము, సంగతి, ముఖ్యాంశము, అభిప్రాయము, సమయము): అక్షరాల 'సైజ్'.
53. Scoop [స్కూప్] (పెద్ద గరిటె, పల్లము, త్రవ్వు): పరిశోధన, అధ్యయనము ద్వారా ఇతరులెవ్వరూ వ్రాయని వార్తవ్రాయుట.
54. Side-Lights [సైడ్-లైట్స్] (........) : 1] ప్రధాన కార్య క్రమము జరుగుతున్నపుడు- ఆ పరిసరాలలోనే జరుగు ఇతర విశేషాలు; 2] ఒక సభ జరుగుతున్నపుడు అక్కడి ప్రేక్షకుల ప్రతి స్పందనలు, వారి వ్యాఖ్యలు వార్తలుగా వ్రాయుట.
55. Slanting [స్లాన్‌టింగ్] (ఏటవాలైన) : వ్రాయుట, పదాల వాడుక, పదనిర్మాణము మొ॥గు వాటికి నియమా లేర్పఱచుట.
56. Slug-line [స్లగ్-లైన్] (........) : కంపోజింగ్‌లో పేజీలు తారు-మారు కాకుండా వార్తకు సంబంధించిన ఒక పదాన్ని, పేజ్ నంబర్‌ని ఆ పేజ్‌కి పై భాగాన కుడి ప్రక్కన పెట్టుట.
57. Story [స్టోరీ] (కథ, వృత్తాంతము, చరిత్రము) : 1] ఫైల్ చేసిన వార్త, 2] ఏదైనా విషయము పైన వ్రాసిన వార్త.
58. Stringers [స్ట్రింగర్స్] (........) : నామకా పారితోషికము తీసికొని 'పార్ట్‌టైమర్స్'గా వార్తలు వ్రాసే వారు!
59. Supplement [సప్లిమెన్ట్] (అనుబంధము, శేషపూరణము) : ప్రత్యేక అనుబంధము.
60. Tabloid [టాబ్లాయిడ్] (........): దిన పత్రిక సైజ్‌లో- సగము మాత్రమే ఉండే పత్రికలు.
61. Take [టేక్] (తీసుకొను, గ్రహించు): టెలి ప్రింటర్‌పై- దఫ దఫాలుగా వచ్చే వార్తలు.
62. Tape [టేప్] (నాడా, నవారు): టెలి ప్రింటర్‌లో- అక్షరాలు ప్రింటయ్యే పేపర్.



# విశేష 'ప్రజాదరణ' పొందిన మా ప్రచురణలు

.. ప్రభాకరబాబు, M.B.B.S., I.A.S.E.C.T. గారి ...

| | |
|---|---|
| ఆహారం - వైద్యం | 12-00 |
| ఆహారం-వైద్యం-2 | 18-00 |
| మెడికల్ బుక్ | 13-00 |
| సెక్స్ పవర్ | 13-00 |
| సెక్స్ సైన్స్ | 12-00 |
| ఎలర్జీ వ్యాధులు | 12-00 |
| ఆరోగ్య దీపిక | 10-00 |
| ..్స ఎడ్యుకేషన్ | 15-00 |

క.వి.ఎన్.డి. ప్రసాద్, D.H.M.S., M.H.S. (London) గారి ...

| | |
|---|---|
| వైద్య ప్రపంచము | 12-00 |
| ప్రకృతి వైద్యం | 14-00 |
| మెడికల్ గైడ్ | 8-00 |
| హెల్త్ & బ్యూటి | 15-00 |
| యోగశాస్త్రం | 16-00 |
| సెక్స్ & హోమియో | 18-00 |
| ..మియో వైద్యం | 15-00 |
| హోమియో వైద్యం - 2 | 10-00 |
| మెడికల్ డిక్షనరి | 12-00 |
| అయస్కాంత చికిత్స | 10-00 |
| ..థమ చికిత్స | 8-00 |

..ర కోటేశ్వరరావు, M.A. గారి ...

| | |
|---|---|
| ..బ్రివేషన్స్ డిక్షనరి | 12-00 |
| జనప్రియ "జనరల్ నాలెడ్జ్" | 18-00 |
| ..ll in All జనరల్ నాలెడ్జ్ | 10-00 |
| మిని' జనరల్ నాలెడ్జ్ | 6-00 |
| 'జనప్రియ' ఇంగ్లీష్ గ్రామర్ | 12-00 |
| ✦ పాకెట్ కేలండర్ & నోట్ బుక్ | 5-00 |

..్రా సత్యనారాయణ, B.Sc., B.Ed. గారి ...

| | |
|---|---|
| ✦ లేటెస్ట్ జనరల్ నాలెడ్జ్ | 12-00 |
| ✦ క్విజ్ పవర్ | 9-00 |
| ✦ వెర్బ్స్ డిక్షనరి | 12-00 |
| ✦ కామన్ ఎర్రర్స్ | 10-00 |
| ✦ వంటలు - పిండి వంటలు | 12-00 |
| ✦ జోక్స్ వరల్డ్ | 8-00 |
| ✦ ఎడ్జెక్టివ్స్ | 12-50 |
| ✦ లెర్నర్స్ డిక్షనరి | 9-00 |
| ✦ ఇంగ్లీషు స్పీకింగ్ కోర్స్ | 10-00 |
| ✦ జనప్రియ "ఆంగ్లభాష" | 12-00 |
| ✦ ఆర్టికల్స్ (A, An & The) | 10-00 |
| ✦ స్వయం ఉపాధి (కుటీర పరిశ్రమలు) | 12-00 |

| | |
|---|---|
| 'నవభారత్' G.K. | 12-00 |
| ✦ 'ఇన్నోవేటివ్' ఇంగ్లీష్ గ్రామర్ | 10-00 |
| ✦ R.R.B. గెస్ పేపర్స్ | 12-00 |

అన్నవరపు కుమార్, M.A., M.Phil., B.L., P.G.D.P.R. గారి ...

| | |
|---|---|
| ✦ S.S.C. (క్లర్క్స్ గ్రేడ్) ప్రీవియస్ & గెస్ పేపర్స్ | 12-00 |
| ✦ టీచర్స్ రిక్రూట్‌మెంట్ గైడ్ | 17-00 |
| ✦ A.P.P.S.C. గ్రూప్ -I ప్రీవియస్ & గెస్ పేపర్స్ | 12-00 |
| ✦ B.S.R.B. (R.R.B) ప్రాక్టీస్ పేపర్స్ | 25-00 |
| ✦ B.S.R.B. (P.S.Bs.) గెస్ పేపర్స్ | 13-00 |

పి. నాగేంద్ర ప్రసాద్, B.Sc., B.Ed., గారి ...

| | |
|---|---|
| ✦ ఇన్నోవేటివ్ ఇంగ్లీష్ గ్రామర్ | 10-00 |
| ✦ A.P. హిస్టరీ స్పెషల్ క్విజ్ | 8-00 |
| ✦ క్విజ్ "ఇండియా" | 8-00 |
| ✦ పరీక్షలు - ప్రథమ శ్రేణి | 18-00 |
| ✦ త్రిభాషా డిక్షనరి (తెలుగు-ఇంగ్లీష్-హిందీ) | 12-00 |
| Learner's G.K. | 8-00 |
| గార్డెనింగ్ | 10-00 |

ఎమ్.డి. నఫీజుద్దీన్ (సౌజన్య), M.A. గారి ...

| | |
|---|---|
| ✦ వర్డ్ పవర్ | 6-00 |
| ✦ ఇడియమ్స్ & ఫ్రేజెస్ | 8-00 |
| లెటర్ రైటింగ్ | 10-00 |
| పరీక్షల్లో ఫస్ట్ ర్యాంక్ రావాలంటే... ? | 10-00 |

యర్రు కృష్ణార్జునరావు, B.Com. గారి ...

| | |
|---|---|
| లాలీ జోక్స్ | 8-00 |

'జ్యోతిషాగమ వాస్తు పండిట్'

ఎమ్. సత్యనారాయణ సిద్ధాంతి గారి...

| | |
|---|---|
| ✦ వాస్తు శాస్త్రము | 15-00 |
| ✦ వాస్తు యంత్ర రత్నావళి | 16-00 |
| ✦ గృహ వాస్తు చంద్రిక | 12-00 |
| ✦ గృహవాస్తు సారము | 10-00 |
| ✦ జ్యోతిష శాస్త్రము | 20-00 |
| ✦ దత్తాత్రేయ తంత్ర విద్య | 15-00 |
| ✦ యోగసాధన | 10-00 |
| ✦ కుండలినీ శక్తి | 10-00 |
| ✦ మంత్రశక్తి | 10-00 |
| ✦ గోచార గ్రహఫలితాలు | 9-00 |
| ✦ అష్టనాగ పూజ | 6-00 |
| ✦ స్తోత్ర రత్నమాల | 8-00 |
| ✦ అందానికి మార్గాలు | 6-00 |
| ✦ అంగ సాముద్రిక శాస్త్రము | 12-00 |

CONT....